221/1-78

# తమిళ సాహిత్య చరిత్ర

రచయిత :

డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మ









ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవన్ - హైదరాబాద్ - 500004

# తమిళ సాహిత్య చరిత్ర

రచయిత :

డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మ



ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవన్ - హైదరాబాద్ - 500004

నా గురుదేవులు

శ్రీ చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రికి

సభక్తికముగా సమర్పితము

# మనవి మాటలు

ప్రాచీనమూ సుసంపన్నమూ అయిన తమిళ సాహిత్య చరిత్రను స్థూలారుంధతీ న్యాయంగా నైనా తెలుగువారికి తెలియజేయాలని నా చిరకాల వాంఛ. నీత్యుద్బోధక రచన అయిన తిరుక్కుఱళ్, రసవత్కావ్యములైన సిలప్పదికార, కంబరామాయణములు మొదలైనవి ఏ భాషవారినైనా అలరించగలవని నా నిశ్చితాభిప్రాయం. ఇటువంటి అనర్ఘరత్నములతో ప్రతిభాసించే తమిళ సాహిత్యం లోని ప్రధానఘట్టములను తెలిసినంతవరకూ ఈ పుస్తకంలో వివరించాను. దొసగులు దొరలివుంటే, అది నా అజ్ఞత. గ్రంథ రచనావసరమున ప్రసిద్ధ తమిళ రచయితల రచనలను సంప్రతించాను. వారికి నేను మిక్కిలి కృతజ్ఞుణ్ణి.

తమిళ సాహిత్య చరిత్రను వ్రాయవలసిందిగా నన్ను కోరిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి - ముఖ్యంగా అకాడమీ అధ్యక్షులూ బహుభాషా కోవిదులూ అయిన డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారికీ, సహృదయులూ సాహితీ వేత్తలూ అయిన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికీ - వినయపూర్వకంగా నా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను.

తమిళ సాహిత్యం గురించి ఏమాత్రమైనా తెలుసుకోడానికి ఈ పుస్తకం ఉపకరిస్తుందని నా నమ్మకం. నా కృషిని సహృదయులైన సోదరాంధ్రులు ఆదరిస్తారనీ నా నమ్మకం.

- చల్లా రాధాకృష్ణ శర్మ

# విషయసూచిక

# 1. మున్నుడి

## తమిళ శబ్దము

తమిళసాహిత్య చరిత్రను పరిశీలించుటకు పూర్వం, తమిళ్[1] శబ్దవ్యుత్పత్తిని గురించి తద్భాషాపండితులు ప్రకటించిన అభిప్రాయములు తెలుసుకోవడం సమంజసం. తమిళ్ అనే మాటకు నిఘంటువులో కనిపించే అర్థం మాధుర్యం. తూర్పుఆఫ్రికాలోని జాంజిబార్ దేశంలో వ్యవహృతమయ్యే స్వాహిలి అనేభాషలో తము శబ్దమునకు మాధుర్యమని అర్థం చెప్పబడుతున్నదట. పారసీక భాషలో జ్ఞానమనే అర్థంలో తమిస్ అనే మాటను వాడుతున్నారు.[2]

కొందరు తమిళపండితులు తమి + ఇళ్ అని తమిళ శబ్దమునకు అర్థం చెపుతారు. తమి అనగా ప్రత్యేకము; ఇళ్ అనగా మధురము. కనుక తమిళం స్వతంత్రమూ మధురమూ అయినభాష అని వారి అభిప్రాయం. 'తేనుత్తెత్తమిళ్' (తేనెవలె తీయని తమిళము), 'తమిళ్ తళీ ఇయళాయంపర్'[3] — అని ప్రాచీన తమిళ విద్వాంసులు తమభాషనుగూర్చి పేర్కొన్నారు. పింగలందై అనే ప్రశస్తమైన ప్రాచీన నిఘంటువును కూర్చిన పింగళముని ఇలా పేర్కొన్నాడు. "ఇనిమైయుం (మాధుర్యం), నీర్మైయుం (సంస్కరించబడింది) తమిళెనలాగుం." ఇక్కడ ప్రయుక్తమైన తమిళ శబ్దానికి మాధుర్యమనే అర్థం. కాగా, తెలుగువలె తమిళంకూడా తీయనిభాష అని స్పష్టమవుతున్నది.

## ద్రావిడ శబ్దము

ద్రావిడభాషల విషయంలో-ముఖ్యంగా, తమిళ భాషా సాహిత్యాలలో-ప్రశంసార్హమైన కృషి సలిపిన బిషప్ కాల్డ్వెల్ తమిళశబ్దం సంస్కృత శబ్దమైన ద్రావిడ శబ్దభవమని నిర్ణయించిన విషయం భాషాతత్త్వజ్ఞులకు తెలిసిందే. సంస్కృత ప్రాకృత గ్రంథాలలో ద్రవిడ, దమిలో, దామిలో, ద్రమిళఅని తమిళం పేర్కొనబడింది. ద్రావిడంలోని దకారం తొలుత ళకారంగానూ పిమ్మట ఴకారం

గానూ రూపొంది వుంటవచ్చు నని కాల్డ్వెల్ నమ్మకం. ద్రవిడ, దమిడ, దమిళ దమిళ్ అని వేర్వేరు కాలాలలో వ్యవహృత మవుతూ వచ్చి చివరికి ద్రవిడశబ్దం భాషాస్వభావం అనుసరించి తమిళ్‌గా మార్పుచెందెనని చెప్పవచ్చు

నేటికి మున్నూరేండ్లకు మునుపు నివసించిన సుబ్రహ్మణ్య దీక్షితర్ అనే పండితుడు తొలుత ఈ వాదమును తన తమిళ్ ప్రయోగ వివేకం అనే గ్రంథంలో ఉదాహరించినట్లు రా. రాఘవ అయ్యంగారు పేర్కొన్నారు.[4]

కాల్డ్వెల్ సిద్ధాంతములతో చాలవరకు ఏకీభవిస్తున్న తమిళ పండితులు ఈ విషయంలో భిన్నభిప్రాయాలు వెల్లడించారు. పైగా, ద్రావిడ శబ్దం కూడా సంస్కృతశబ్దం కాదనివాదించే తమిళపండితులూ కొందరు లేకపోలేదు. తిరు + ఇడం (తిరువిడం - పుణ్యభూమి) అనే తమిళ శబ్దమును ద్రవిడంగా సంస్కృత పండితులు సంస్కృతీకరించుకున్నారని వారి అభిప్రాయం.[5] మరి కొందరు తుఱై వీడు అనే అరవ మాటను సంస్కృతీకరించగా ద్రావిడశబ్దం ఏర్పడినట్లు భావించారు. ప్రాచీన తమిళులు సముద్రముల మీద సఋరులు చేసి, విదేశాలలో వర్తక వాణిజ్యాలు సాగించారు ఆ రోజుల్లో కొర్కై, ముసిరిస్ (క్రాంగనూర్), పుహార్ (కావేరిపూం పట్టణం) మొదలైనవి వార్తకెక్కిన రేవు పట్టణాలు. రేవుపట్టణమును తమిళంలో తుఱైముగం అని వ్యవహరిస్తారు: తుఱైముగములు కల దేశంకనుక ద్రావిడమనే వ్యవహారం ఏర్పడి ఉండవచ్చునని పై వాద సారాంశం.

ప్రాచీన తమిళ సాహిత్యంలో-అనగా, తొల్కాప్పియం మొదలైన గ్రంథాలలో-తమిళశబ్దం ప్రయుక్తమైనది కనుకను, తమిళంలోని 'ఴ' కారం సంస్కృతాద్యార్య భాషలలో లేదు కనుకను,. తమిళ్ శబ్దం తమిళ్‌భాషా శబ్దమే కాని పర భాషా శబ్దభవం అనడం అసంగత మని కొందరి అభిప్రాయం.

తమిళం, ద్రావిడం - ఈ రెండూ సమానార్థకములు కావని కార్తికేయ ముదలియార్ అనే ఒక పండితుడు పేర్కొన్నారు. తమిళం నుంచి యేర్పడిన భాషలకు ద్రావిడభాషలు (తళిమొళిగళ్) అనే పేరు కలిగిందనీ, కనుక తమిళమునకూ ద్రావిడభాషలకూ జన్యజనక సంబంధం కలదనీ ఆయన పేర్కొన్నారు.[6] పరిశోధనవల్ల నూతనాంశము లెన్నో బయల్పడుతున్న యీ రోజులలో

కూడా ఈవాదం సత్య సమ్మతమని తమిళ పండితులు కొందరు భావించడం శోచనీయం.[7]

తమిళం ప్రాచీనమైనభాష. తెలుగు, కన్నడం మొదలైన భాషలలో సంస్కృత వాణి విహరించినంత స్వేచ్ఛగా తమిళంలో విహరించలేదు. ఇలా పేర్కొనడంవల్ల, తమిళభాషా వాఙ్మయాలపై సంస్కృత భాషావాఙ్మయముల ప్రభావం ఏమీ లేదని భావించరాదు. మహాభారతం తెలుగు సాహిత్యంలో వెలసిన తొలికావ్యం. కన్నడంలోనూ భారతకథను అభివర్ణించే గ్రంథమే ఆదికావ్యమయింది. మలయాళ సారస్వతంలో వెలసిన ప్రాచీనకావ్యం రామచరితం. ఈ ద్రావిడ భాషలలో వెలసిన తొలి రచనలలోని యితివృత్తములు భారత రామాయణముల నుంచి గ్రహించబడినవే. కాని తమిళ సాహిత్యంలోని తొలి రచనలు స్వతంత్రములు: ఇతివృత్త స్వీకరణ, కథా సంవిధానం, వర్ణనలు మొదలైన వాటియందు ప్రాచీన తమిళ కవులు తమ ప్రత్యేకతను చాలావరకు ప్రదర్శించ గలిగారు జైనబౌద్ధుల సంపర్కమునకు పిమ్మట, తమిళ సాహిత్యం తన ప్రత్యేకతను కోల్పోయినట్లు విజ్ఞుల విశ్వాసం.

## తమిళ భాషా ప్రాచీనత

ఇక తమిళభాషా ప్రాచీనతను పరిశీలిద్దాము. ఒకానొకప్పుడు తమిళం భారతదేశంలోనే కాక అసీరియా, బాబిలోనియా మొదలైన దేశాలలోకూడా ప్రచారంలో ఉండేదనీ, ఇటలీయందలి టాస్కనీలో వ్యవహృత మయ్యే భాష తమిళ మాండలికమని చెప్పవచ్చుననీ, సంస్కృతం, గ్రీకు మొదలైన భాషలలోకి కూడా అరవమాటలు కొన్ని ప్రవేశించినవనీ ఒక తమిళ పండితుడు పేర్కొన్నాడు.[8] రమారమి 20,000 సంవత్సరాలకు పూర్వం భారతదేశంలో వాడుకలో ఉన్న భాషలు చాలవరకు తమిళమునకు సన్నిహితంగా ఉండేవనీ, కనుక ఉత్తర భారతంలోని భాషలు ఆర్యభాషా కుటుంబమునకు చెందినవిగా ఈనాడు వ్యవహృత మవుతున్నప్పటికీ, ఒకానొకప్పుడు అవి తమిళమునకు సన్నిహితంగా ఉండేవనీ పి. టి. శ్రీనివాస అయ్యంగారి అభిప్రాయం.[9] దామోదరంపిళ్లై

క్రీ.పూ. 12,000 కు పూర్వమే తమిళ భాషా సాహిత్యములు ప్రచారంలో ఉండేవని తెలియజేశారు. ఈవిషయమై పరిశోధనలు చేసిన కనకసభాపతిపిళ్లై, కృష్ణస్వామి అయ్యంగారు, వి.జి. సూర్యనారాయణశాస్త్రి ప్రభృతులు భిన్నాభిప్రాయులై ఉన్నారు. ఈ విధంగా తమిళ పండితులు తమ భాషా ప్రాచీనతను క్రీస్తునకు పూర్వం కొన్నివేల సంవత్సరాల దాకా తీసుకువెళ్లారు.

తమిళపండితులు పేర్కొనిన మరికొన్ని విషయాలను కూడా సంగ్రహంగా ఉదాహరిస్తాను.[10]

మనువు ద్రావిడ దేశాధిపతి. అతని సంతతి వారయిన శిబి, ముచుకుందుడు మొదలైనవారు తమిళభూపతులు. మనువుకి సంబంధించిన ఐతిహ్యం ఒకటి ఉన్నది. అతనికి యముడనే కుమారుడు, ఇళై అనే కుమార్తె ఉండేవారు. వృద్ధుడైన తర్వాత, మనువు తనరాజ్యమును రెండు సమభాగాలుగా చేసి వాటిని తన సంతానానికి ఇచ్చాడు. ఇళై పరిపాలించిన దేశమునకు కుమరినాడు అనే పేరు అప్పటినుంచీ కలిగింది. అంతేకాదు; తదాదిగా ఆ రాజ్యమును మహిళలే పరిపాలించారు. నేటికీ మలబారు ప్రాంతంలో మహిళలకు గౌరవప్రపత్తులు ఎక్కువగా ఉండడానికి కారణం బహుశః ఇళైప్రభావ మని చెప్పవచ్చు. కొంతకాలానికి యముని రాజ్యం కడలిలో కలిసి పోయింది. ఆవిధంగా తమిళనాడులోని కొంత భాగం భ్రష్టమైపోయింది. క్రీ పూ. 9564 సం॥ ప్రాంతమున భూకంపముల వల్లనూ వెల్లువల వల్లనూ ప్రపంచంలోని కొన్ని ప్రదేశాలు నామరూపాలు లేకుండా నశించిపోయినవి. ఆ ప్రళయంలోనే కుమరినాడు కూడా సముద్రంలో కలిసిపోయి వుండాలి. కుమరినాడుకు ఉత్తర సరిహద్దు వింధ్యాద్రి.

ఈ విషయాదికంలోని సత్యాసత్యములు ఎలాఉన్నా, తమిళశబ్దం ద్రావిడ శబ్దభవమనీ, తమిళ భాషాసాహిత్యములు అత్యంత ప్రాచీనములనీ చెప్పవచ్చు. ఒక్కవిషయం. లిపిసహాయం లేకుండా సాహిత్యం వ్యాప్తిలోకి రాదని పండితులు అంగీకరించిన అంశమే చరిత్రకు తెలియవచ్చినంతవరకూ బ్రాహ్మీ

లిపియే మనదేశంలోని ప్రాచీనలిపి. బ్రాహ్మీశాసన రచనాకాలం క్రీ. పూ. 3వ శతాబ్ది అని పండితుల విశ్వాసం. కనుక తమిళసాహిత్యం క్రీ. పూ. 3వ శతాబ్దికి తర్వాత వ్యాప్తిలోకి వచ్చివుంటుందని పేర్కొనవచ్చు. సుప్రసిద్ధ పండిత పరిశోధకులైన యస్. వైయాపురిపిళ్లై ఈవిధంగానే విశ్వసించారు.[11]

## తమిళ లిపి

ఇక తమిళలిపిని గురించి రెండుమాటలు. తమిళమునకు అక్షరములు 30. వీటిలో అచ్చులు 12, హల్లులు 18. ఒత్తక్షరములు లేవు.

అచ్చులు: అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ.

హల్లులు: పరుషములు. క చ ట త ప ఱ.

అనువాసికములు: ఙ ఞ ణ న మ న.

అంతస్థములు: య ర ల వ ఴ ళ.

ఉచ్చారణలో, పరుషములు సరళములుగా మార్పు చెందడం గమనించదగిన విషయం. పుత్తకం (పుస్తకం) అని వ్రాసినా, పుత్తగం లేక పుత్తహం అని ఉచ్చరించడం తమిళులకు పరిపాటి. మరికొన్ని మాటలు.

కటితం - కడిదం (ఉత్తరం, జాబు)
పుత్తి - బుద్ది (బుద్ధి)
వన్తాన్ - వన్దాన్ (వచ్చెను)

అలాగే, నకార ఱకారములు ఉచ్చారణలో న్ద్రిగామారును. ఉనా;

కొన్ఱు - కొన్ద్రు (చంపు)
వెన్ఱు - వెన్ద్రు (జయించు)
పన్ఱి - పన్ద్రి (పంది)

తమిళంలో ∴ అనే అక్షరం ఒకటి ఉన్నది. దీనికి ఆయ్దం అని పేరు. ఉచ్చారణలో ఇది హ గా మారుతుంది. ఉదా: ఎ ∴ కు, ఎహ్కుగా (ఉక్కు) ఉచ్చరించబడుతుంది.

బ్రాహ్మీలిపినుండి తమిళలిపి యేర్పడి వుండవచ్చు నని విజ్ఞుల విశ్వాసం. ఇది సత్యసమ్మతం. బ్రాహ్మీలిపి దక్షిణాపథంలో వట్టెళుత్తుగానూ, గ్రంథలిపిగానూ మార్పు చెందింది. ఈ రెండు లిపులూ నేటి తమిళలిపికి రూపరేఖలు దిద్దినవి. గ్రంథలిపిలో మొనమొన్నటిదాకా తమిళులు సంస్కృత గ్రంథాలు ప్రకటించేవారు. పైగా, గ్రంథలిపిని పురస్కరించుకుని నేటి తమిళ, మళయాళలిపులకు మధ్యగల దగ్గరి చుట్టరికమును నిర్ణయించవచ్చు. ఎందుకంటే, మలయాళలిపికి కూడా వట్టెళుత్తు, గ్రంథలిపులే ఆధారం.

---

1. తెలుగులో 'ఴ' కారం భ్రష్టం కావడంవల్ల, దానికి బదులుగా ళకారం వాడబడింది.
2. రా. రాఘవ అయ్యంగారు: "తమిళ్ వరలాఱు", పుట 9.
3. ఈ వాక్యం తమిళ పంచకావ్యములలో ఒకటి అయిన జీవక చింతామణి లోనిది. ఇందులోని తమిళ శబ్దమునకు మనోజ్ఞమని అర్థం చెప్పబడుతున్నది.
4. తమిళ్ వరలాఱు.
5. మ. కార్తికేయ ముదలియారు: "మొళినూల్" (1913).
6. మొళినూల్, పుట 41. ("తమిళిన్ వళిమొళి తెలుంగు...")
7. సుప్రసిద్ధ నాటకకర్త పె. సుందరం పిళ్లై తన "మనోన్మణీయం" అనే నాటకంలో తమిళతల్లిని ప్రస్తుతిస్తూ ఇలా పేర్కొన్నారు:

"కన్నడముం కళి తెలుంగుం కవిన్ మలైయాళముం తుళువు ఉన్ ఉదర త్తుది త్తెళున్దే ఒన్ఱు పలవాయిడునుం - " కన్నడం తెలుగు మొదలైనవి తమిళజననికి ఉదయించిన భాషలని ఆయన స్పష్టం చేశారు.

8 కందయ్యా పిళ్ళై: "తమిళగం."

9. వివరములకు టి. ఆర్. శేష అయ్యంగారు: **Dravidian India,** పుటలు 77 – 88.

10. తమిళగం.

11. **History of Tamil Language and Literature,** పుట 10.

వైయాపురి పిళ్ళై చాలాకాలం మదరాసు విశ్వవిద్యాలయంలో తమిళభాషా శాఖాధ్యక్షులుగాను, కొంతకాలం తిరువాంకూరు విశ్వవిద్యాలయంలో తమిళ సాహిత్యాచార్యులు గానూ పనిచేశారు. బహుగ్రంథకర్తలు.

—o—

# 2. సంగయుగము

## యుగవిభజన

తమిళ లాక్షణికులు తమిళసాహిత్యమును ఇయల్ (సాహిత్యం). ఇశై (సంగీతం), నాటకం అని విభజించారు. ఇలక్కణం (లక్షణం), ఇలక్కియం (లక్ష్యం), అని ఇయల్‌ని విభజించారు. లక్షణశాస్త్రంలో ఎళుత్తు (అక్షరామ్నాయము), చొల్ (శబ్దము), పొరుళ్ (కావ్యవస్తువు) అనే మూడు భాగములున్నవి

తమిళ సాహిత్య చరిత్రను కొందరు ఈ విధంగా విభజించారు.

1. సంగయుగం
2. జైన బౌద్ధుల యుగం
3. శైవ వైష్ణవాచార్యుల యుగం
4. కవిత్రయ యుగం
5. పురాణేతిహాస యుగం
6 ఆధునిక యుగం

మరికొందరు యుగవిభజన ఇలా చేశారు.

1. సంగ కాలం
2. సంగమునకు తరువాతి కాలం
3. పల్లవుల కాలం
4. చోళుల కాలం
5. నాయర్‌రాజుల కాలం
6. ఐరోపీయుల కాలం
7. ఆధునిక యుగం

సంగయుగపు సారస్వతమునకు సంబంధించిన వివరాలు సుస్పష్టంగా తెలియరాలేదు, కొందరి దృష్టిలో సంగం కల్పనే అయినప్పటికీ, ప్రాచీన తమిళ గ్రంథాలు కొన్నిటిలో సంగ ప్రశంస కనిపించడం గమనించదగిన అంశం. ఇఱైయనార్ అనేకవి సంతరించిన అగప్పొరుళ్[1] అనే లక్షణ గ్రంథములకు సంతరించబడిన వ్యాఖ్యానంలో సంగ ప్రశంస మొదటిసారిగా కనిపిస్తున్నది. ఇఱైయనార్ అనగా భగవంతుడని అర్థం. కనుక ఈ గ్రంథం శివునిరచన అని కొందరి నమ్మకం. ఈ గ్రంథ వ్యాఖ్యాత తమిళనాడున వర్ధిల్లిన మూడు సంగము లను వర్ణించాడు. కాని ఆ వర్ణనాంశములు విశ్వసనీయములు కావని పరిశోధకుల తలంపు.[2]

సంగశబ్దం సంస్కృత శబ్దమైన సంఘమునకు రూపాంతరం. జైన బౌద్ధుల కాలంలో సంఘం ప్రచారంలోకి వచ్చింది. మహావీరుని అనుయాయులైన శ్రావికా శ్రావకుల ధర్మబద్ధమైన సమూహమును జైనులు సంఘమని వ్యవహరించారు. అలాగే బౌద్ధ ధర్మావలంబకులైన సన్న్యాసినీ సన్న్యాసుల సమూహమును కూడా సంఘమని వ్యవహరించారు. ప్రపథమ జైనసంఘం క్రీ.శ. 470వ సంవత్సరమున మధురా నగరంలో స్థాపించ బడినట్లు తెలియవస్తున్నది. సంగమునకు సమానార్థకములైన తమిళ శబ్దములు కూడల్, కళగం మొదలైనవి. మధురలో సంఘం వెలసిన కారణంగా, ఆ నగరానికి కూడల్ అనే నామాంతరం కలిగింది.

## సంగకాల నిర్ణయము

ఇక పండితుల భిన్నాభిప్రాయములకు పాల్పడిన సంఘకాల నిర్ణయమును దిఙ్మాత్రంగా పరిశీలిద్దాము.

సంగయుగము క్రీస్తునకు పూర్వమే ప్రారంభమై, క్రీస్తునకు వెనుక ఒకటి రెండు శతాబ్దులలో ముగిసినట్లు కొందరి అభిప్రాయం. మరికొందరు క్రీ. శ.7,8 శతాబ్దులలో సంగములు వర్ధిల్లినట్లు విశ్వసిస్తున్నారు కాని యీ శతాబ్దులలో

దక్షిణాపథంలో పల్లవభూపతులు రాజ్యాధికారం చేస్తూ ఉండేవారు. శైవ వైష్ణవ మతములు ప్రచుర ప్రచారంలో ఉండేవి. కాని సంగవాఙ్మయంలో జైన బౌద్ధ మత ప్రశంసా, తమిళరాజ్యమునకు చెందిన చేర, చోళ, పాండ్య మహీపతుల ప్రశంసా కనిపిస్తున్నవి. అందువల్ల 7, 8 శతాబ్దులలో గాక, అంతకుపూర్వమే సంగవాఙ్మయం వెలుగులోకి వచ్చి ఉండాలి.

పండితాదరమును పొందిన మరొక వాదమును కూడా పరిశీలిద్దాము. క్రీ. శ. మొదటి శతాబ్దిలో సంగయుగం ప్రారంభ మయిందని పలువురు భావిస్తున్నారు. వంజి పట్టణంలో సతీదేవి అని శాశ్వతకీర్తి గడించిన కణ్ణకీదేవికి ఆలయం నిర్మించిన చేరభూపతి సెంగుట్టువనూ, సింహళదేశపు మన్నీడు గజబాహు చక్రవర్తి (క్రీ. శ 17 -93) సమకాలికులని సింహళద్వీప చారిత్రక లేఖనమైన మహావంశం స్పష్టం చేస్తున్నది. సెంగుట్టువన్ సోదరుడైన ఇళంగో, కణ్ణకికథను అభివర్ణించే సిలప్పదికార కావ్యమును వెలయించాడు. కాగా, సంగ యుగం క్రీ శ. మొదటి శతాబ్దికి మునుపే ప్రారంభ మైనట్లు భావించవచ్చు.

కవి సమూహమును 'సంగ' మనవచ్చు. అటువంటి కవి సమూహములు మూడు వర్ధిల్లినవి. వాటిని తలైచ్చంగం (తొలిసంగము), ఇడైచ్చంగం (మధ్య సంగము), కడైచ్చంగం (కడ సంగము) అని వ్యవహరిస్తారు. కవుల కావ్యముల లోని బాగోగులను నిర్ణయించి సత్కావ్య నిర్ణయం చెయ్యటమే సంగంకవులు చెయ్యవలసిన పని. ఆ విధంగా సంగ కవుల ఆమోద ముద్రను పొందిన రచనలే ప్రచారంలోకి వచ్చేవి.

సంగ కాలములో వెలువడిన కావ్యము లన్నిటినీ ద్వివిధంగా విభజించ వచ్చు. అగం (మధురగాథలు), పుఱం (వీరగాథలు) అనేవి ఆ విభాగములు. అగనానూఱు, పుఱనానూఱు అనే ప్రశస్త సంకలన కృతులు ఈ రెండు విభాగ ములకు ప్రాతినిధ్యం వహిస్తున్నవి. సంగకాలపు సాహిత్యం ఆనాటి తమిళ సంఘమును మధుర మనోజ్ఞంగా చిత్రిస్తున్నది. తమిళుల ఆచార వ్యవహారములు, వారి పెండ్లి పేరంటములు, తమిళ మహీపతుల గుణ గణములు, వారి యుద్ధ విధానములు మొదలైన వాటిని తెలుసుకునేందుకు సంగకాలపు కృతులు అవశ్య పఠనీయములు. ఒక్క మాటలో చెప్పవలెనంటే, సంగయుగపు సాహిత్యం ఆనాటి తమిళ సంఘజీవిత దర్పణం.

## తొలి సంగము

కూడల్ నామాంతరం గల మధురానగరంలో ఈ సంగము వర్ధిల్లింది. ఇందులో 549 మంది కవులు ఉండేవారనీ శివుడు, మురుగన్ (సుబ్రహ్మణ్యుడు), అగత్తియన్ (అగస్త్యుడు) మున్నగువారు సభ్యులుగా ఉండేవారనీ పండితులు చెపుతారు. ఈ సంగము 4,440 సంవత్సరాలు వర్ధిల్లిందట! ఆ తర్వాత మధురా నగరం సముద్రంలో కలిసిపోయిందట. పరిపాడల్, ముదునారై, మురుకురుకు- ఇంకా మరికొన్ని కృతులు ఈ కాలంలో వెలుగులోకి వచ్చినట్లు వ్యవహారం. వీటిలో అగస్త్యుడు వ్రాసినట్లుగా చెప్పబడే అగత్తియం ముఖ్యంగా పేర్కొన దగింది. ఇది లక్షణ గ్రంథం. తమిళ లక్షణశాస్త్రమునకు మాతృక అనదగిన రచన యిదే అగత్తియమును ఆధారం చేసుకుని తరువాతి లాక్షణికుడైన తొల్కాప్పి యనార్ వ్యాకరణం వ్రాసినట్లు ప్రతీతి. కాని అగత్తియం పూర్తిగా లభించక పోవడం దురదృష్టం. ఇందులో 12,000 సూత్రములు కలవట! కొన్ని మాత్రమే లభ్యములు. వీటిని భవానందం పిళ్లై ఒక పుస్తకంగా ప్రకటించారు.

మహేశ్వరుడు పాణినికి సంస్కృత వ్యాకరణమునూ, అగస్త్యునికి తమిళ వ్యాకరణమునూ ప్రసాదించినట్లు ఒక ఐతిహ్యం.[3] కనుక అగస్త్యుడు పాణినికి సమకాలికు డవుతున్నాడు. అయితే, పాణిని కాల నిర్ణయంలో పండితలోకంలో అభిప్రాయ భేదాలుకలవు క్రీ. పూ. 4వ శతాబ్దిలో పాణిని నివసించినట్లు పాశ్చాత్య విద్వాంసులూ, క్రీ పూ. 7వ శతాబ్దిలో వర్ధిల్లినట్లు ఆర్. వి. భండార్కర్ మొదలైన ప్రాచ్య పండితులూ సంభావించారు. ఏది ఎలా ఉన్నప్పటికీ, పాణిని బహు ప్రాచీనుడవడం నిర్వివాదం. కాగా, అగస్త్యుడు కూడా అతి ప్రాచీను డవడం నిస్సంశయం.

అగస్త్య నామధేయులు పలువురు ఉండడం వల్లనూ. చిత్ర విచిత్రములైన కథలు ఆయన జీవితంతో పెనవేసుకొని వుండడం వల్లనూ, తమిళ లాక్షణికు డైన అగస్త్యుడు ఏ కాలపువాడో యిదమిత్థ మని చెప్పలేము. వేదకాలంలోనూ, రామాయణ మహాభారతముల కాలంలోనూ అగస్త్యులు కొందరు వర్ధిల్లినట్లు తెలియ వస్తున్నది. అయినా, పాణిన్యాచార్యుల వారికి సమకాలికుడూ, తమిళభాషాభి జ్ఞుడూ అయిన అగస్త్యుడు ఒకడు అగత్తియం సంతరించి వుండవచ్చు నని

రా. రాఘవ అయ్యంగారి అభిప్రాయం. శివజ్ఞాన ముని అనే ప్రాచీనుడు తన కాంచిప్పాయిరం అనే గ్రంథంలో ఇలా పేర్కొన్నాడు. 'సంస్కృతభాషను పాణి నికి ప్రసాదించి, దానికి తుల్యమైన ద్రావిడభాషను కుడమునికి నేర్పెను.'[4] కుడముని అనగా అగస్త్యుడు. కనుక పాణిని కాలమునకు చెందిన వాడూ పొది యిల్ పర్వతమున[5] నివసించినవాడూ అయిన అగస్త్యుడే తమిళ మహర్షి అనీ, అతడే తమిళ వ్యాకరణం ప్రసాదించె ననీ తమిళ పండితుల నమ్మకం. ఈ కారణం వల్లనే, అగస్త్యుడు తమిళభాషా జనకు డని కీర్తి గడించాడు. తమిళమును అగస్త్యం అని వ్యవహరించడం కూడా కలదు. (అగత్తియన్ వయన్ద చెన్‌జొల్ ఆరణంగు). ఆ మహనీయుని ప్రతిభా విశేషాదికం వల్లనే తమిళనాడులో కావేరీనది ప్రవహించసాగిందని ఐతిహ్యం.[6] ఈ వివిధ కారణాల వల్ల, నాడూనేడూ అగస్త్యుడు తమిళులకు ఆరాధ్యుడైనాడు.

అగస్త్యుడు చాలా పొట్టివాడు. అందువల్ల తమిళ కవులా మహర్షిని కుఱుముని అనీ కుడుముని అనీ వ్యవహరించారు. కుఱుముని మలబారుకి సమీపాన ఉన్న ఆగాతి అనే ద్వీపమునకు చెందినవాడు కావడంవల్ల, అతనికి అగత్తియన్ అనే వ్యవహారనామం కలిగిందనీ, ఔత్తరాహుడైన అగస్త్య మహర్షికీ దాక్షిణా త్యుడైన యితనికీ సంబంధం ఏమీ లేదనీ కొందరి అభిప్రాయం. అవలోకి తేశ్వరుని వద్ద అగస్త్యుడు తమిళభాష అభ్యసించినట్లు బౌద్ధగాథ ఒకటి తెలియ జేస్తున్నది. అతడు వింధ్యాద్రిని నేలమట్టం చేసినట్లూ, విదర్భరాకుమారి లోపా ముద్రను పరిణయమాడి సిద్ధుడనే ఒక కుమారుని పొందినట్లు కొన్ని కథలవల్ల తెలియవస్తున్నది. పీతసాగరుడైన అగస్త్యుడు ఇండోనీషియా, కంబోడియా మొదలైన ప్రదేశాలలోకూడా ప్రసిద్ధి చెందాడు. అయనకి ఆలయములు సైతం నిర్మించబడినవి. అగత్తియమునే కాక కొన్ని వైద్యగ్రంథములు కూడా అగస్త్యుడు రచించినట్లు చెపుతారు.

అగస్త్యునికి పూర్వమే తమిళ సాహిత్యం వెలుగులోకి వచ్చినట్లూ, తమిళ కవులు పలువురు వర్ధిల్లినట్లూ కొందరి విశ్వాసం.[7] కాని అయనకి పూర్వమే లక్షణగ్రంథం వెలసినట్లు స్పష్టంగా చెప్పలేము. అగత్తియమును సంతరించి ఆ కొరతను తీర్చినవాడు అగస్త్యుడనే చెప్పవచ్చు. ఈ లక్షణగ్రంథమే తరువాతి

తమిళ వ్యాకరణములకు పథప్రదర్శక మయింది. పాణిన్యాచార్యుల వారి ననుసరించి అగస్త్యుడు రచన కావించినట్లు కొందరి అభిప్రాయం.[8]

ఈ కారణంవల్లనే కాబోలు తమిళ వ్యాకరణంలో ఏడు విభక్తులూ, కర్మణ్యర్థమూ, తద్భవరూపంలో కొన్ని సంస్కృత శబ్దములూ ప్రవేశించి ఉండవచ్చు. అగస్త్యుని రచన పూర్తిగా ఉపలబ్ధం కాకపోవడం వల్ల, తద్రచనా వైశిష్ట్యమును గ్రహించడానికి వీలు కలగడంలేదు.

## మధ్య సంగము

ఇది కపాడపురంలో వర్ధిల్లింది. అగస్త్యుడు, తొల్కాప్పియనార్ మొదలైన వారు ఈ సంగంలో విలసిల్లిన పండితులలో ప్రసిద్ధులు. ఇందులో మొత్తం 59 మంది కవులు ఉండే వారనీ, కొన్ని కృతులు సమీక్షించబడినవనీ ప్రతీతి తొల్కాప్పియం, మా (మహా) పురాణం మొదలైనవి యీ సంగములో వెలసిన ఉద్గ్రంథములు. వీటిలో లక్షణగ్రంథమైన తొల్కాప్పియం బహుధా ప్రశంసించదగింది.

తొల్కాప్పియం కర్త అయిన తొల్కాప్పియనార్ మధురా నగరమునకు దక్షిణమున ఉన్న తొల్కాప్పియక్కుడిలో జన్మించినట్లు కొందరి తలంపు.[9] కనుకనే ఆయనకి ఆ పేరు వచ్చింది. తొల్కాప్పియనారు జమదగ్ని వంశమువాడని కొందరు పేర్కొన్నారు. అతడు జైన మతావలంబకుడని కొందరు భావించారు.

అగస్త్యుని పన్నెండుగురు శిష్యులలో తొల్కాప్పియనార్ ప్రముఖుడు. సంస్కృతంలోని ఐంద్రవ్యాకరణం ఆధారం చేసుకుని అతడు తొల్కాప్పియము సంతరించినట్లు తెలియవస్తున్నది. తొల్కాప్పియవార్ మిత్రుడైన పనంపారనార్ 'ఐందిరం నిఱైన్ద (నిండిన) తొల్కాప్పియన్' అని చెప్పిన వాక్యమే యిందుకు ప్రబల సాక్ష్యం

ఐంద్ర వ్యాకరణం పాణినీయం కంటె ప్రాచీన మనీ, అందువల్ల తొల్కాప్పియనార్ క్రీ. పూ. 6వ శతాబ్దిలో జీవించి వుండవచ్చుననీ కొందరు విశ్వసిస్తున్నారు. ఐంద్ర సంప్రదాయం అతి ప్రాచీన మనడంలో సందేహం లేదు. అయితే

ఐంద్రం అనేపేరు పాణినికి తరువాతి కాలంలో వ్యాప్తిలోకి వచ్చినట్లు తెలియ వస్తున్నది పాణిని తన రచనలో ఎక్కడకూడా ఐంద్రమును ఉదాహరించలేదు. క్రీ. శ. 3వ లేదా 4వ శతాబ్దిలో నివసించిన కాతంత్రుడు ఐంద్ర సంప్రదాయ మును అనుసరించినట్లు విదిత మవుతున్నది. అసలు ఐంద్ర వ్యాకరణం అన్నది గ్రంథనామం కాదనీ, అది ఇంద్రుని పేరు మీదుగా వ్యవహృత మవుతున్న ఒక సంప్రదాయ విశేషమనీ కొందరి అభిప్రాయం. కాగా, తొల్కాప్పియనార్ క్రీ. శ. 5వ శతాబ్ధికి చెందినవాడని కొందరు తమిళ విద్వాంసుల నమ్మకం.

తొల్కాప్పియనారుపై సంస్కృతవాఙ్మయప్రభావం ఉన్నట్లు కనిపిస్తున్నది. పాణినీయమునే కాక పతంజలి మహాభాష్యం, మనుస్మృతి, భరతశాస్త్రం మొద లైన గ్రంథాలను కూడా ఆయన సంప్రతించినాడని యస్. వైయాపురిపిళ్లై సాధికారంగా నిర్ణయించారు 10

ప్రాచీనమైన రచన అనే అర్థమిస్తున్న యీ తొల్కాప్పియంలో 1,600 సూత్రములు కలవు. ఇందులో మూడు భాగములు ఉన్నవి. ఎళుత్తు (అక్షరామ్నా యము), చొల్ (శబ్దము), పొరుళ్ (కావ్యవస్తువు) అనేవి ఆ విభాగములు. ఈ ఒక్కొక్క భాగమూ తొమ్మిది భాగాలుగా విభజించబడింది. తొలి రెండు విభాగాలు వ్యాకరణ విషయాలకు సంబంధించినవి. శబ్ద పరిచ్ఛేదంలో మాటలపుట్టుకా, వాటి అర్థాలూ వివరించబడినవి. శబ్దస్వభావమును అనుసరించి లింగ వివక్షణ జరగడం ఈ లక్షణ గ్రంథంలోని విశిష్టత. వ్యవహారంలో కలిసిమెలిసిపోయిన మాటలన్నీ-అవి కొత్తని అయినా సరే-స్వీకరించదగినవే అని తొల్కాప్పియనార్ సూచిం చడంకూడా గమనించ దగిన అంశం.

తొల్కాప్పియం ప్రత్యేకతను ప్రవ్యక్తం చేస్తున్న కావ్యవస్తు పరిచ్ఛేద మును పరిశీలిద్దాము: కామము తత్సంబంధమైన విషయాదికమూ, యుద్ధతంత్ర ములూ, రహస్య సాంసారిక ప్రణయములూ, సాత్త్విక భావములూ, ఉపమాన ములూ, ఛందస్సు, కావ్యవస్తువు, లోకోక్తులూ, ప్రయోగములూ అనే తొమ్మిది భాగాలు ఈ పరిచ్ఛేదంలో ఉన్నవి. వీటిలో తమిళుల సామాజిక జీవనవిధానం వర్ణించబడింది. వారి అభిరుచులు, ఆచారవ్యవహారములు, ఛందస్సంప్రదాయ

ములు, జాతివార్తా చమత్కృతులూ మొదలైనవాటిని ఈ పరిచ్ఛేదంనుంచి మనం గ్రహించవచ్చు. తొల్కాప్పియమునకు నచ్చినార్ కినియార్ వంటి ప్రసిద్ధ వ్యాఖ్యాతలు ప్రశస్తములైన వ్యాఖ్యాన గ్రంథాలు వెలయించిచారు.

తొల్కాప్పియనార్ కాలంనాటికే సంస్కృత భాషాసాహిత్యములు తమిళ నాడులో ప్రచారంలో ఉండే వని చెప్పడానికి తొల్కాప్పియమే సాక్షి. పాణినీయం, భరతశాస్త్రం మొదలైన వాటిని తొల్కాప్పియనారు సంప్రతించినట్లు మొదటనే పేర్కొనబడింది. తొల్కాప్పియంలో అక్కడక్కడా బ్రాహ్మణ ప్రశంస కనిపిస్తున్నది. సంస్కృతనాటకాలలోని విదూషకుని పాత్రను మనస్సులో ఉంచుకుని కాబోలు, ప్రణయకథలో తొల్కాప్పియనారు బ్రాహ్మణునికి తావు కల్పించివుండవచ్చు. ఈ కల్పన తమిళ కవుల సంప్రదాయం కాదు. కనుక సంస్కృత నాటక వాఙ్మయ వికాసమునకు తర్వాతనే తొల్కాప్పియం రచన జరిగి వుండవచ్చునని పి. టి. శ్రీనివాస అయ్యంగారు అభిప్రాయపడిరి.[11]

కాని ఇతర భాషావ్యాకర్తల వలె కాక తొల్కాప్పియనారు తమిళ కవి సంప్రదాయానుగుణంగా తన రచనను తీర్చి దిద్దడానికి ప్రయత్నించడం ప్రశంసార్హం. తమిళ భాషోచ్చారణమునకు అనుగుణంగా మార్పుచెందిన సంస్కృత శబ్దములను ఆయన స్వీకరించాడు. ఏ సందర్భంలోనూ తమిళసంస్కృతములకు జన్య జనక సంబంధం చెప్పలేదు.

## కడ సంగము

ఇది 1,850 సంవత్సరాలు వర్ధిల్లిందట। ఇందులో 49 మంది కవులు ఉండేవారనీ, 449 గ్రంథములు పరిశీలించబడినవనీ చెపుతారు. ఈ సంగమునకు అధ్యక్షుడు నక్కీ (త్కీ)రుడు. దిశాష్టకం ఆవరించిన చిరయశస్సు సముపార్జించిన తిరువళ్లువర్ మహానీయుడీ సంగములో వర్ధిల్లిన కవిప్రవరులలో సంభావ్యుడు. తిరుక్కుఱళ్, పత్తుప్పాట్టు, ఎట్టుత్తొగై, పది నెణ్ కీళ్ కణక్కు మొదలైన ఉద్గ్రంథాలు ప్రచారంలోకి వచ్చినవి ఈ సంగంలోనే.[12]

ఇక తమిళ సాహిత్యమునకు తలమానికంగా వెలుగొందుతున్న తిరుక్కుఱళ్ ప్రాశస్త్యమునూ, దత్కర్త అయిన తిరువళ్లువర్ జీవితకథను సంగ్రహంగా తెలుసుకుందాము.

## తిరుక్కుఱళ్

'ఆవగింజను తొలిచి తిరువళ్లువర్ అందులోకి సప్తసముద్రములు చొప్పించెను.' అని ఒక ప్రాచీన తమిళ పండితుడు తిరుక్కుఱళును ప్రశంసించినాడు. మరొక ప్రాచీనకవి ప్రకటించిన భావమును ఆధారం చేసుకుని ప్రబంధకవి శిరోమణి చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రి కుఱళ్ ప్రాశస్త్యమును ఇలా వివరించారు.

"కొంచెపు నీటి బిందువున
గోచరమైన మహా తరు క్రియన్
సంచిత పుణ్యరాశియన
జాలిన తావక భావజాల మ
భ్యంచితరీతిమై ద్విపద
లందె కుదించి రచించి నట్టి నీ
యంచిత పుణ్యమూర్తికి జొ
హారు లివే తిరువళ్ మహాకవీ!

త్రవ్విన కొలంది చెలమ నేర్పడిన నీర
మట్లు, చదివిన కొలది భావైక రాశి
నలరు భవదీయ సత్కవితామృతతాప్తిః
బారమే లేదు రసిక ప్రపంచమునకు."

మహాకవీ, మహాతత్త్వవేత్తా అయిన తిరువళ్లువర్ చిరకీర్తి గడించడానికి కారణం ఆయన తిరుక్కుఱళ్ గ్రంథరచనే. సార్వజనీనమూ సార్వకాలికమూ అయిన యీ నీతిగ్రంథంలోని సూక్తులు సహజ సుందరములు. అంతేకాక, వీటిలో మతప్రసక్తి చాలా తక్కువ. ఈ కారణముల వల్ల, ఈ ఉద్గ్రంథమునకు ప్రాచ్యభాషలలోనే కాక ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను మొదలైన పాశ్చాత్య భాష

లలో సైతం ప్రశస్తములైన యథానువాదములు ఎన్నో వెలువడినవి. కుఱళును తెలుగులో ఓం ప్రథమంగా అనువదించినవారు కనుపర్తి వేంకటరామ విద్యానంద నాథులు. ఆ తర్వాత చొక్కం నరసింహులు నాయుడు, పూతపట్టు శ్రీరాముల రెడ్డి, ముదిగంటి జగ్గన్నశాస్త్రి, కొంతి శ్రీపతిశాస్త్రి ప్రభృతులు తమ తెలుగుసేతలు ప్రకటించారు.

తిరుక్కుఱళుకి ముప్పాల్ (త్రివర్గము), ఉత్తరవేదం, తమిళ్‌మఱై (తమిళవేదము) మొదలైన నామాంతరములు ఏర్పడినవి. అలాగే, తత్కర్తకు కూడా నాయనార్ (పూజనీయుడు), నాన్‌ముగనార్ (చతుర్ముఖుడు), దేవర్ (దైవము) మున్నగు పేర్లు ఏర్పడినవి.

తిరువళ్లువర్ శైవుడని కొందరూ, జైనుడని కొందరూ విశ్వసిస్తున్నారు. ఆయన జైనమతావలంబకు డనడం నిజమునకు దగ్గరి చుట్టమేమో! దైవస్తుతిలో ఆయన తొలుత జైన తీర్థంకరులలో ప్రథముడైన వృషభదేవుని ప్రస్తుతించినట్లు కొందరు పండితుల అభిప్రాయం[13]. అసలు ఈ కవి నిజనామధేయం కూడా తెలియరాలేదు. వళ్లువన్ అనే మాటకు ఆదిద్రావిడుల (పంచముల) పురోహితుడు, శకునములను బట్టి భవిష్యత్తుని వివరించేవాడు మొదలైన భిన్నార్థములు చెప్ప బడుతున్నవి. మదరాసులోని మైలాపూరులో వళ్లువర్ జన్మించినట్లు విజ్ఞుల విశ్వాసం. ఆయన కాలమును గురించి కూడా అభిప్రాయ భేదములు లేకపోలేదు. క్రీస్తునకు పూర్వమే వళ్లువర్ వర్ధిల్లినట్లు కొందరూ క్రీ.శ. తొలి మూడు శతాబ్దులలో జీవించినట్లు మరికొందరూ అభిప్రాయ పడుతున్నారు. జి.యు. పోప్ క్రీ.శ. 800-1000 ప్రాంతమున తిరువళ్లువర్ వర్ధిల్లినట్లు చెప్పగా, పి.టి. శ్రీనివాస అయ్యంగారు క్రీ.శ. 6వ శతాబ్దికి తరువాత వర్ధిల్లినట్లు నిర్ణయించారు.

కుఱళులో ధర్మార్థ కామములకు సంబంధించిన పెక్కు విషయాలు వివరించ బడినవి. కనుకనే దీనికి త్రివర్గ మనే పేరు కలిగింది. ధర్మఖండంలో ప్రవృత్తి, నివృత్తి మార్గములు మనోహరంగా వివరించబడినవి. రాజ్యాంగ విధానం, కోశపద్ధతి, పాలకులు, పాలితులు మొదలైన అంశములను గురించి అర్థ

ఖండం వివరిస్తుంది. కామఖండంలో ప్రేమమూర్తులైన ప్రేయసీ ప్రియుల ప్రథమ సమాగమం, వారి రహస్య ప్రణయం, నానాటికి పరిణతి చెందే వారి అనురాగం, విధివశాన వారిమధ్య ఏర్పడే వియోగమూ, తత్సంబంధమైన దుఃఖం మొదలైన విషయాలు అభివర్ణితములు. తిరువళ్లువర్ కమనీయ కవితాశక్తినీ రమణీయ కల్పనా చాతురినీ తెలుసుకునేందుకు ఈ కామఖండం బహుధా ఉపకరిస్తుంది.

తిరువళ్లువర్ దృక్పథంలో రెక్కలు ముక్కలు చేసుకొని సేద్యం సాగించి ప్రపంచమునకు ఆహారం అందజేసే కర్షకుడూ, యతులకూ మృతులకూ అభ్యాగతులకూ అతిదీనులకూ ఏడుగడగా కాలం గడిపే గృహస్థూ పరమపూజ్యులు వీరిద్దరూ కనుక లేకుండే సర్వసంగ పరిత్యాగం చేసి సాంద్రాటవీ సీమలలో జీవయాత్ర సాగించే సన్న్యాసులు సయితం బాధలకు లోనవుతారు. గృహిణిని గురించి చెపుతూ వళ్లువర్ ఇలా పేర్కొన్నారు. 'సహ ధర్మచారిణి కనుక సచ్ఛీల అయితే పేదరికానికి తావులేదు; కానప్పుడు సంపదలుండీ లేనట్లే.'

తమిళవేద మని వినుతికెక్కిన తిరుక్కుఱళుని చదివిన పిమ్మట, ప్రధానంగా స్ఫురించే విషయాలు రెండు. ఒకటి: పాలకులూ పాలితులూ – అందరూ – ధర్మమార్గావలంబకులై సంచరించాలి. శాశ్వత సౌఖ్యప్రసాది అయిన ధర్మపథమును అవలంబించడం మానవుని పరమాశయమై యుండవలెను. రెండు: కామ క్రోధమోహములు మానవుని కష్టాలకు కారణభూతములు. అవి తొలగినప్పుడే మానవుడు కష్టజలధినుంచి గట్టెక్కగలడు.

ఇక కొన్ని కుఱళులను చవి చూద్దాము

"పరదైవముల వీడి పతిగొల్చు చాన
కురియు మన్నంతనే కురియదే వాన."

"చిట్టి చేతులతోడ చిటిపాప కలుపు
పట్టెడన్నమె సుధాప్రాయమై గొలుపు."

"జనకుండు మున్ను నోచిన నోము పంట
తనయుడై కర్మకున్ దగి పుట్టు నింట."

"పూని ద్రాక్షాసవం బానగా తీపి
కాని ప్రేమ రసమ్ము కనినంత తీపి."

"మిత్రియెట్టిదో కాని మృత్యువే యింతి
నెత్రమ్మి రేకుల నేత్రాల మూర్తి."

తిరుక్కుఱళుపై సంస్కృత సాహిత్య ప్రభావం కనిపిస్తున్నదనీ, వళు వరుకి మనుస్మృతి, అర్థశాస్త్రం, కామందకుని నీతిశాస్త్రం మొదలైనవి సుపరిచితములనీ కొందరి అభిప్రాయం[14]. ఏది ఎలా ఉన్నా, కొండంత భావాన్ని రెండు పాదాల గీతిక అయిన కుఱళులో అంతి యలతి పలుకులలో అతి మనోహరంగా వివరించిన తిరువళువర్ ప్రతిభాగరీయస్కుడు అనడం అతిశయోక్తి కానే కాదు.

వళువర్ మహాకవికి తర్వాత కవయిత్రి అవ్వైయారుని సంభావించ వలసి వుంటుంది. ఈమెను గురించి కల్పనా కథలు నేటికీ తమిళనాడులో బహుళ ప్రచారంలో ఉన్నవి[15]. ఈమె అసలు పేరు కూడా తెలియరాలేదు. పూజ్యురాలనే అర్థంలో అవ్వై శబ్దం ప్రయుక్తం. అవ్వైలు ఇద్దరు ముగ్గురు వేర్వేరు కాలాలలో వర్ధిల్లినట్లు తెలియవస్తున్నది.

అవ్వైయార్ ఆత్తిచూడి, కొండై్రవేందన్, నల్వాళి మొదలైన లఘురచనలు చేసినట్లు చెపుతారు. నన్ఱి మఱవేల్ (చేసిన మేలును మఱువకుము), అన్నైయుం పితావుం మున్నందెయ్వం (తలిదండ్రులే ప్రత్యక్ష దైవతములు), ఐయమిట్టుణ్ (ఒకరికి పెట్టి ఆవల తినుము) మొదలైన నీతివాక్యాలతో నిండిన ఆమె రచనలు నేటికీ తమిళుల జిహ్వాగ్రముల నిలిచియున్నవి. అవ్వగారివి మవ్వపు సూక్తులు !

## సంకలన కృతులు

కడ సంగకాలంలోనే తమిళంలో సంకలన కృతులు కొన్ని వెలుగులోకి రావడం గమనించదగిన అంశం. పూర్వకవులు చెప్పిన కవితలు వ్యాప్తిని కోల్పోవడం చూచి, రసహృదయులైన సంగకవులు వాటిని గ్రథనం చెయ్యసాగారు. ఆ కోవకు చెందిన కృతులలో ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు, పదినెణ్ కీళ్ కణక్కు

మొదలైనవి ఎన్నదగినవి. అవి బహుగ్రంథ కర్తృకములు. విభిన్న కాలాలలో చెప్పబడిన పద్యాలు వాటిలో అందాలు దిద్దుకున్నవి. కొందరు కవయిత్రులు చెప్పినవి కూడా వాటిలో కనిపించడం ఒక విశేషం. మరొక విశేషం ఏమిటంటే, ఆనాటి తమిళ మహీపతులు, మంత్రివరేణ్యులు, దండనాథులు మొదలైన ప్రముఖుల జీవితవిశేషాలు ఈ కృతుల ద్వారా మనకు తెలియవస్తున్నవి. కాగా, తమిళుల జీవిత విశేషాదికమును తెలుసుకోడానికి ఈ సంకలన కృతులు ఎంతైనా తోడ్పడుతున్నవి.

ఎట్టుత్తొగై ఎనిమిది గ్రంథముల సంకలనం. నట్రిణై, కుఱుందొగై, ఐంగుఱు నూఱు, పదిట్రుప్పత్తు, పరిపాడల్, కలిత్తొగై, అగనానూఱు, పుఱనానూఱు - అనేవి ఆ ఎనిమిది గ్రంథములు. అలాగే, పత్తుప్పాట్టులో పదికావ్యములూ, పదినెణ్ కీళ్ కణక్కులో పద్దెనిమిది కావ్యములూ ఉన్నవి. వీటిలో పద రచనలు చోటు చేసుకున్నవి. పద రచన దేశిసాహిత్య ప్రక్రియ కనుక, దేశిసాహిత్య సంప్రదాయములను తెలుసుకోడానికి కూడా ఈ సంకలన కృతులు బహుథా తోడ్పడ గలవు.

పదసంఖ్యను పురస్కరించుకుని సంకలనకర్తలు ఈ గీతికా గుచ్ఛములకు శీర్షికలు ఉంచారు. అగనానూఱు, పుఱనానూఱులలోని గీతములలో 13 మొదలు కొని 37 వరకూ పాదములు ఉన్నవి. అందువల్ల వీటిని నెడుందొగై (దీర్ఘసంకలనములు) అని వ్యవహరించడం పరిపాటి. కుఱుందొగైలో 4 మొదలు 8 వరకూ పాదములుగల గీతములు చోటు చేసుకున్నవి. కనుకనే, ఈ సంకలనములకు కుఱుందొగై (లఘు సంకలనము) అని పేరు ఏర్పడింది. నట్రిణైలో 9 నుంచి 12 దాకా పాదములుగల గీతములు ఉన్నవి. పత్తుప్పాట్టులోనివి దీర్ఘములైన గీతములు.

ఇక ఈ సంకలన కృతులలో ప్రశస్తములనదగిన అగనానూఱు, పుఱనానూఱులను పరిశీలిద్దాము.

## అగనానూఱు [అగం + నానూఱు]

అగం అనే మాటకు స్థూలంగా ప్రేమ అని అర్థం చెప్పవచ్చు. ఆ ప్రేమ నిష్కల్మషమైనది. ఏక మనస్కులైన నాయికా నాయకులు ఆనందపరవశులై వ్యక్తీకరించే మధురానుభూతిని అగం అనవచ్చు. ఈ రకపు ప్రేమకు సంబంధించిన గీతములు ఈ కృతిలో నన్నూరు ఉన్నవి. కనుకనే యీ గ్రంథమునకు అగనానూఱు అని సహేతుకంగా పేరు పెట్టబడింది. పాండ్యభూపతి అయిన ఉగ్రపెరువళుది సమాదరణమున రుద్రశన్మ(ర్మ)న్ అనే పండితుడు ఈ కృతిని సంకలనం చేశాడు. ఈ గీత చతుశ్శతిలో 144 మంది కవులు చెప్పిన పద్యములు ఉన్నవి. వారిలో కొందరు ప్రాచీను లనీ, కొందరు క్రీస్తుశకం 4, 5 శతాబ్దులకు చెందినవారనీ పండితుల నమ్మకం.

ప్రేయసీ ప్రియుల వివాహాత్పూర్వ ప్రణయం, వివాహానంతర ప్రణయం, ఆ తర్వాత వారికి సంభవించే వియోగం, అప్పుడు సఖీజనం నాయికను అనునయించడం – మొగలైనవి ఈ గీతములలోని ముఖ్యవిషయాలు. గీతాలలో అతిశయోక్తుల పాలు తక్కువ; కనుక ఉదాహృత భావములు సహజ సుందరములుగా భాసించడంలో వింత లేదు.

రథారూఢుడైన ఒక ప్రియుడు తన ప్రేయసిని త్వరగా కలిసికొనే తంపుతో రథచోదకునితో చెప్పిన యీ మాటలు పరిశీలించండి.

'వానరోజులు వెనుక పట్టి
వాసరమ్ములు చాల గడిచె;
వినిపించుచున్నవి కప్పల బెకబెకలు,
కనులు సగము మూసికొని – ఆ మడుగులో
తనివి తీర జింకలు త్రాగుచున్నవి నీళ్లు.
పుడమిని రాల్చెను పువ్వులు చెట్లు;
పడగలు విప్పిన పాముల వోలె
సుమములు వికసించెను కొన్ని.
అరదమ్ము నడుపు మోయి
శరవేగమ్మున, సఖుడా!

త్వరగా కలిసికొనవలె నా ప్రేయసిని -
నారాకకై నిరీక్షించు నా ప్రేయసిని'

కార్యార్థమై వెడలిన ప్రియుని ఉద్దేశించి, అతని వలపునేస్తం తన ప్రియసఖితో ఈ విధంగా తన మనస్సులోని ఆరాటమును తెలియజేసింది.

'దేహి యని యితరుల నడుగక
ధర్మబద్ధముగ జీవనము నడుపగ
ధనము నార్జించు పరమాశయమున
తరలి వెళ్ళెను నా ప్రాణప్రియుడు.

ఓ ప్రియ సఖీ!
ఏమని చెప్పుదు
అతడు చనిన త్రోవ ఆపదల కాలవాలము
ఆ త్రోవనె బయలుదేరె మదగజ సమూహము,
వాని వెనుక దారి తీసెను పులులు సైతము.

భట్రాజు చేతిలోని మద్దెలలో
భాసించు తెల్లని నడిమి భాగము వలె
నీళ్లు కనిపించనట్టి ఆ త్రోవను
వెళ్లెనుగదా నా ప్రాణ ప్రియుడు!'

ఆమె అనుభవించిన మనోవేదన యింత మృదులంగా వర్ణించబడడం గమనించదగిన విషయం. అగనానూఱులోని భావములు ఇలాగే ఉంటాయి.

## పుఱనానూఱు (పుఱం+నానూఱు)

ధర్మార్థ కామములకు ఇచ్చినంత ప్రాధాన్యమును తమిళకవులు మోక్షమునకు ఇయ్యలేదు. అఱం (ధర్మము), పొరుళ్ (అర్థము), ఇన్బం (కామము) - ఈ మూడింటిని వారు ఆదరించారు. ఈ మూడూ సక్రమంగా నిర్వహించబడితే, మోక్షం తనంతట తానే లభ్యమవుతుందని వారు విశ్వసించారు. అగనానూఱు ప్రణయగీతికా గుచ్ఛమయితే, పుఱనానూఱు వీరగీతికా కదంబం. ధర్మార్థముల సమన్వయమునకే పుఱం అని పేరు. ఈ కృతిలోనూ నన్నూరు గీతములు

ఉండడంవల్ల, దీనికి పుఱనానూఱు అనే వ్యవహారనామం కలిగింది. ఎవరి ప్రోత్సాహమున దీనిని ఎవరు సంకలనం చేశారో యింతవరకూ తెలియరాలేదు.

ఒకవిధంగా పరిశీలిస్తే, పుఱనానూఱు చారిత్రకకావ్యం తమిళరాజత్రయ మనబడే చేర, చోళ, పాండ్య వంశీయులను గురించీ, వారి సామంతులను గురించీ, ఆనాటి వీరయోధులను గురించీ ఎన్నో విషయాలు కళ్లకు కట్టినట్లుగా ఇందులో వివరించబడినవి. కొన్ని కవితలకు తుదిని గద్యాలు కూడా చేర్చబడినవి. బహుశ: తరువాతి కవులెవరైనా వీటిని చేర్చివుండవచ్చు. భారతం సంతరించిన పెరుందేవనార్ అనే కవి చేసిన దైవస్తుతి గీతంతో పుఱనానూఱు ప్రారంభ మవుతున్నది. కాని ఆయనకాలం వివాదగ్రస్తం. ఆయన అతి ప్రాచీనుడని కొందరూ, క్రీ. శ. 9వ శతాబ్ది వాడని కొందరూ భావిస్తున్నారు.

ఒక చేరరాజు మహా పరాక్రమోపేతుడైన కరికాల చోళునిచే యుద్ధంలో పరాజితుడైనాడు. అతని వీపు గాయాలతో నిండిపోయింది. అలా వీపుగాయాలు కలగడం పిరికితనానికి చిహ్నమని ఆనాళ్లలో భావించేవారు. అందువల్ల, మానధనుడైన ఆ మన్నీడు దొరతనం చెయ్యడానికి నిరాకరించాడు. అంతేకాదు; నిరాహారుడై సమరభూమిలోనే ప్రాణత్యాగం చేశాడు కూడా! అ విషాద దృశ్యమును చూచి కన్నీరుగా విలపిస్తున్న చేరదేశీయుల దుఃస్థితిని ఒక కవి ఎంతో దయనీయంగా వర్ణించాడు :

"వినదించవు విజయ భేరు లింక
వినిపించవు తూర్యారవములు.
కలకల లాడవు పాల కుండలు
కమ్మని తేనెను ఎవ్వరు క్రోలరు
కర్షక స్వాములు పట్టరు హలములు
బయళ్లలో గుమికూడరు ప్రజలు.

కొండల చాటున క్రుంకిన సూర్యునివలె
పరాజితుడైన మా రాజసింహు డకటా!

విరాగియై విసర్జించెనుగా కరవాలము !
దుర్దినము లివి, దుర్దినము లివి !"

పుఱనానూఱులో ఒక వీరమాతను ఒక కవి ఇలా చిత్రించాడు:

"ఆమె మూడు కాళ్ల ముదుసలి
ఆమె తనయుడు వీర యోధుడు.

భండన భూమికి తరలిన యతడు
పగతురకు వెన్నిచ్చి పారిపోయె నని
ఆ నోట ఆ నోట వాకొనుచుండగ
ఆమె విన్నది; క్షుభిత యైనది.

తళతళ మెరిసెడు కత్తిని చేబూని
అతనికి పాలొసగిన తన స్తనములను
మొదలంట ఛేదించుకొన సాహసించినది.

అంతలో భావమేదో తళుక్కు మనగా
చేత బూనిన ఆ కత్తితోనే
దారి తీసెను యుద్ధభూమికి
ఆ వృద్ధమాత; వీర వనిత.

సమరాంగణమున పడియుండిన
మృతదేహాలను కలయ జూచినది

ఒకమూల కనిపించెను
వక్షస్థలమున కత్తి నాటుకొనగా
నెత్తురు కరుడు గట్టిన
తన తనూజుని మృత శరీరము.

కలకల నవ్వెను అ వృద్ధమాత;
పలికెను తులలేని సంతోషమున

" పారిపోలేదు పగతురకు వెన్నిచ్చి
పారిపోలేదు నా బంగారు తండ్రి."

తమిళరాజులలో కరికాలచోళుడు సంభావ్యుడు. మహావదాన్యుడనీ, కవిజన కల్పక మనీ చిరయశస్సు సంపాదించాడు. అటువంటి యశోవిశాలుడైన కరికాల చోళుని మరణ వార్తను విని, ఒక కవి తనదుఃఖమును ఇలా తెలియజేశాడు.

'వైరి వీరుల దుర్గములను ధ్వంసం చేశాడు. గాయకులను పోషించాడు విధ్యుక్తధర్మ నిర్వహణలో ఆరితేరిన పురోహితుల కనుసన్నలలో సంచరించాడు సుగుణసంపన్నలైన రాణుల మన్ననల పొందాడు వేదోక్తంగా యజ్ఞాలు చేశాడు. అకటా! ఈనాడు ఆ మహారాజు లేడుకదా! అతనిని కోల్పోయిన యీ లోకపు దురదృష్టం ఈనాడు పండింది. వేసవికాలంలో గొర్రెమందల మేతకై కాపరులు ఆకులు రాల్చగా, వెలవెలబోతూ కనిపించే నేరెడు చెట్టుకొమ్మలవలె నేడు ఆభరణాలు త్యజించిన ఆ మహారాజుగారి రాణులు వెలవెలబోతూ కనిపిస్తున్నారు కదా!'



ఈ విధగా పుఱనానూఱు ఆనాటి సాంఘిక చారిత్రక విషయాలను వ్యక్తం చేస్తున్నది. ఈ కావ్యమునూ ఇతరకృతులనూ ఆధారం చేసుకొని తమిళుల ప్రాచీన జీవిత విధానమును గ్రహించవచ్చు.



ఆనాటి తమిళమహీపతులలో చేర, చోళ పాండ్యులు ప్రముఖులు. వారిలో వారికి సఖ్యత తక్కువ అని తెలియవస్తున్నది. వారు తమిళభాషాపోషకులు కవి పండితులను ఆదరించారు. ఆనాటి ప్రజలకు రాజభక్తి అపారం ఆర్యుల ఆచార వ్యవహారములు అప్పటికే తమిళనాడులో ప్రచారంలోకి వచ్చినవి. అయినప్పటికీ, రాజులూ ప్రజలూ తమ ప్రాచీనాచారములందు గాఢానురక్తులై ఉండేవారు. రాజులు యవనదేశపు మద్యమును సేవించేవారు. ప్రజలలో కూడా మద్యపానం వ్యాపించింది నాట్యప్రదర్శనలు, దేవోత్సవములు మొదలైనవాటిలో ప్రజలు ఉత్సాహంతో పాల్గొనేవారు. యుద్ధభూమిలో అసువుల కోల్పోవడమే కీర్తిహేతు

వని వీరయోధులు విశ్వసించేవారు. యుద్ధభూమినుంచి పారిపోవడమో, వీపు గాయాలు కలగడమో అవమాన కారణములుగా ఆనాటి వీరులూ ప్రజలూ భావించేవారు.[16]

సంగయుగంలో వ్యాప్తిలోకి వచ్చిన గ్రంథాలలో నీత్యుద్బోధకములే ఎక్కువ అనవచ్చు. వైద్యగ్రంథాలు కూడా కొన్ని వెలుగులోకి వచ్చినవి. సంగ కవులు చాలావరకు పదరచనలు చేశారు. ఇతివృత్త స్వీకరణలోనే కాక వర్ణనల విషయంలోనూ వారు తమ ప్రత్యేకతను ప్రదర్శించారు. సంగకవులలో పలువురు బ్రాహ్మణేతరులు. కవిపండితులకు రాజాశ్రయం లభించేది. కవయిత్రులు కూడా కొందరు వర్ధిల్లినట్లు తెలియవస్తున్నది. సంగకవులు తమ ప్రత్యేకతను కాపాడు కున్నా, వారిలో కొందరు సంస్కృత భాషాభిజ్ఞులనీ, వారు తమ రచనలలో సంస్కృత శబ్దములకు చోటు ఇచ్చారనీ చెప్పవచ్చు.

---

1. ప్రేమకలాపమునకు సంబంధించిన గ్రంథమిది. రహస్య, వైవాహిక ప్రేమలు ఇందులో అభివర్ణించబడినవి.

2. పి. టి. శ్రీనివాస అయ్యంగారు; History of the Tamils, పుటలు 226-51.

3. 'మయేచ్చురన్ పాణిని క్కాసిరియన్' (మహేశ్వరుడు పాణినికి ఆచార్యుడు). శంభురహస్య అనే గ్రంథంలో అగస్త్యుడు మహేశ్వరుని అభిమతం అనుసరించి వ్యాకరణగ్రంథం ఒకటి వ్రాసినట్లు కలదు. చూడుడు: గంటి జోగి సోమయాజిగారి ఆంధ్రభాషా వికాసము.

4. తమిళ్ వరలాఱు, పుట 217.

5. అగస్త్యుడు ఈ కొండమీద తపస్సు చేసినట్లు ఐతిహ్యం. కనుక దీనికి అగస్త్యకూటం అనే పేరు కలిగింది. ఇది నేటి తిరునెల్వేలి తిరువాంకూరుల మధ్య ఉన్నది. ఇందులో తామ్రపర్ణి, నెయ్యారు నదులు పుట్టుతున్నవి. దీని యెత్తు 6,200 అడుగులు.

6. పూర్వం చోళమండలమును కవేరుడు అనే రాజు పరిపాలించేవాడు. తమిళనాడులో ఆనాళ్లలో జీవనది ఒక్కటీ లేకపోవడంవల్ల, అతడు తన రాజ్యమును కుమారుని అధీనం చేసి తపస్సు చెయ్యసాగాడు. ఆ తర్వాత కవేరుని కుమారుడు అగస్త్యుని సందర్శించి, "స్వామి! తాము తమిళవ్యాకరణం ప్రసాదించి భాషకు మహోపకారం చేశారు, అలాగే, జీవనదిని కూడా ప్రవహింప చెయ్యండి" అని ప్రార్థించాడు. అనంతరం అగస్త్యుని మహిమవల్ల - కవేరుని పేరు మీదుగా - కావేరి ప్రవహించ సాగింది.

7. అగత్తియంలోని ఈ సూత్రం పరికించండి:

'ఇలక్కియ మిన్ఱి ఇలక్కణ మిన్ఱే
ఇలక్కణ మిన్ఱి ఇలక్కియ మిన్ఱే
ఎళ్ళిన్ ఎణ్ణై ఎడుప్పదు పోల
ఇలక్కియత్తిన్ఱి ఎడుపడుం ఇలక్కణం.'

(లక్ష్యము లేకున్న లక్షణము లేదు
లక్షణము లేకున్న లక్ష్యము లేదు
నువ్వుల నుండి నూనెను తీయునట్లు
లక్ష్యము నుండి గ్రహింపబడునది లక్షణము)

కనుక కుఱుమునికి పూర్వమే తమిళంలో వాఙ్మయం కొంత ఉండా లని తమిళ విద్వాంసుల అభిప్రాయం

8. History of the Tamils, పుట 209.

9. కాప్పియం గోత్రనామ మని పండిత పరిశోధకులగుము. రాఘవ అయ్యంగారు పేర్కొన్నారు. కాప్పియ గోత్రోద్భవుడు కావడంవల్ల తొల్కాప్పియ నార్ అనే పేరు వ్యవహారంలోకి వచ్చివుంటుందని ఆయన అభిప్రాయం. గజశాస్త్రం రచించిన పాలక్కాప్పియర్ అనే ముని తాను కాప్పియ గోత్రజుడ నని చెప్పుకున్నాడు.

చూడుడు: ఆరాయ్‌చ్చి త్తొగుది, పుటలు 96-99

10. History of Tamil Language and Literature, పుట 13–14, 65–69 తొల్కాప్పియ రచనాకాలం క్రీ. పూ. 500 అని కొందరూ, క్రీ. పూ. 300 అని మరి కొందరూ, క్రీ. శ. 2వ శతాబ్ది అని కొందరూ భావిస్తున్నారు. రా. రాఘవ అయ్యంగారు క్రీ. పూ. 3వ శతాబ్ది అని అభిప్రాయ పడ్డారు.

11. History of the Tamils, పుటలు 215–16.

12. యం. యస్. పూర్ణలింగంపిళ్లె: Tamil Literature చేర చోళ పాండ్య మహీపతుల ఆస్థానములలో బహుశః 586 మంది సంగకవులు ఉండినట్లు భావించబడుతున్నది.

13. జీవబంధు శ్రీపాల్ : తిరువళువర్ వాళ్త్తుం ఆదిబగవన్ (1964).

14. కుఱళ్ రచనా విధానం సంస్కృతంలోని రచనావిధానమును తలపించు చున్నదని భావించబడుతున్నది.

కుఱళుపై సంస్కృత వాఙ్మయ ప్రభావం గోచరిస్తున్నదని తొలుత పేర్కొన్నవారు వి. ఆర్. రామచంద్ర దీక్షితరు.

తిరువళ్లువరు సంస్కృత భాషాభిజ్ఞుడని పి. టి. శ్రీనివాస అయ్యంగారు సోదాహరణంగా నిరూపించారు. చూడుడు : History of the Tamils, పుటలు 589–95 వైయాపురిపిళ్లై కూడా ఇలాగే భావించారు. చూడుడు: History of Tamil Language and Literature, పుటలు 81–85.

15. ఈమెను గురించి కల్పనాకథలు చాలా తమిళనాడులో నేటికీ ప్రచారంలో ఉన్నవి.

16. ఇంకా వివరాలకు : Tamils Eighteen Hundred Years Ago.

—o—

# 3. జైన బౌద్ధుల యుగము

తమిళసాహిత్య చరిత్రలో సంగయుగమునకు తరువాతిది జైనబౌద్ధుల యుగం. మణిమేకలై, సిలప్పదికారం, జీవక చింతామణి వంటి ప్రశస్తకావ్యాలు[1] వెలుగులోకి వచ్చింది యీ యుగంలోనే. ఇవి జైనబౌద్ధుల సమాదరణమున్న వెలువడిన కృతులు. అందువల్ల, జైనబౌద్ధుల ఆచారవ్యవహారాలూ, వారి తాత్త్వికరహస్యాలూ మొదలైనవి వీటిలో ఉదాహృతములు కావడంలో వింతలేదు. అంతమాత్రాన, ఈ కావ్యాలు కేవలం మతసిద్ధాంతములు తెలియజేసే రచనలని భావించరాదు. ఆనాటి తమిళుల ప్రశాంత జీవన విధానమును అభివర్ణించే యీ కావ్యముల ద్వారా తమిళుల రాజకీయ సామాజిక నైతిక పరిస్థితులను మనం తెలుసుకోవచ్చు.

## మణిమేకలై (మణిమేఖల)

తమిళ కావ్యపంచకంలో[2] రచనా కాలమును బట్టి మొదటిదిగా గణించబడుతున్న యీ కృతిని సీత్తలై శాత్తనార్[3] అనే కవి వెలయించాడు. సీత్తలై అన్నది ఆయన విఖ్యాతనామం. చీముకారేతల అని దానికి అర్థం. భాషలోగాని భావంలోగాని ఏదన్నా దోషం కనిపిస్తే, వెంటనే శాత్తనార్ తాను వ్రాస్తున్న యినుపగంటంతో తలను పొడుచుకునే వాడట! ఈ కఠిన నియమానికి ఫలితంగా ఆయన శిరోభాగాన గాయములు ఏర్పడి చీము కారేదట. అందువల్ల, ఆయనకి సీత్తలై శాత్తనార్ అనే వ్యవహార నామం ఏర్పడినట్లు చెపుతారు.

శాత్తనార్ క్రీ. శ. 8వ శతాబ్దిలో జీవించినట్లు కొందరూ క్రీ. శ. 100-130 ప్రాంతాల నివసించినట్లు మరికొందరూ భావిస్తున్నారు. ఆయన మధురా నగర వాస్తవ్యుడనీ, ధాన్యవర్తకుడనీ తెలియవస్తున్నది.

శాస్త అనే మాటకు శాత్తన్ వికృతి కనుక, ఆయన బౌద్ధమతావలంబకు డని స్పష్టమవుతున్నది. సంస్కృతంలోనే కాక తర్కశాస్త్రంలోనూ ఆయన పండితు డనీ, సిలప్పదికార కృతికర్త అయిన ఇళంగో పూజ్యపాదులు ఆయనకి మిత్రుడనీ చెపుతారు.

శాత్తనార్ కవితలో సారళ్యం ఎక్కువ. అర్థవంతములూ రసోదంచితములూ అయిన సమాస రచనలో ఆయన ఘటికు డని విజ్ఞుల అభిప్రాయం. ఆనాటి బౌద్ధసంఘం మణిమేఖలలో మనోజ్ఞంగా వివరించబడింది. ఈ రసవత్కావ్యంలో 4,857 పంక్తులున్నవి. ఈ కావ్యానికి మణిమేఖలా సన్న్యాసం అనే అర్థం గల మణిమేకలై త్తుఱవు అనే నామాంతరం ఉన్నది.

మాధవి అనే వేశ్యకూ, కోవలుడు అనే వణిక్ ప్రముఖునికీ ప్రభవించిన ముద్దుగుమ్మ మణిమేఖల. ఈమె జీవిత విశేషాదికమును అభివర్ణించే కావ్యమే మణిమేఖల. దురదృష్టవశాన కోవలుడు దుర్మరణం చెందిన తర్వాత మాధవి తన సర్వస్వమూ పరిత్యజించి ఒక మున్యాశ్రమం ప్రవేశించింది. తల్లి ననుసరించి తనయ కూడా ఆశ్రమం ప్రవేశించింది. అప్పుడు మణిమేఖల పదుమూడేండ్ల పడుచు. ఆ అందాల బరిణను ఉదయనుడు అనే ఒక రాకుమారుడు ప్రేమించాడు. ఆమెను తనవశం చేసుకోవాలని అతడు శతవిధాల ప్రయత్నించాడు కూడా. కాని అవేమీ ఫలించవు. అరవణ పూజ్యపాదులనే ఒక మునివలన బౌద్ధమత ధర్మోపదేశం పొంది, చివరికి మణిమేఖల తన యావజ్జీవితమునూ బౌద్ధమత వ్యాప్తికోసం అంకితం చేసుకుంటుంది.

మణిమేఖలా కావ్యంలోని కథ పైన స్థూలారుంధతీ న్యాయంగా చెప్పబడింది. ప్రధానకథతో పాటు కొన్ని ఉపకథలుకూడా చెప్పబడడం వల్ల, కథలో కొంత క్లిష్టత ఏర్పడింది. అయినప్పటికి, కథలో కథ చొప్పించబడిన తీరు ప్రశంసార్హం.

## సిలప్పదికారం(సిలంబు+అదికారం)[4]

1,652 పద్యములు గల యీ మహాకావ్యం తమిళకావ్య పంచకంలో ద్వితీయమైనా, అద్వితీయమైన రచన. ఇది క్రీ శ. 9వ శతాబ్ది మధ్యభాగంలో

రచించబడినట్లు పరిశోధకుల విశ్వాసం. కాని పండితులు దీని రచనా కాలం క్రీ. శ. 2వ శతాబ్ది అని విశ్వసిస్తున్నారు.

సతీదేవి అని ప్రజాసన్నుతి చూరగొన్న కణ్ణకి దివ్యచరిత్ర మధుర మోహనంగా వర్ణించబడిన కావ్యం సిలప్పదికారం. ఐతిహ్య కథను తలపిస్తున్న కణ్ణకి కథ తమిళుల జాతీయగాథ. తమిళుల సామాజిక జీవనం, తిండి తీర్థములు పల్లెలు పట్టణములూ, వాటికి సంబంధించిన విశేషాలు, వర్తకుల స్థితిగతులు, ఇంద్రోత్సవం[5], తదవసరమున జరిగే వింతలూ వేడుకలూ, సంగీత నృత్య ప్రదర్శనలు, భోగవు జవరాండ్రు, సముద్ర వ్యాపారం, మత్స్యకారుల జీవితం-ఇత్యాది విషయాలను సహజ సుందరంగా ఈ కావ్యం చిత్రిస్తున్నది. కనుక, సిల ప్పదికారం ఆనాటి తమిళ సామాజిక జీవితాన్ని ప్రతిబింబించే మేలి దర్పణమని చెప్పడం అతిశయోక్తి కాదు.

ఇళంగో (యువరాజు) అనే రాజకవి సంతరించిన మధుర సృష్టి సిల ప్పదికారం. అతడు చేర రాజయిన సెంగుట్టువన్ సహోదరుడు[6]. ఒకప్పుడు కొందరు కార్తాంతికులు సెంగుట్టువన్ కంటె ఇళంగోయే సమర్థుడైన సమ్రాట్టుగా పేరు పెంపులు గడిస్తాడని చెప్పారట! అందువల్ల భ్రాతృగౌరవం కొద్దీ రాజ్య లక్ష్మిని వరించక ఇళంగో సన్యాసం స్వీకరించాడు. నాటినుంచీ ఆయనకి ఇళంగో అడిగళ్ (పూజ్యపాదులు) అనే వ్యవహారనామం కలిగింది.

ఇళంగో జైనమతావలంబకుడు. అందువల్ల ఆయన కృతిలో జైనమతా చారముల వైశిష్ట్యం వివరించబడింది. నాటక ధోరణిలో సంతరించబడిన యీ కావ్యమునకు ఇయల్ (సాహిత్యం) ఇశై (సంగీతం) నాటక పొరుళ్ తొడర్‌నిలై చెయ్యుళ్ అనీ నాటక కాప్పియం (దృశ్యకావ్యం) అనీ నామాంతరములు ఏర్పడి నవి. కనుక సిలప్పదికారం దృశ్యకావ్య ధోరణిలో సాగిన హృద్యమైన పద్యకావ్య మని పేర్కొనవచ్చు.

సిలప్పదికారంలోని యితివృత్తం కణ్ణకి జీవితగాథ అని తొలుతనే పేర్కొ న్నాను. ఇక కథా వివరాలను రేఖామాత్రంగా పరిశీలిద్దాము.[7]

తమిళ రాజ్యత్రయంలో ఒకటయిన చోళరాజ్యమునకు రాజధానీనగరం కావేరీపూంపట్టణం. అది ఆనాళ్లలో ప్రసిద్ధికెక్కిన రేవుపట్టణం కూడా. కుబేరుని తలదన్నిన వణిక్ప్రముఖులకు అది కాణాచి. మహానాయకుడు (మానాయకన్), మహాసత్త్వుడు (మాశాత్తువన్) అనే యిద్దరు వర్తక శిఖామణులు ఆ నగరంలో నివసించేవారు. మహానాయకుని కుమార్తె కణ్ణకి ఆమెకు పదుమూడవయేట మహాసత్త్వుని కుమారుడైన కోవలనితో మహావైభవంగా వివాహం జరిగింది. కొంత కాలం వారి వైవాహిక జీవితం సౌఖ్యావహంగా సాగింది. కాని ఆ తర్వాత, కోవలుడు మాధవి అనే భోగస్త్రీకి వశుడై కణ్ణకిని విస్మరించాడు. మాధవీ కోవలుల ప్రణయమునకు ఫలితంగా మణిమేఖల అనే కుమార్తె వారికి జన్మించింది. రోజులు గడవను గడవను, కోవలుడు మాధవిశీలమును శంకించాడు. ఆమెను విసర్జించి, మళ్లీ కణ్ణకిని స్వీకరించాడు. కాని అప్పటికి అతడు నిర్ధనుడు. పైగా, బాగా బ్రతికిన స్వస్థలంలో ఉండడానికి అతనికి ముఖం చెల్లలేదు. అందువల్ల, అతడు భార్యా సమేతుడై పాండ్యమండలానికి రాజధాని అయిన మధురానగరానికి ప్రయాణమై వెళ్ళాడు, వ్యాపారం చేసి, కోల్పోయిన సిరిసంపదలను గడించి, గౌరవంగా కాలం గడుపుదామనుకున్నాడు. కాని భగవంతుడు మరొకవిధంగా నిర్ణయించాడు. విధివశాన, కోవలునికి ఒక దొంగతదం అంటగట్టబడింది. తత్ఫలితంగా, అతనికి రాజభటులు హత్యచేశారు. భర్తృ మరణానంతరం క్రోధావేశపరవశ అయిన కణ్ణకి తన పాతివత్య ప్రభావం చేత మధురను పరశురామప్రీతి కావించింది. ఆ తర్వాత, ఆమె చేర రాజ్యమునకు రాజధాని అయిన వంజి నగరం చేరింది. అక్కడ భగవదనుగ్రహంవల్ల భర్తను కలిసికొని, కణ్ణకి దేవలోకమును చేరుకున్నది.

ఇలా కణ్ణకి కథ తమిళ రాజ్యత్రయమునకు చెందిన చేర చోళ పాండ్య మండలములతో ముడివడి వున్నది. తమిళులు నేటికీ ఆమెను సతీదేవిగా భావించి ఆరాధిస్తున్నారు.

ధర్మమార్గంలో సంచరించని రాజుకి ధర్మదేవత చేతిలో నాశనం తప్పదు; పతివ్రత అయిన స్త్రీ దేవతల ఆదరాభిమానములను సైతం చూరగొంటుంది, విధిని

మానవుడు పూర్ణుడు లేడు - అనే యీ మూడు సత్యములకు ఐక్యప్రాయంగా సిలప్పదికారం ప్రతిభాసిస్తున్నదని చెప్పవచ్చు.

## జీవక చింతామణి

మణిమేఖల, సిలప్పదికారములకు తర్వాత పేర్కొనదగిన ప్రశస్తకావ్యం జీవక చింతామణి. శృంగార రసప్రధానమైన యీ కృతిని తిరుత్తక్కదేవర్ అనే ఒక జైనకవి వెలయించాడు. అతడు మదరాసులోని మైలాపూరులో, జన్మించి నట్లు ఐతిహ్యం. చోళకులాబ్ధి శంఖముగా అతను ఉదాహృతుడు కావడం వల్ల, తిరుత్తక్కదేవర్ చోళవంశీయుడని నిస్సందేహంగా చెప్పవచ్చు. అతడు క్రీ. శ. 5వ శతాబ్దివాడని కొందరూ, 9వ శతాబ్దివాడని మరికొందరూ భావిస్తునారు. 9వ శతాబ్దివాడని భావించడమే సమంజస మనిపిస్తున్నది.

జీవక చింతామణికి "ముడిపొరుళ్ తొడర్ నిలైచ్చెయ్యుళ్" అనే నామాంతరం ఉంది. ధర్మార్థకామమోక్షములనే చతుర్విధ పురుషార్థములూ అందులో వివరించబడడం వల్ల, ఈ కృతికి ఆ పేరు వచ్చింది: జైన మతావలంబకుల తాత్త్విక రహస్యములూ, ఆనాటి సాంఘికాచారములూ ఇందులో మనోహరంగా తెలుపబడినవి.

జీవకుడు అనే ఒక రాకుమారుని జీవితగాథను ఈ కావ్యం అభివర్ణిస్తుంది. అతడు తొలుత భోగి; పిదప యోగి, ముక్తిమార్గ గవేషకు డవుతాడు జీవకుని చరిత్రను క్షత్ర చూడామణి, గద్య చింతామణి, శ్రీపురాణం మొదలైన సంస్కృత గ్రంథాలు కూడా వర్ణిస్తున్నవి. కాని వీటిలో ఏది జీవక చింతామణికి మాతృక అయిందో ఇదమిత్థమని చెప్పలేము. మనోహరములైన, వర్ణనలతోనూ, మధుర మైన శైలితోనూ. మనోజ్ఞములైన కథలతోనూ విలసిల్లే యీకావ్యం తరువాతి కవులకు మార్గదర్శక మయింది. కాగా, జీవక చింతామణి ప్రాశస్త్యమును ఉగ్గడించడానికి ఈ ఒక్క విషయమే చాలు.

ఇంకా కుండలకేశి, వళయాపతి అనే కావ్యములు ఉన్నవి. ఇవి కూడా జైన బౌద్ధుల కర్తృకములే. అయితే, యివి నామమాత్రంగానే తెలియవస్తున్నవి. పైగా ఈ కావ్యకర్తల పేర్లు కూడా తెలియరాలేదు.

జైనకవి కర్తృకములైన గ్రంథాలలో నాలడియార్ (చతుష్పది) కూడా పేర్కొదగినది. దైవస్తుతితో కలుపుకొని, యిందులో 401 పద్యములు ఉన్నవి.

తిరుక్కుఱళవలె, నాలడియార్ కూడా ప్రశస్తమైన నీత్యుద్బోధక రచన. "ఆలుం వేలుం పల్లుక్కుఱుది, నాలుం ఇరండుం చొల్లుక్కుఱుది"- అనే మధురోక్తి ఒకటి ఉన్నది. మర్రియు తుమ్మయు పళ్లకు గట్టి, నాలుగూ రెండూ మాటకు గట్టి - అని దీని అర్థం. అనగా, మర్రి తుమ్మ పుల్లలు పళ్లను గట్టిపరిచే ట్లుగా, నాలుగు పాదముల నాలడియారూ రెండుపాదముల తిరుక్కుఱళూ మాటకు బలం చేకూర్చునని అభిప్రాయం.

## మరికొన్ని రచనలు

కావ్యాలనే కాక ఛందోలంకార గ్రంథములు కూడా సంతరించి జైనబౌద్ధ కవులు తమిళ సాహిత్యమును పరిపుష్టం చేశారు. వాటిలో 10వ శతాబ్దపు వాడయిన అమిత సాగరుడు రచించిన యాప్పరుంగలం, యాప్పరుంగల క్కారిగై (కారిక) అనే ఛందోగ్రంథాలు, 11వ శతాబ్దికి చెందిన బుద్ధమిత్రుడు అనే కవి సంతరించిన వీరచోళీయమూ, జైన **మతావలంబకు** డైన గుణవీర పండితుడు వ్రాసిన నేమినాదమూ, పవణంది రచించిన నన్నూల్ అనే లక్షణగ్రంథమూ, గ్రంథకర్తృనామం తెలియని దండియలంకారమూ మొదలైనవి పేర్కొనదగిన రచనలు. వీరిలో పలువురు సంస్కృత పండితులు.

తొల్కాప్పియమును అనుసరించి వ్రాయబడిందే అయినప్పటికీ, నన్నూల్ (సద్గ్రంథము) తమిళ లక్షణ గ్రంథములలో మణిపూస వంటిది. సంస్కృత తమిళ వ్యాకరణ విధానములను సమన్వయపరిచే ఉద్దేశంతో సంతరించబడిన ప్రశస్త రచన వీరచోళీయం. దండి యలంకారం దండి కావ్యాదర్శమునకు సమర్థమైన తమిళసేత. తమిళంలో వెలసిన అలంకార గ్రంథములలో ఇది బహుథా పేర్కొనదగినది.

జైన బౌద్ధుల యుగంలో వెలుగులోకి వచ్చిన గ్రంథములలో పింగళముని కృతమైన పింగళ నిఘంటువు కూడా పేర్కొనదగినదే. దీనికి పూర్వమే దివాకర నిఘంటువు అనే ఒక నిఘంటువు సంతరించబడింది. ఇది క్రీ.శ. 8వ శతాబ్దపు రచన అని విజ్ఞుల విశ్వాసం. మొత్తంమీద జైన బౌద్ధుల కాలపు తమిళ సాహిత్యం అమూల్యమైనదని చెప్పక తప్పదు. ప్రాచీన కన్నడ సాహిత్యమును సుసంపన్నం చేసిన ఘనత జైనులకు చెందుతుంది. కాని దురదృష్టం! ఒక్క తెలుగులో మాత్రం వారు సృష్టించిన సాహిత్యం నేటికీ స్పష్టంగా వెలుగులోకి రాలేదు.

జైన బౌద్ధుల కాలంనాటి గ్రంథములలో తాత్త్విక రహస్యములు ఎన్నో చోటు చేసుకున్నా, వాటిలో ఆనాటి సమాజం ప్రతిబింబించడం వల్లనూ, ఉత్తమ కవితా లక్షణములు గోచరించడం వల్లనూ, వాటికి కావ్యయశస్సు మాత్రమే కాక తమిళ సాహిత్య చరిత్రలోనూ సముచితస్థానం లభించింది. ఇక కావ్యముల నుండి-ముఖ్యంగా పంచకావ్యముల నుండి - తెలియవస్తున్న రాజకీయ, సాంఘిక, మత విషయములను దిఙ్మాత్రంగా పరిశీలిద్దాము.

## సాంఘికాది విషయములు

అనాళ్లలో తమిళనాడులో చేర చోళ పాండ్యము లనే మూడు ప్రముఖ రాజ్యాలు వర్ధిల్లినవి. సిలప్పదికార కథాకాలం నాటికి చేరరాజ్యమును సెంగుట్టువన్ మన్నీడూ, చోళనాడును కరికాలచోళ భూపతీ, పాండ్యమండలమును నెడుంజెలియన్ మహీపతీ పరిపాలించేవారు. వారందరూ మత సహిష్ణుత ప్రదర్శించిన విశాల హృదయులు. తమిళ భాషాసాహిత్యాలనూ లలితకళలనూ పోషించిన రస హృదయులు. వారిలో ముఖ్యంగా ఎన్నదగినవాడు కరికాల చోళుడు. అతడు కావేరికి ఇరువైపులా గట్లు పోయించి, దేశమును వెల్లువలనుండి కాపాడి ప్రజారంజక పరిపాలకుడని పేరు పెంపులు గడించాడు. ఉత్తరా పథంలోని కొందరు రాజులను కూడా అతడు జయించినట్లు చెపుతారు. ఈ తమిళరాజులు విశాలహృదయులే అయినప్పటికీ, వారిలో వారికి అంతఃకలహాలు ఉండేవి. అంతేకాదు; ఇరుగు పొరుగుల ఉన్న రాజులతో కూడా వారికి విరోధం ఉన్నట్లు చెప్పవచ్చు.

తమిళ రాజుల పరిపాలనా కాలంలో కావేరీ పూంపట్టణం (పుహార్), మధుర మొదలైన పట్టణాలు సిరిసంపదలతో తులతూగుతూ ఉండేవి. పుహార్ ప్రసిద్ధ నౌకాశ్రయం. దూరదేశాలనుంచి కూడా అక్కడికి నౌకలు వస్తూవుండేవి. ఆ నగరంలో విభిన్న భాషలు వ్యవహరించేవారు పలువురు నివసించేవారట. మరువూర్ పాక్కమనీ, పట్టినప్పాక్కమనీ ఆ నగరం రెండుభాగాలు చేయబడింది. మొదటిది అనాగరక ప్రదేశం; రెండవది నాగరక ప్రదేశం. చాతుర్వర్ణ్యములవారూ, భోగస్త్రీలూ వేర్వేరు వీథులలో నివసించేవారు. మధురానగరపు వీథులు సువిశాలములూ సుందరములూను. సుందరోద్యానములూ తోపులూ ఎన్నో ఉండేవట, ఆ నగరంలో. యవనభటులు తన్నగర రక్షణకు నియమితులై ఉండేవారట. ఇలా తమిళ కావ్యాలనుండి కొన్ని పట్టణాలకు సంబంధించిన విషయాలను మనం గ్రహించవచ్చు.

ఆనాటి తమిళ సమాజంలో ధనికులూ వణిక్ప్రముఖులూ అయిన వైశ్యులకు ఎంతో గౌరవ మున్నట్లు స్పష్టమవుతుంది. వారి యిళ్లు వాకిళ్లు రాజభవనాలను తలపించేవి. తమిళ పంచకావ్యాలలో ప్రధానంగా కానవచ్చే స్త్రీ పురుషులు వైశ్యులే. వారిలో బాల్యవివాహాలు జరుగుతూ వుండేవి. పెళ్లినాటికి కోవలుడు పదహారేళ్లవాడు; కణ్ణకి పదమూడేళ్ల పడుచు. వారి వివాహం వేదోక్తంగా జరిగింది. బ్రాహ్మణులకు కూడా సంఘంలో గౌరవమూ పలుకుబడీ ఉండేవి. బ్రాహ్మణ సత్కారం శుభోదర్కంగా భావించబడేది. కాని కొంతమంది బ్రాహ్మణులు ఆ నాళ్లలోనే వేదాధ్యయనం విడిచిపెట్టి నృత్తగీతాది కళలు నేర్వడం మొదలు పెట్టినట్లు తెలియవస్తున్నది. ఆ రోజుల్లో వేశ్యాగమనం ధనికులైన సర్వవర్ణముల వారిలోనూ పరిపాటిగా ఉండేది. వేశ్యలు నృత్త గీతాదికళలలో విదుషీమణులై ఉండేవారు. వాటిని సంసారస్త్రీలు అభ్యసించినట్లు కనిపించదు.

ఆ రోజులలో స్త్రీలుకూడా. సన్న్యాసాశ్రమం స్వీకరించేవారు. పాతివ్రత్యమే వారికి ముఖ్య ధర్మంగా నిర్దేశించబడింది. నోములు నోచుట, తీర్థాలలో క్రుంకులిడుట మొదలైనవి వాడుకలో ఉండేవి. భర్తృ సేవానిరతివల్ల స్త్రీలకు సద్గతి లభ్య మవుతుందనే నమ్మకం ఉండేది. అప్పటికే ఆర్య, దేశి అనే భేదాలు వ్యాప్తిలోకి వచ్చినవి. కరికాలచోళుని సభామంటపంలో మాధవి తొలుక దేశి

నాట్యం చేసి, పిదప ఆర్య నృత్యం చేసినట్లు సిలప్పదికారం సాక్ష్య మిస్తున్నది. అందులో వర్ణితమైన అరంగేట్టుగాదై (రంగాధిరోహణ గాథ) పరిశీలించదగింది. సంగీత నాట్యాచార్యులు, వైణికుడు, మార్దంగికుడు, కవి మొదలైనవారు రంగాధిరోహణ కార్యక్రమంలో పాల్గొనేవారు. పర్వత ప్రాంతాలలో నివసించేవారు కుఱవ అనే దేశినాట్యంలో సిద్ధహస్తులై ఉండేవారు. ఇది రాసక్రీడ వంటిదని ము. రాఘవ అయ్యంగారు భావించారు.

ఆనాటి సమాజంలో కర్షకులకు కూడా విశేషమైన ఆదరభావం ఉండేది. శిల్పులు, చిత్రలేఖకులు మొదలైనవారు కూడా గౌరవించబడేవారు. నిర్ధనులు మట్టిగోడల యిళ్లలో నివసించేవారు. ఇళ్ల కప్పులకు వారు బోదకసవు, తాటాకులు, కొబ్బరాకులు మొదలైన వాటిని ఉపయోగించేవారు. గోడలకు ఎఱ్ఱమన్ను మెత్తేవారు. మధ్యతరగతివారి యిళ్లు రాతివి. కిటికీలు జింకకళ్లను తలపించేవి.

తమిళనాడులో జైన బౌద్ధమతాలు ఆరోజుల్లో ప్రచురప్రచారంలో ఉండేవని వేరే చెప్ప నవసరంలేదు. తమిళ కావ్య పంచకంలో మణిమేకలై, కుండలకేశి కావ్యాలు బౌద్ధమత ప్రాశస్త్యమునూ, సిలప్పదికార జీవక చింతామణి కృతులు జైనమత ప్రాశస్త్యమునూ ఉగ్గడిస్తున్నవి. జైన బౌద్ధములు ఉచ్చదశలో ఉన్నప్పటికీ, శైవ వైష్ణవములు కూడా వ్యాప్తిలో ఉండేవి. శక్త్యారాధన, జంతుబలులు మొదలైనవి ప్రచారంలో ఉండేవి. ఇన్ని మతాలు వ్యాప్తిలో ఉన్నప్పటికీ, మతకలహాలు ఉన్నట్లు తెలియడంలేదు. కావేరీపూంపట్టణంలో జైన బౌద్ధ విహారములతో పాటు శివకేశవాలయములూ, కుమారస్వామి కోవెలా, ఇంద్రాలయమూ, కృష్ణ బలరామ మందిరములూ మొదలైనవికూడా ఉండేవి. ఆ రోజుల్లో కుటుంబంలోని వారందరూ ఒకే మతం అవలంబించేవారని చెప్పలేము. ఇంద్రోత్సవం మహా వైభవంగా జరిగేది. శకునాలలోనూ, జ్యోతిష శాస్త్రంలోనూ, పునర్జన్మ కర్మ సిద్ధాంతములలోనూ నాటి ప్రజలకు నమ్మకం ఉండేది.

మణిమేఖల కథా కాలం నాటికి మృత శరీరులకు దహన సంస్కారం చేసే ఆచారం తమిళనాడులో వాడుకలో ఉండేది. కొందరు మృత కళేబరములను ఖననం చేసేవారు. కొందరు గద్దలు మొదలైనవాటికి ఆహారార్థంగా కళేబరములను బహిరంగ ప్రదేశములలో ఉంచేవారు. కొందరేమో పెద్దపెద్ద మట్టి

కుండలలో కళేబరాలను ఉంచి, ఆ కుండలను భూమిలో పాతిపెట్టేవారు. సమాధి కట్టే ఆచారం కూడా ఉండేది. మొత్తంమీద ఆనాటి వారు నాగరకు లనీ, దైవ భక్తులనీ, కళాహృదయులనీ నిస్సంశయంగా చెప్పవచ్చు.

ఇక సిలప్పదికార కావ్యంలో వర్ణితమైన కణ్ణకిని గురించి రెండుమాటలు. సతీదేవి అని వినుతి కెక్కిన ఆమెకు తమిళనాడులో చాలాచోట్ల ఆలయములు వెలసినవి. వీటికి సతీదేవ్యాలయము లని పేరు. సింహళంలో కూడా గజబాహువు అనే రాజు సతీదేవ్యాలయం ఒకటి నిర్మించినట్లు ప్రతీతి. అయితే యీ సతీదేవ్యాలయములు నేడు ద్రౌపదీ దేవ్యాలయములనే పేరుతో వ్యవహృతము లవుతున్నవి. తెలుగుదేశంలో కూడా సతీదేవ్యాలయం వెలసినట్లు తిరుమల రామచంద్ర అభిప్రాయం. విశాఖపట్టణంలోని కనక మహాలక్ష్మి గుడి కణ్ణకి గుడి కావచ్చునేమో!

ఉపసంహారంగా, జైన బౌద్ధుల యుగంలో వెలుగులోకి వచ్చిన గ్రంథములలో సంస్కృత శబ్దములూ ఆర్యాగాథలూ ఎన్నో ప్రవేశించినట్లు చెప్పవచ్చు. ఏది ఎలాఉన్నా, జైన బౌద్ధులు సంతరించిన కావ్యములకు తమిళ పంచకావ్యము లనే చిరయశస్సు కలగడం గమనించదగిన అంశం!

---

1. ఈ కావ్యత్రయమునూ మహామహోపాధ్యాయ, దాక్షిణాత్య కళానిధి అయిన డాక్టర్ ఉ. వే. స్వామినాథ అయ్యరు తొలుత ప్రకటించి తమిళ భాషా సాహిత్యాలకు ఎనలేని ఉపకారం చేశారు.

2. మణిమేకలై, సిలప్పదికారం, జీవక చింతామణి, వళయాపతి, కుండలకేశి అనేవి పంచకావ్యములు.

3. మణిమేఖలను వ్రాసిన కవి శాత్తనారే అయినా, ఆయన సంగకాలపు సీత్తలై శాత్తనార్ మాత్రం కాజాలడని వైయాపురిపిళ్లై అభిప్రాయం.

4. కథాదృష్టిలో కొందరు సిలప్పదికారమే తమిళ పంచకావ్యాలలో మొదటి దని భావిస్తున్నారు. కాని మణిమేఖలకు వ్యాఖ్యానం వెలయించిన అడియార్కునల్లార్ మణిమేఖలే తొలుత వెలసిన కావ్యమని పేర్కొన్నాడు. ఇంకా వివరాలకు: History of Tamil Language and Literature, పుటలు 146, 152

5. నన్నయభట్టు కూడా ఇంద్రోత్సవ ప్రశంస నెరపివున్నాడు. చూడుడు: ఆంధ్రమహాభారతం, ఆదిపర్వం, తృతీయాశ్వాసం.

6. ఇళంగో సెంగుట్టువన్ సహోదరుడు కాదని వైయాపురిపిళ్లై అభిప్రాయం. చూడుడు: History of Tamil Language and Literature, పుట 146.

7. వివరాలకు నా "తమిళ పంచకావ్య కథలు".

8. సాహిత్య దృష్టితోనే కాక చారిత్రక దృష్టితో చూచినా సిలప్పదికారం ప్రశస్తకావ్యమని తెలియవస్తుంది. కాని యేతత్కావ్యగత సంఘటనలు కొన్నిటిని పురస్కరించుకుని చూడగా, ఇది చారిత్రక లేఖనం కాదేమో అనే సందేహం కలుగుతుంది. సిలప్పదికారంలో 30 అధ్యాయములున్నవి. వాటిలో పెక్కు గాథలు కలవు. సిలప్పదికారం చారిత్రక కావ్యం కాదని వైయాపురిపిళ్లై అభిప్రాయం. History of Tamil Language and Literature, పుటలు 142 - 48.

—o—

# 4. శైవ వైష్ణవాచార్యుల యుగము

## శైవ వాఙ్మయము

జైన బౌద్ధ మతావలంబకుల ప్రాబల్యం ప్రాస్వ మయ్యేకొద్దీ తమిళనాడులో మళ్లీ శైవ వైష్ణవములు విజృంభించ సాగినవి. శైవం అతి ప్రాచీనమైన మతం. తమిళశైవులు శాకాహారులు. కనుకనే మాంసాహారులూ మద్యపాన నిరతులూ అయిన ఆర్యుల ఆచార వ్యవహారములు తమిళ శైవులకు నచ్చినవి కావు. కాని శైవమతంలో నానాటికి క్రతుకలాపం కొండవలె పెరిగిపోవడం వల్లనూ, మరి కొన్ని కారణాలవల్లనూ జైన బౌద్ధములు శైవుల ఆదరాభిమానములు చూరగొన్నవి. చాలామంది శైవులు జైన బౌద్ధములు స్వీకరించారు. తమిళ మహీపతుల పరమత సహనం కూడా జైన బౌద్ధమత వ్యాప్తికి సహాయ పడింది కాని కాల క్రమాన వైదిక విజ్ఞానం ప్రజాభిమానమును చూరగొనడంతో జైన బౌద్ధముల ప్రాభవం తగ్గుముఖం పట్టింది. అందుకు తోడుగా బసవేశ్వరుని వీరశైవం వ్యాప్తిలోకి వచ్చింది. కాగా, వైదికశైవం అవైదిక శైవం అనే భేదములతో శైవం బహుళ ప్రచారం గడించింది.

ఒకవైపు శైవమూ మరొకవైపు వైష్ణవమూ ప్రబలుతున్న కాలం అది శైవ సమయాచార్యులకు నాయన్మారులనీ, వైష్ణవ మతాచార్యులకు ఆళ్వారులనీ వ్యవహారనామములు ఏర్పడినవి. వారందరూ భక్తివాదం వల్లనూ తమ అద్భుత మహిమల వల్లనూ ప్రజాభిమానమును చూరగొన్నారు; జైన బౌద్ధమతాచార్యులతో చర్చలు జరిపి, వారిని ఓడించసాగారు. క్రీస్తుశకం 7వ శతాబ్ది ప్రాంతమున తమిళనాడులో చాలా ప్రాంతాలలో మత సంబంధమైన సమావేశములే; చర్చలే. మత చర్చలలో మునిగిపోయిన నాయన్మారులు గాని ఆళ్వారులు గాని ప్రత్యేక గ్రంథములు సంతరించక పోయినప్పటికీ, భక్త్యుద్బోధక గీతములు ఎన్నో సంతరించారు. ఆ భక్తి గీతములే పిదప సంకలనం చేయబడినవి. శైవ

గీత కదంబమునకు తిరుముఱై అనీ, వైష్ణవగీతికా సందోహమునకు నాలాయిర దివ్యప్రబంధం అనీ పేర్లు కలిగెను. కనుక శైవవైష్ణవా చార్యుల యుగంలో ప్రచారంలోకి వచ్చిన తమిళ సాహిత్యం మధురగేయమయమై, నిర్మలభక్తి ప్రధానమై ప్రతిభాసిస్తున్నది. ఈ గేయ సంపుటములు మతవిజ్ఞాన సర్వస్వము లని చెప్పవచ్చు కూడా.

భక్తివాదం ప్రజల ఆదరాభిమానములను చూరగొనడానికి ముందు, తమిళ నాడులో జైన మతావలంబకులదే పైచెయ్యిగా ఉండేది. జైనుల విజృంభణమును అరికట్టదలచిన హిందువులు కొందరు భక్త్యుద్యమమును ప్రారంభించారు. ఈ ఉద్యమమునకు భక్తియే మూలకందం, భక్తిప్రధానమైన ఈ వాదము కుల వివక్షతను నిరసించింది. జైన మతావలంబకులు ఎందరో హిందువు లయినారు. భక్త్యుద్యమమునకు ప్రజాభిమానం కలిగిన కారణంగా, తమిళనాడులో గుళ్లు గోపురములు ఎన్నో వెలసెను. దేవోత్సవములు వ్యాప్తిలోకి వచ్చెను, ఆలయములలో సంగీత సభలు, నాటక ప్రదర్శనములు మొదలైనవి జరగసాగెను. అంతకు ముందు ఏ కొద్దిమంది మాత్రమో చదువుతూవచ్చిన పురాణేతిహాసములు ప్రచుర ప్రచారంలోకి వచ్చినవి. తత్ఫలితంగా రామాయణ భారతములవంటి ఉద్గ్రంథములు తమిళం చేయబడినవి. ప్రజలభాషకు సాహిత్య గౌరవం కలిగింది. నాయన్మారులలోనూ ఆళ్వారులలోనూ చాలామంది సంస్కృత భాషాభిజ్ఞులు ఉన్నప్పటికీ, భక్త్యుద్రేకంతో వారు ప్రజల భాషలోనే గీతములు ఆలపించారు. గీతం లయప్రధానం. అందువల్ల, వారు పాడిన గీతములు ప్రజలను ఆకర్షించడంలో ఆశ్చర్యంలేదు.

పదకొండవ శతాబ్ది ప్రారంభంలో నంబియాండార్ నంబి అనే ఒక అర్చకుడు శైవుల ప్రార్థనాగీతములను అన్నిటినీ సేకరించి, వాటిని పదకొండు భాగాలు చేశాడు. ఈ గీతములను తిరుజ్ఞాన సంబంధర్, తిరునావుక్కరశర్, సుందరమూర్తి, మాణిక్యవాచకర్ మొదలైన నాయన్మారులు వెలయించారు. ఇవన్నీ ఈనాటికీ శైవులకు పరమప్రీతిపాత్రములు. నిజానికి, ఈ గీతికాగుచ్ఛములు భక్తిరసప్లావితములూ, సుధారస ఖండములూను.

## తిరు జ్ఞాన సంబంధర్

నాయన్మారులు మొత్తం అరవైముగ్గురు. వీరిలో అన్ని జాతుల వారూ ఉన్నారు. వీరు క్రీ. శ. 7వ శతాబ్ది ప్రాంతంలో జీవించినట్లు చెపుతారు.

శైవవాఙ్మయంలో మణిపూసగా గణించబడుతున్న గ్రంథం సంబంధర్ తేవారం. శైవమతస్థులకు ఇది ప్రీతిపాత్రమైన పారాయణగ్రంథం. తేవారంలోని గీతము లన్నీ శివపారమ్యమును ఉగ్గడిస్తున్నవి. ప్రతిగీతంలోనూ గేయాంశం మిక్కుటంగా ఉండడంవల్ల, తేవారం గానానుకూలమైన గ్రంథ మనడం అత్యుక్తి కాదు. ఈ గీతికాసంపుటమునకు గల ప్రచారం మరి యితర శైవ గ్రంథములకు లేదని చెప్పవచ్చు.

నాయన్మారులలో జ్ఞానసంబంధం చాలా విశిష్టుడు. తమిళనాడులోని శివాలయాలలో ఆయన విగ్రహం ప్రతిష్ఠితమై ఉంటుంది. నిత్యపూజా కైంకర్యములే కాక ఆయనకి ఏటేట ఉత్సవములు కూడా జరుగడం గమనించదగిన అంశం. ఆయన సమకాలికులైన అప్పర్, సుందరర్ మొదలైనవారే కాక, ఆ తరువాతి వారు కూడా జ్ఞానసంబంధమును ప్రస్తుతించారు.

భగవదనుగ్రహం వల్ల జ్ఞానసంబంధం కవిత చెప్పసాగినట్లు ఐతిహ్యం. మూడేండ్ల వయసున ఆయన తన తండ్రితో కూడా చెరువుకి వెళ్లాడట. స్నాన సంధ్యాదులలో మునిగిపోయిన తండ్రి కుమారుని సంగతి విస్మరించాడు. ఎంత సేపటికీ తండ్రి రాకపొయ్యేసరికి, జ్ఞానసంబంధం 'అమ్మా, అమ్మా' అని ఏడవడం మొదలు పెట్టాడు. జగజ్జనని అప్పుడు స్త్రీ వేషం ధరించి ఆయన్ని సమీపించి, ఒక పాలగిన్నె యిచ్చింది. ఆ పాలు తాగినవెంటనే ఆయన కవిత చెప్పడం ప్రారంభించాడట!

జ్ఞాన సంబంధం ప్రతిభావిశేషములను విని మధురను పరిపాలించే కూన్ పాండ్యుని పట్టమహిషి అయిన మంగైయర్కరసి ఆయన్ని మధురకు ఆహ్వానించింది. జైనమతావలంబకుడైన పాండ్యుని జ్ఞానసంబంధం శాస్త్ర చర్చలో ఓడించి, రాజుని శైవునిగా చేశాడు. తమిళనాడులో ఆయన మెట్టని శివాలయం లేదు; చూడని శివ విగ్రహంలేదు; పాడని పుణ్యస్థలం లేదు.

శైవ మతాచార్యుడుగా కవిగా ప్రథితయశస్కుడైన తిరుజ్ఞాన సంబంధుని కవితాశక్తిని గ్రహించడానికి ఆయన తేవారం అవశ్య పఠనీయం. అందులోని ఒక గీతమును పరిశీలిద్దాము.

'తోడుడైయ చెలియన్ పిడై యేఱి యోర్ తూవెణ్ మది చూడి
కాడుడైయ సుడవైప్పొడి వూసి, యెన్నుళ్లం కవర్ కళ్లవన్,
ఏడుడైయ మల రాన్, మున్నాట్ పణింద్ దేత్త వరుళ్ చెయ్ద
పీడుడైయ బిరమాపుర మే మియ బెమ్మా నివ నన్రే.'

చెవులన్ కుండలముల్ ధరించి, తలపై చేన్నార బాలాందు రే
ఖ, విభూతిన్ మెయినిండగా నలది, బింకంబార బక్కెద్దునె
క్కి, విరుల్ మాలలుగా ధరించియును, యోగిశ్రేణి సంసేవ్యుడౌ,
శివుడీ బ్రహ్మపురీశుడౌ నితడు నన్ చేపట్టుగా కెప్పుడున్.'

## తిరు నావుక్కరశర్

ఈ భక్తకవికి అప్పర్ అనే ప్రసిద్ధ నామాంతరం కలదు. దక్షిణార్కాడు జిల్లాలోని తిరువామూర్లో ఆయన జన్మించెననీ, 81వ యేట శివసాయుజ్యం చెందె ననీ చెప్పుతారు అప్పర్ పల్లవభూపతి అయిన మొదటి మహేంద్రవర్మ కాలపు వాడని (క్రీ. శ. 600-630) తెలియవస్తున్నది. మొదట్లో, ఆయన జైనుడు. జైన మతసిద్ధాంతములలో అనిష్టత ఏర్పడిన తర్వాత, అప్పర్ శైవం స్వీకరిం చాడు. ఆయన ప్రోద్బలంతో మహేంద్రవర్మ కూడా శైవుడైనాడు ఆయన సహోదరి అయిన తిలకవతికూడా జైనమును త్యజించి, శైవమును స్వీకరించి నట్లు చెపుతారు.

పైతృక మయిన సిరిసంపదలను ధర్మకార్యములకు వినియోగించిన మహా వితరణి అప్పర్. గుళ్లు గోపురములు, సత్రములు చావడులు, తటాక కూపములు మొదలైన వాటిని ఎన్నో నిర్మించాడు.

అప్పర్ సంగీత ప్రియుడు. ఆయన గీతములలో శబ్దసౌందర్యం ప్రస్ఫుట మవుతుంది. ఆయన ఎన్నో గీతములు వెలయించినట్లు విజ్ఞుల విశ్వాసం; కాని కొన్ని మాత్రమే నేడు లభ్యములు.

ఈ కింది గీతమును చవి చూడండి.

"నవ్య మోహన మధుర వీణానినాద
మధురిమము వోలె, చల్లని మందమారు
తము విధాతి, ప్రశాంత సంధ్యా సుధాంశు
కిరణముల రీతి, పంకజాకరము మాడ్కి,
లలితవాసంతికా శోభవలె చెలంగు
పావనములైన నా తండ్రి పరమశివుని
చరణ కమలంబు లవి మనోహరము, లతుల
శీతలమ్ము, లశేష సంప్రీతిదములు.

మతసహనం లేని జైనమతస్థులు శైవమును స్వీకరించిన అప్పరుని ఆవంలో ఉంచారట! అప్పుడా భక్తశిఖామణి నిశ్చలచిత్తుడై సర్వేశ్వరుని ఉద్దేశించి పై గీతమును పాడాడు.

## సుందరమూర్తి

శైవ సమయాచారులలో సుందరమూర్తి నాయనారు కూడా సంభావ్యుడు. అయన దక్షిణార్కాడు జిల్లాలో జన్మించాడు. ఆయన కాలంలో మత సంఘర్షణ తగ్గుముఖం పట్టడంవల్ల కాబోలు, అయన గీతాలలో పరమతఖండనం అంతగా కనిపించడం లేదు. ఆయన ఎన్నో గీతములు వెలయించినట్లు ప్రతీతి; అవన్నీ దొరకలేదు. సుందరమూర్తికి తరువాత విలసిల్లిన కవులలో మాణిక్య వాచకర్ సంభావ్యుడు.

## మాణిక్య వాచకర్:

ఆయన క్రీ. శ. 9వ శతాబ్దిలో జీవించినట్లు తెలియవస్తున్నది. కాని అంతకు పూర్వమే జీవించినట్లు కొందరు భావిస్తున్నారు. వీరశైవులకు ఆయన పరమాచార్యుడు. ఆర్యవిజ్ఞాన సర్వస్వం ఆయనజిహ్వాగ్రమున ఉండేదట! శాస్త్ర వైదుష్యం, ఐతిహాసిక పరిజ్ఞానం, అకలంక భక్తిభావం మొదలైనవి ఆయన గీతములలో స్థూలదృష్టికి కూడా వ్యక్త మవుతాయి. ఆయన నిజ నామధేయం

వాదవూరర్. మాణిక్యవాచకర్ అన్నది బిరుదం. మాణిక్యముల వంటి సూక్తులు చెప్పిన కారణం వల్ల ఆయనకి ఆ బిరుదు కలిగినట్లు చెపుతారు.

మాణిక్య వాచకుని ధీవిశేషమును, ప్రతిభను తెలుసుకుని అప్పటి రాజయిన అరిమర్దన పాండ్యుడు ఆయనను తన ప్రధానమంత్రిగా చేసుకున్నాడు. శక్తి సామర్థ్యాలతో మంత్రాంగం నిర్వహిస్తూ మాణిక్య వాచకర్ శైవమత ప్రచారం కూడా చేస్తూ ఉండేవాడు. ఆయనకి సంబంధించిన కథలు కొన్ని నేటికీ ప్రచారంలో ఉన్నవి.

మాణిక్యవాచకుని కృతులలో పేర్కొనదగిన తిరువాచకం (పవిత్ర ప్రవచనం) ఆయనకి తమిళ సాహిత్యంలో సముచితస్థానం సమకూర్చింది. ఇందు లోని గీతములలో పొంగులు వారే భక్తిభావం అంతర్వాహిని కావడం ఒక విశేషం. క్లిష్టములైన ఆధ్యాత్మిక రహస్యములను పామరులు సైతం సులభంగా అర్థం చేసుకునే విధంగా ఆ గీతములు సంతరించబడడం మరొక విశేషం. ఇంకొక విశేషం ఏమిటంటే, దేశికవితాశాఖకు చెందిన అమ్మానై (అచ్చన గాయలు ఆడేటప్పుడు స్త్రీలు పాడే పాట), తెళ్లేణం (గొబ్బిపాట), సాళల్ (ఉయ్యాల పాట) మొదలైన వాటిలోనూ ఆయన గీతరచన కావించాడు. ఈ కారణములవల్ల ఆయన రచనలకు పండిత పామరుల ఆదరముతో పాటు ప్రచుర ప్రచారమూ లభించినవి. కాళహస్తీశ్వర శతక కర్త అయిన ధూర్జటివలె ఆయన కూడా ప్రతి గీతంలోనూ ఆత్మోద్ధరణకై భగవంతుని ప్రార్థించినట్లు చెప్పవచ్చు. మచ్చుకి ఒక గీతం.

"సాహాయ్య మేమియు సలుపక మృతశ
రీరమ్ము వలె సంచరించు హృదయమః
ఆద్యుడై భాసించు నా నటరాజ
మూర్తియందు దిక నీకు మోహమ్ము సున్న.

ఆనంద తాండవం బాతని యెదుట
చేయనే చేయవు; హాయిగా పాట
పాడవు బొమికలు పొడియగు దాక.

భక్త్యంజలులు ఘటింపవు నీ వతనికి
శివు పదంబుల తల జేర్పవు నీవు.

అత దన్నచో భయం బసలే హుళక్కి
అతని కేమి సపర్య లాచరించెదవు?

వాడవాడలు శూలపాణికై తిరుగ
వీవు - నీ వలన నాకేమి లాభమ్ము?

అతడు జగదేక సంసేవ్య డమల చరితు
డతడు, నన్నుద్ధరించువా, డితర దైవ
ములను నే గొల్వ, నతని భక్తులు మదీయ
సఖులు, మెలగుదు వారితో సంతతమ్ము".

ఈ విధంగా నాయన్మారులు తమిళనాడులో జైన బౌద్ధములనుండి శైవమును ఉద్ధరించి తన్మత వ్యాప్తికి ఎంతో కృషి చేశారు. మత వ్యాపనంతో పాటు తమిళ సాహిత్యమును భక్తిప్రధానమైన గీతములతో సుసంపన్నం చేసిన రసప్రలుబ్ధులు వారు.

ఈ సందర్భంలో నాయన్మారుల జీవిత విశేషాదికమును అభివర్ణించే పెరియ పురాణమును గురించి రెండు మాటలు చెప్పడం భావ్యం. శైవ వాఙ్మయ చరిత్రలో ఈ గ్రంథమ్మునకు ప్రముఖస్థానం ఉన్నది. కొందరు ఈ కృతిని తమిళవేదమని ప్రశంసించారు. పెరియ పురాణమునకు శ్రీ భక్తవిజయం అనే అర్థ మిచ్చే "తిరుత్తొండర్ పురాణం" అనే నామాంతరం కూడా ఉన్నది. మతపరంగానే కాక సాహిత్య దృష్టితో చూచినా పెరియ పురాణం అమూల్యమైన రచన అని పండితలోకం భావిస్తున్నది. రెండవ కులోత్తుంగుని కాలంలో (1133-50) జీవించిన సేక్కిళార్ అనే పండితకవి పెరియ పురాణం వెలయించారు. ఆయనను అరుణ్ మొళిదేవర్ అనికూడా వ్యవహరిస్తారు.

## వైష్ణవ వాఙ్మయం

శైవంవలె వైష్ణవంకూడా అతి ప్రాచీనమైన మతం. దక్షిణ భారతంలో - ముఖ్యంగా తమిళనాడులో - వైష్ణవమత వ్యాప్తికి తోడ్పడినవారు ఆళ్వారులు అనవచ్చు. ఆళ్వారు అనేమాటకు జ్ఞానసంపన్నుడని అర్థం. అతని హృదయం ప్రేమకు నెలవు. అతడు ధ్యానసిద్ధుడు. శ్రీమన్నారాయణుడే పరదైవమని అతని ప్రగాఢ విశ్వాసం.

ఆళ్వారులు పన్నిద్దరు. ఆదిలో పదిమందే ఆళ్వారులు ఉండేవారనీ, తరువాతి కాలంలో మరియిద్దరు ఆళ్వారులుగా పరిగణించబడినారనీ పండితుల నమ్మకం. పొయ్‌గై ఆళ్వారు, భూతత్తాళ్వారు, పేయళ్వారు, తిరుమళిశై ఆళ్వారు (భక్తిసార), తిరుప్పాణాళ్వారు (మునివాహన), తొండరడిప్పొడి ఆళ్వారు (భక్తాంఘ్రి రేణు లేక విప్రనారాయణుడు), తిరుమంగై ఆళ్వారు (నీల), కులశేఖరాళ్వారు, పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు), శ్రీ ఆండాళ్, నమ్మాళ్వార్ (శఠకోప), మధుర కవి - వీరే పన్నిద్దరాళ్వారులు.

విష్ణుమూర్తి వస్తువాహనములకు ప్రతిరూపములే ఆళ్వారులని వైష్ణవులు కొందరు భావిస్తారు. భక్త్యాతిశయంతో వారు వెన్నుని ప్రస్తుతిస్తూ పాడిన గీతాలు నాలుగువేలు కలవు. వాటిని సంకలనం చేసిన మహనీయుడు నాథముని అనే ప్రముఖ భక్తుడు. ఈ సంకలన కృతికి నాలాయిర దివ్య ప్రబంధం అనిపేరు. వైష్ణవ మతానుయాయులకు ఈ గ్రంథమునందు గల ఆదరాభిమానములు నిరుపమానములు. ద్రావిడ వేదమని వినుతి కెక్కిన యీ గ్రంథం నేటికీ వైష్ణవాలయములలోనూ వైష్ణవ గృహములలోనూ పారాయణ గ్రంథం. ఈ 'ద్రవిడ ప్రబంధంబు చూచి' తాను ద్విపదగా పరమయోగి విలాసం సంతరించినట్లు తాళ్లపాక తిరువేంగళ నాథుడు అవతారికలో పేర్కొన్నాడు.[2]

నాయన్మారులలో వలె ఆళ్వారులలోనూ అన్ని కులాలవారూ ఉండడం గమనించదగిన అంశం.

ఆళ్వారుల కాలనిర్ణయంలో అభిప్రాయ భేదాలు ఉన్నవి. కాని పొయ్‌గై, భూత, పేయాళ్వారులు క్రీ. శ. 8వ శతాబ్ది పూర్వార్ధంలో జీవించి వుండవచ్చు

నని కొందరి అభిప్రాయం. వీరు ముగ్గురూ తలా నూరుగీతముల (పాశురముల) చొప్పున మున్నూరు గీతములు పాడినట్లు విజ్ఞుల విశ్వాసం. పొయ్‌గై మహాబలి పురంలోనూ, భూతత్తాళ్వారు కాంచీపురంలోనూ, పేయాళ్వారు మదరాసులోని మైలాపురులోనూ జన్మించినట్లు చెపుతారు. వైష్ణవ సమయాచార్యులలో వీరు ప్రథములుగా పరిగణించబడుతున్నారు. ప్రతియేడూ వీరికి ఐప్పసినెలలో (ఆశ్వయుజం) మూడురోజుల ఉత్సవం కూడా జరుగుతున్నది.

పొయ్‌గై ఆళ్వారు చెప్పిన ఒక ప్రసిద్ధ పాశురమును తిరువేంగళనాథుడు తెనిగించిన తీరు రమణీయయంగా ఉన్నది:

"ధరణి పంతియ, సముద్రంబులు నేయి,
యరుణు దీపము జేసి, యరుణాంశుతతులు
గారాబు చక్రంబు కైబూన్చినట్టి
నీరజాక్షున కిచ్చి నీరాజనంబు."

భూతత్తాళ్వారు సంతరించిన పాశురాలు భక్తిరస ప్రపూర్ణములు. ఆయన చెప్పిన యీ భక్తిగీతం చాలా ప్రసిద్ధమైనదీ:

"అన్బే తగళియా, ఆర్వమే నెయ్యాగ,
ఇన్బురుగు చింతైయిడు తిరియా, నన్బురికి
జ్ఞానచ్చుడర్ విళక్కేట్రినేన్ నారణర్కు
జ్ఞానత్తమిళ్ పురిన్దనాన్."

దీన్ని తిరువేంగళనాథుడు ఇలా తెలుగు చేశాడు.

"............ ప్రేమ
పంతియ, మితిలేని భక్తియే చమురు
నానందభరిత హృదబ్జంబె వత్తి
గా నొనరించి, వికాసమై యాత్మ
ధిరమొందు జ్ఞానంబు దీపంబు జేసి
పెలిమె నారాయణార్పితము గావించె."

## తిరుమళిశై ఆళ్వారు

ఈ ముగ్గురికి తరువాతివాడు తిరుమళిశై ఆళ్వారు. "కులంగళాయ యీారిరండిన్ ఒన్రిలుం పిఱన్దివేన్" (కులములు నాలుగింటిలో దేనియందును జన్మించని వాడను) అని చెప్పుకొనడంవల్ల, ఆయన నిమ్నజాతికి చెందినవాడై ఉండవచ్చునని కొందరి నమ్మకం.

తిరుమళిశై ఆళ్వారు సంస్కృత భాషాభిజ్ఞుడనీ, వేదాంత సారమును హృద్గతం చేసుకున్న వాడనీ తెలియవస్తున్నది. శైవ, జైన, బౌద్ధములను మొదట స్వీకరించి, ఆ మతములద్వారా తరణోపాయం తెలుసుకోలేక, చివరికి ఆయన వైష్ణవమును స్వీకరించినట్లు ఐతిహ్యం. ఆయన పాశురములలో నిశ్చలమైన భక్తిభావం ప్రస్ఫుట మవుతుంది. నామములో శ్రీచూర్ణం ప్రవేశపెట్టినవాడు ఆయనే అని కొందరి మతం. నాలాయిరదివ్య ప్రబంధంలోని తిరుచ్ఛంద వృత్తమునూ, నాన్ముగన్ తిరువంతాదినీ ఆయన రచించారు. ఒక గీతంలో తిరుమళిశై ఆళ్వారు యిలా పేర్కొన్నాడు:

"పృథివ్యాపస్తేజో వాయురాకాశము లనే
భూత పంచకములో నీ వున్నావు;
పంచభూతముల సంయోగ వియోగాదులవల్ల
ప్రభవించే ప్రతి వస్తువులోనూ నీ వున్నావు.
అటువంటి నిన్ను
ఎలా భజించను నేను."

## నమ్మాళ్వారు :

పన్నిద్దరాళ్వారులలో నమ్మాళ్వారు చాలా విశిష్టుడని పండితుల నమ్మకం. ఆయన అసలు పేరు మారన్ అనీ, పరాంకుశం అనే నామాంతరం కూడా ఉన్నదనీ చెపుతారు. నాలాయిర దివ్య ప్రబంధంలోని పాశురములలో వెయ్యికి పైబడినవి ఆయనవి ఉన్నవి ఆయన రచనలలో తిరువాయ్ మొళి

ప్రశంసార్హం. ఇతర రచనలు: తిరువిరుత్తం, తిరువాసిరియం, పెరియ తిరువ న్తాది మొదలైనవి.

ప్రతి పాశురంలోనూ భవసాగరం నుంచి తన్ను బంధవిముక్తునిగా చేయుమని నమ్మాళ్వారు విష్ణువును ప్రార్థించాడు. ఈ గీతం పరికించండి.

"నేను నా దను భావముల్ పూన కెపుడు
వాని మొదలంట నరికి విశ్వస్వరూపు
దేవదేవుని శ్రీహరి దెలిసికొనుము –
ఆత్మ కద్దియ గాదె గమ్యస్థమ్ము."

## పెరియాళ్వారు:

పెరియాళ్వారు (పెద్ద ఆళ్వారు) నామాంతరం గల విష్ణుచిత్తుడు అనభ్యస్త శాస్త్రిడైనా, ఆయన సంతరించిన గీతములు వైష్ణవులకు పరమప్రీతి పాత్రములు. విష్ణుమహిమవల్ల, ఆయన కవిత చెప్పినట్లు ప్రతీతి. అన్యమత సహనం ఆయన రచనలో కనిపించడం ఒక విశేషం. తిరుమొళి, తిరుప్పల్లాండు అనేవి ఆయన రచనలు. పాండ్యుని ఆస్థానంలో దిగ్విజయం సాధించి, స్వస్థలమైన శ్రీవిల్లిపుత్తూరికి వస్తూవుండగా దారిలో శ్రీ మహావిష్ణువు ఆయనకి దర్శన మిచ్చాడు. అప్పుడు బ్రహ్మానందభరితుడై విష్ణుచిత్తుడు 11 పాశురముల తిరుప్పల్లాండు వెలయించాడు. ఈ ఒక్క పాశురం మాత్రం తిరువేంగళ నాథుని కృతిలో చోటు చేసుకుంది.

"అడియోమోడుం నిన్నోడుం పరివిన్ద్రి
అయిరం పల్లాండు
వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాళ్‌సిన్ద్రి
మంగైయుం పల్లాండు
వడివార్ చోది వలత్తుఱైయుం చుడ
రాళియుం పల్లాండు
పడైపోర్ పుక్కు ముళంగుం అప్పాంచ
జన్యముం పల్లాండే".

(వలపల రవికోటి వడకించు కాంతి
దళుకొత్తుచుండు సుదర్శనంబునకు,

నల చెంతనని దైత్యు లగలు నాదములు
సలుపు చుండెడు పాంచజన్యంబునకును,

నపరంజి బొమ్మయో యన నొప్పు మేన
నుపమింపదగి యెద నున్న యిందిరకు,

పూనికతోడ నెప్పుడు బంటనైన
యేనును నీవును నెరవింతలేక
యొనగూడి యుండెడి యునికి కెంతయును
నెనసి యుండంగ బెక్కేండ్లు మంగళము
మంగళం బని పలుమారు...)

## ఆండాళు :

విష్ణుచిత్తుని కుమార్తెయే శ్రీ ఆండాళ్ (గోదాదేవి). ఆమె ముప్పయి పాశు రాలు పాడింది. ఇవి మధుర మంజులము లని వేరేచెప్ప నవసరం లేదు. విష్ణు మూర్తిని సేవించే అభిలాషతో పేరుపేరున సఖురాండ్రను ఉద్దేశించి ఆండాళ్ పాశురములు చెప్పినట్లు ఐతిహ్యం. వాటిలో మధురభక్తి ప్రవ్యక్త మవుతుంది. ఆండాళ్ రచనలు తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అని వ్యవహృతము లవు తున్నవి. తిమమొళిలో 143 గీతములు ఉన్నవి. నేటికి శ్రీవిల్లిపుత్తూరులో అం డాళుకి మహావైభవంగా ఉత్సవాదులు జరుగుతూ వుండడం గమనించదగిన అంశం.

## విప్రనారాయణుడు ;

భక్తాంఘ్రి రేణువైన విప్రనారాయణుని కథను అభివర్ణించే రచనలు ఎన్నో తెలుగులో వెలసిన విషయం సాహితీవేత్తలకు తెలిసిందే. బహుశః ఏ యితర ఆళ్వారుని గురించి తెలుగులో అన్ని రచనలు వెలువడ లేదన్నా అతిశయోక్తి కాదు. విప్రనారాయణుడు సంతరించిన ప్రాబోధకీస్తుతి (తిరుపళ్లి ఋచ్చి

చక్కని రచన. మూలంలోని కొన్ని భాగములను విడిచిపెట్టినా, తిరువేంగళ నాథుని తెలుగుసేత ఎంతో మనోహరంగా సాగింది. ఈ క్రింది పంక్తులు పరిశీలించండి

> "ములముల వికసించు మొల్ల క్రొన్ననల
> వలపులు తూర్పు వీవలు లెచ్చరింప
> మంచు గుబ్బలుల వేమరును గేలించు
> నించు రెక్కల మించు నెసగ జాడించి
> నెత్తావి యిండ్లలో నిదురించుచున్న
> మత్తహంసలు నంచమగలు మేల్కానిరి
> పాలించి కరుణ చొప్పడ యోగనిద్ర
> జాలించి శ్రీరంగశాయి మేల్కానవె..."

ఈ అనువాదములు పరిశీలించిన తర్వాత, తిరువేంగళనాథుడు నాలాయిర దివ్య ప్రబంధమును యథాతథంగా తెలుగు చేసి వుంటే ఎంత బాగుండేది - అని పిస్తుంది.

ఆళ్వారులలో కులశేఖరుడు కూడా ప్రముఖుడే. ఆయన పండితకవి. సంస్కృతంలో మహాపండితుడు. ఆయన తొలుత సంస్కృతంలో ముకుంద మాలను సంతరించి, ఆ తర్వాత దాన్ని 105 పద్యముల కృతిగా తమిళం చేశాడు.

## తిరుమంగై ఆళ్వారు :

ఆళ్వారులలో తిరుమంగై ఆళ్వారు కడపటివాడు. ఈయన కవిత సెల యేటి జాలువలె సాగుతుంది. ఆయన ప్రకృతి వర్ణనలు మధురములూ లలితము లూను. భక్తిమార్గమే విష్ణుసాన్నిధ్యమునకు సోపాన మని ఆయన రచనలవల్ల విదిత మవుతుంది.

తిరుమంగై ఆళ్వారు తొలుత చోరుడనీ, శ్రీరంగనాథుడూ ఆండాళూ శ్రీవిల్లిపుత్తూరుకి వస్తూవుండగా, ఆయన వారిని దారిలో అడ్డగించెననీ దివ్య

ప్రబంధం చెపుతున్నది. ఆయన 1,361 గీతములు సంతరించాడు ఆళ్వారులలో ఆయనే మహావిద్వాంసుడని కొందరి విశ్వాసం.

"సారము లేని యిట్టి భవ
సాగర మందు మునింగి మార్గమే
తీరున గానలేక యతి
దీనత కన్నులు వాడి వత్తలై
సారము వోవ, నిన్ను కడ
సారి కెటో తిలకించినాడ, నా
భారము తీరెనయ్య - భగ
వంతుడ వీవె రమాధినాయకా!"

తిరుమంగై ఆళ్వారు రచన అంతా ఈ విధంగానే ఉంటుంది. ఆ రచనలో అకలంక మైన భక్తి అంతర్లీనమై ఉండడంవల్ల, ఆయన పద్యాలు సంతత పఠనార్హములై ప్రచుర ప్రచారంలో ఉన్నవి.

వైష్ణవ వాఙ్మయంలో నాలాయిర దివ్య ప్రబంధం, అష్టప్రబంధం, శఠగోపరం తాది, రామానుజ నూర్రంతాది మొదలైనవి పేర్కొనదగిన రచనలు. ఆళ్వారుల కాలంలో సంస్కృత భాషా సాహిత్యములకు మున్నెన్నడూ లేనంత ప్రచారం లభించింది. చివరికి వ్యాఖ్యాతలు కూడా సంస్కృత ద్రావిడ సమ్మిశ్రితమైన మణిప్రవాళంలో రచనలు చేశారు. వాటికి ప్రజాదరణ లభించింది కూడా.

ఉపసంహారంగా, శైవ వైష్ణవ సమయాచార్యుల కాలపు తమిళసాహిత్యం భక్తిరసప్రపూర్ణ మని నిస్సంశయంగా చెప్పవచ్చు. శైవ వైష్ణవ కవులు ఒక్క కులమునకు చెందినవారు కారు. కులభేదాలను నిరసించిన విశాల హృదయులు వారు! వారిలో నిమ్నజాతులకు చెందినవారు కూడా ఉండడం పేర్కొనదగిన అంశం! భక్త్యుద్యమ ప్రభావంవల్ల ఒక్క తాటిమీద నిలిచిన శైవ వైష్ణవ కవులు భక్తిమార్గమే తరణోపాయమునకు సోపానమని ప్రబోధించడంలో ఆశ్చర్యం ఏమున్నది? కనుకనే పొంగులు వారే భక్త్యావేశం వారి మధుర రచనలలో అంత

ర్వాహిని అయింది. నిజమునకు, ఈ భక్త్యావేశమే వారి రచనలకు జీవం పోసిం దని చెప్పవచ్చు.

మరొక విశిష్ట లక్షణం కూడా ఆ కాలపు వాఙ్మయంలో కనిపిస్తుంది. శైవ వైష్ణవ కవులు వృత్త రచన సాగించినా, సంస్కృతభాషాభిజ్ఞులే అయినా, వారికి తమిళభాషా సాహిత్యముల పట్ల ఎనలేని ఆదరమూ అభిమానమూను. పరమేష్ఠి, విష్ణుచిత్తుడు మొదలైన సంస్కృత శబ్దములను పరమేట్టి, విట్టుచిత్తన్ అని తమ భాషాలక్షణమునకు అనుగుణంగా మలచుకున్నారు. పారాయణ గ్రంథములు సంతరించిన భక్తకవులు వారు! వారి రచనలు గానానుకూలములై ఉండడం మరొక విశేషం!

---

1. బ్రహ్మపురం: ఇది నేటి షియాలి. జ్ఞాన సంబంధుని జన్మస్థలం.

2. పరమ యోగి విలాసము (తిరుమల తిరుపతి దేవస్థానంవారి ప్రచురణ, తాళ్లపాకంవారి కృతులు, 1938) "పనుపడ ద్రవిడ ప్రబంధంబు చూచి తెనుగున రచియింపు ద్విపద రూపమున".

—o—

# 5. కవిత్రయ యుగము

తమిళ సాహిత్య చారిత్రలో చోళమహీపతుల పరిపాలనా కాలం (క్రీ.శ. 850-1200) స్వర్ణయుగ మని తమిళపండితుల విశ్వాసం. కంబన్, ఒట్టుక్కూత్తర్ (వాణిదాసుడు), జయంగొండార్ మొదలైన మహాకవులు జీవించింది యీ యుగంలోనే. కావ్యాలు, పురాణాలు, స్థలమాహాత్మ్య గ్రంథాలు - మొదలైనవి. ఎన్నెన్నో వెలుగులోకి వచ్చిందికూడా ఈ యుగంలోనే. వైద్య, జ్యోతిష రచనలు కొన్నిట్లో వ్యావహారిక తమిళం ప్రయుక్త మయింది. చోళుల యేలుబడిలో సంస్కృత భాషా వాఙ్మయములకు బహుళప్రచారం లభించింది. తత్ఫలితంగా సంస్కృతగ్రంథాలు కొన్ని తమిళం చేయబడినవి. సంస్కృతభాషా పరిజ్ఞానం గల పండితుల సంఖ్యకూడా ఎక్కువయింది. కాగా, మౌలిక రచనలతోపాటు అనువాదములు కూడా వెలుగులోకి వచ్చినవి.

తమిళ సాహిత్యసదనంలో మణిదీపిక వెలిగించిన మహనీయుడు కంబ మహాకవి. తమిళవేద మైన తిరుక్కుఱళను ప్రసాదించిన తిరువళ్లువరుని మినహాయిస్తే, కంబ మహాకవి వలె ప్రథితయశస్కుడైన ప్రశస్తకవి మరొకరు తమిళ సాహిత్యంలో లేడని చెప్పవచ్చు. ఆయన 9వ శతాబ్దికి చెందినవాడని కొందరూ, 12వ శతాబ్దికి చెందిన వాడని మరికొందరూ భావిస్తున్నారు.

కవి చక్రవర్తి బిరుదాంకికుడు కంబ మహాకవి. 'కవ్వియిర్ పెరియవన్ కంబన్' (కవిత చెప్పుటలో అధికుడు కంబన్), 'కంబన్ వీట్టు కట్టుత్తరియుం కవి సొల్లుం' (కంబన్ యింటిలోని కట్టుకొయ్య కూడా కవిత చెప్పును) అని తమిళులు ఆయనకి నివాళులు అర్పించారు. తమిళ నవయుగ ప్రవక్త అయిన సుబ్రహ్మణ్యభారతి ఆ మహాకవిని ఇలా ప్రస్తుతించాడు :

> "కవ్వి సిఱన్ద తమిళ్‌నాడు-పుగళ్
> కంబన్ పిఱన్ద తమిళ్‌నాడు"

(కవితకు పేరొందిన తమిళనాడు-కీర్తి
కంబుడు ప్రభవించిన తమిళనాడు.)

ఈ ప్రశంసలకు కంబ కవిచక్రవర్తి ఎంతయినా అర్హుడు!

కంబని కృతులలో రామావతారం అనే నామాంతరంగల రామాయణం బహుధా పేర్కొనదగినది. ఈ రసవత్కావ్యం ఆయనకి చిరయశస్సు సమకూర్చింది. వాల్మీకిని అనుసరించే కంబడు రామాయణం వెలయించాడు. అయితే అది అనువాదం మాత్రం కాదు. ఆయన వర్ణనలు సహజ సుందరములు. అలంకారములు ఆయన సుకుమారహస్తంలో అందాలు దిద్దుకొన్నవి. ముఖ్యముగా ఉపమాలంకారములు చెప్పడంలో ఆయన్ని మించిన వారు మరొకరు తమిళసాహిత్యంలో లేరన్నా అతిశయోక్తి కాదు. ఆయన వర్ణనాంశములు దైనందిన జీవితంనుంచి గ్రహించ బడినవి. కొన్ని ఘట్టములు కంబరామాయణంలో అద్భుతంగా తీర్చి దిద్ద బడినవనీ, అవి వాల్మీకి రామాయణ కథాఘట్టముల కంటె కూడా మిన్నగా ఉన్నవనీ కొందరు తమిళ పండితుల నమ్మకం.

ప్రాచీనాంధ్రకవుల చరిత్రవలె, కంబకవి చరిత్ర కూడా నేటికీ స్పష్టంగా తెలియరాలేదు. అద్భుత విషయాలు కొన్ని ఆయన జీవిత చరిత్రను ఆవరించినవి. కంబడు రాజసుతుడని కొందరి అభిప్రాయం. కంబనాడు అనే దేశానికి చెందినవాడట! కంబ జాతికి చెందినవాడవడంవల్ల, ఆయనకి కంబబడు అనే పేరు కలిగిందని కొందరి అభిప్రాయం. ఆలయ ధ్వజస్తంభం (కంబం) వద్ద జన్మించడం వల్లనూ, కంబజాతికి చెందిన ఒక పూజారి పెంచడం వల్లనూ కంబకవికి ఆపేరు కలిగివుండవచ్చునని కొందరి అభిప్రాయం.

కంబడు ఏడేండ్లవాడుగా ఉన్నప్పుడు శడయప్ప ముదలి అనే ఒక భూస్వామి అతనిని ఆదరించాడట. ఆ సహృదయుడే అతని జీవితమును తీర్చి దిద్దినవాడు. చదువు సందెలు లేకుండా ఆలకాపరులతో అల్లరి చిల్లరిగా కంబడు తిరగడం చూసి, అతని తల్లి విచారించిందట. శడయప్ప ముదలి ఆదరం లభించిన పిమ్మట, కంబడికి విద్యాభ్యాసం చేసే అవకాశం కలిగిందనీ, ఒక రోజు కాళికాదేవి ప్రత్యక్షమయిందనీ, తదాదిగా అతడు కవిత చెప్పడం మొదలు పెట్టి

ననీ, అతని కవితాశక్తిని చూసి ముగ్ధుడై మూడవ కులోత్తుంగ చోళుడు అతనిని తన ఆస్థాన కవిగా చేసుకున్నాడనీ చెపుతారు. ఆ తర్వాత, ఆయన రామాయణ రచనకు ఉపక్రమించాడట.

తంజావూరు జిల్లాలోని మాయవరం తాలూకాలోని తేరళనూర్ (తిరువళున్దూర్) అనే గ్రామంలో కంబడు జన్మించినట్లు ఐతిహ్యం. ఈ గ్రామంలోని ఆలయంలో ఆయన విగ్రహం ఒకటి ఉన్నది,

మూడవ కులోత్తుంగ చోళుని కొలువుకూటంలోని కవిశేఖరులలో ఒట్టకూత్తర్ చాలా ప్రసిద్ధుడు. రాజాజ్ఞను పురస్కరించుకుని ఆయన కూడా రామాయణ రచన ప్రారంభించాడనీ, ప్రారంభించిన ఆరునెలలలో ఆరు కాండలు ముగించాడనీ చెపుతారు. అప్పటికింకా కంబకవి తన రచనకు శ్రీకారం చుట్టలేదట! ఒకరోజు చోళుడు వారిద్దరినీ పరీక్షించదలచి, మొట్టమొదట కంబకవిని ఆయన రచించిన రామాయణంనుంచి ఒక పద్యం చదవమని కోరాడు. అప్పుడు కంబకవి ఆశువుగా ఒక పద్యం చదివాడు. అందులో "తుమి" అనే ఒక అప ప్రయోగం కనిపించింది. తుళి (చుక్క లేక బిందువు) అనడానికి మారుగా కంబడు తుమి అన్నాడనీ, అది గ్రంథస్థమైన ప్రయోగం కాదనీ ఒట్టకూత్తర్ వాదించాడు. కానీ కంబడు తుమి వ్యవహారసిద్ధమై ఉన్నట్లు నిరూపించాడు. ఆ తర్వాత, ఒట్టకూత్తర్ తాను రచించిన ఆరుకాండల రామాయణ గ్రంథాన్ని నాశనం చేశాడట !

కంబకవి గుణగణములలో ఆయన కృతజ్ఞతాగుణం ముఖ్యంగా పేర్కొనదగింది. బాల్యంనుంచీ తనను ఆదరించిన శడయప్ప ముదలిని ఆ మహాకవి తన రామాయణంలో ప్రస్తుతించాడు. దారిద్ర్యమును మటుమాయంచేసే దివ్యౌషధ మట శడయప్ప ముదలి! ఆయన్ని గురించి కంబడు చెప్పిన విషయాలలో ఇది ఒకటి.

వాల్మీకి మధుర సృష్టిని అనుసరించి కంబకవి రచన చేసినా, కంబ రామాయణంలో మూలమునకు భిన్నములైన మార్పులు ఎన్నో గోచరిస్తున్నవి. వివాహాత్పూర్వమే సీతారాములు ఒకరి నొకరు చూచుకోవడమే కాకుండా

ప్రేమించుకున్నారు కూడా. ఈ విషయమును సీతను సందర్శించే సమయంలో ఆమెకు తెలియజేయుమని రాముడు హనుమంతుని కోరడం, అగస్త్యాశ్రమం నుంచి పంచవటికి వెళ్లేటప్పుడు మార్గంలో జటాయువుని కలుసుకోవడం, పర్ణ శాలతో కూడా రావణాసురుడు సీతాపహరణం చేయడం, ఆ పర్ణశాలను అతడు తన రథంలోనే ఉంచుకుని లంకకు ప్రయాణమై వెళ్లడం, కైకేయిని రాముడు దూషణోక్తులాడక పోవడం, సుగ్రీవుని కంటె వాలినీ, విభీషణునికంటె రావణునీ ప్రశంసించడం, అంగదుడు రామచంద్రుని శరణు వేడడం, విభీషణుడు రావణు నికి హిరణ్యకశిపుని వృత్తాంతమును నివేదించడం- మొదలైన మార్పులు గమనించ దగినవి. ఈ మార్పులు కథాగౌరవమును ఇనుమడించేవి కనుక, ఇవి సమర్థ నీయములు.

తెలుగు రామాయణకర్తలవలె, కంబమహాకవి కూడా శ్రీరాముని దైవంగా సంభావించాడు. వాలి, రావణుడు – వీరి యందు రాముడు ప్రకటించిన సహాను భూతి పరిశీలనార్హం. సీతను ఏ సందర్భంలోనూ రావణునిచేత స్పృశించ నీయ లేదు. పైగా, పతివ్రతా తిలకమైన ఆమెను కనుక తాకితే ప్రాణాపాయం కలుగు తుందనే భయం అతనికి కలుగజేశాడు. రావణుడు వేదాధ్యయన పరుడనీ, శివ భక్తుడనీ, సంగీత ప్రియుడనీ కంబడు పేర్కొన్నాడు. రావణుడు గొప్ప వైణికు డట; అతని ధ్వజం మీద వీణ ఉన్నదట! హనుమంతుణ్ణి ఒక వీర యోధునిగా చిత్రించాడు. రాజుగా కాక రామ భక్తుడుగా గుహుడు కంబరామాయణంలో మనకు దర్శన మిస్తాడు. గుహుని కథను చదువుతున్నంత సేపు కాళహస్తి కన్నప్ప కథ గుర్తుకి వస్తుంది. వాల్మీకంలోని కొన్నికథలను కంబడు విస్తరించి వ్రాశాడు. ఆ కోవకు చెందిన వాటిలో అహల్యా వృత్తాంతం ఒకటి.

కంబరామాయణంలోని స్త్రీ పాత్ర చిత్రణ ఉదాత్తమైనది. స్త్రీలను గురించి అసభ్యములూ అశ్లీలములూ అయిన విషయాలు కంబని కృతిలో కనిపించవు. వాలి మరణానంతరం అతని భార్య తారను సుగ్రీవుడు తన సతిగా గ్రహించినట్లు వాల్మీకంలో పేర్కొనబడింది. కాని కంబరామాయణంలో వాలి విగతజీవుడైన పిమ్మట, తార విరక్త మనస్కగా వర్ణించబడింది. నగలూ నాణెములనే కాక పసుపు కుంకుమలు కూడా ఆమె త్యజించింది. శ్వేత వస్త్రధారణ చేసింది. ఆమె

యందు సుగ్రీవుడు మాతృభావం ప్రదర్శించాడు. తల్లీ! అని ఆమెను సంబోధించాడు. కంబరామాయణంలో ఏ సందర్భములోనూ రాముడు తన ఘనతను తానే ప్రకటించుకొనడు. అటువంటి సందర్భాలలో లక్ష్మణుడు రామ ప్రశంస చేస్తాడు. రాముని చూచి గుహుడు "అయ్యా! తమరెవరు?" అని ప్రశ్నించగా, అప్పుడు లక్ష్మణుడు రాముని గుణ సంకీర్తనం చేస్తాడు. అలాగే, సుగ్రీవాది వానరశ్రేష్ఠుల సమక్షంలో కూడా రాముని గూర్చి లక్ష్మణుడే చెపుతాడు. రామాయణంలోని వివాదగ్రస్త విషయాలలో ఒకటి అయిన వాలి వధను కంబడు సమర్థించాడు.

కవిత్వం నదీ ప్రవాహంవలె గంభీరంగా ఉండాలని కంబకవి అభిప్రాయం. నిజానికి ఆయన కవిత్వం ఎంత గంభీరమో అంత లలితమూను. ఆయన పద్యపు నడక మధుర మోహనం. తమిళ కావ్యపంచకంలోని జీవక చింతామణిని ఆయన అనుసరించినట్లు పండితాభిప్రాయం. గోదావరిని అభివర్ణించే సందర్భంలో ఆయన అణి (అలంకారం), పొరుళ్ (ధ్వని లేక భావం), తుఱై (ఉక్తివైచిత్ర్యం), తిణై (శృంగార వీర రస ప్రధానములైన యితివృత్తం), ఒழుక్కం (శైలీమాధుర్యం) మొదలైనవి కవిత్వంలో అంతర్లీనములై ఉండాలని పేర్కొన్నాడు. కంబకవితలో ఈ గుణములు నెలకొన్నవి. కనుకనే ఆయన రచన పండిత పామర రంజకమయింది.

ఇక కంబరామాయణంలోని కొన్ని మధుర భావములను పరికిద్దాము.

అడవికి వెడుతున్న రాముణ్ణి చూడగానే కౌసల్యా హృదయం శోకార్ణవమయింది. దశరథుని దీనావస్థనుచూచి ఆమె మరింత బాధపడింది అప్పటి ఆమె పరిస్థితిని కంబకవి ఇలా రెండు మాటలలో వర్ణించాడు. "రెండు దూడలు గల ఆవు వాటికి పాలిచ్చేటప్పుడు ఎలా ఆరాటపడుతుందో, అలా కౌసల్య దశరథుణ్ణీ రాముణ్ణీచూచి ఆరాటపడింది." తండ్రిమాటను కాదనక రాముడు విపినభూములకు వెళ్లేముందు, అతడు కైకేయిని నిందించలేదు. తన కామె మహోపకారం చేసినట్లుగా భావించాడు "బరువు మోసిన ఎద్దు కావడి విప్పగానే, ఆ విప్పిన కారుణికుణ్ణి చూచి లోలోన కొనియాడినట్లుగా, రాముడు అడవికి వెళ్లెను."

అశోకవనంలో ఉన్న సీతాదేవికి హనుమంతుడు రాముడిచ్చిన అంగుళీయకము - ఇయ్యగా, దానినిచూసి ఆమె బ్రహ్మానంద భరితురాలయింది. ఆ ఆనందాన్ని కవి ఇలా ఊహించాడు. "కోల్పోయిన మణిని పొందిన పన్నగపు మనస్సు, మరణించినాడని తలచిన తన ఒక్కగాని ఒక్క కుమారుడు పునరుజ్జీవితుడు కాగా అతన్ని చూసి సంతసించే తల్లి మనస్సు, ఏదో ఒక మహిమవల్ల చూపుని పొందిన పుట్టుగ్రుడ్డి మనస్సు ఎలా ఉంటాయో, అలా సీతాదేవి మనస్సు ఉన్నది."

సీతాలక్ష్మణ సమేతుడై రాముడు అడవికి వెళ్లిన వెంటనే దశరథ మహారాజు దైవికం చెందాడు. ఆ వృద్ధభూపతి మరణవార్తను విని పౌరులు ఇలా పరితపించారట! "వ్యాధిగ్రస్తుడైగాని, బెడిదపుటమ్ము వల్లగాని మరణించక, కన్న సంతానం కారణంగా దశరథుడు మరణించాడా! నాగుబాము, అరటిచెట్టు, వెదురు చెట్టు సంతానం పొందగానే నాశన మవుతాయి. అలాగే, సంతానం కారణంగా దశరథుడు గూడా విగతజీవుడైనాడు గదా! ఎంత కష్టం!"

గుహుని నల్లని మేను కంబకవి దృష్టిలో "నూనె పూసిన అద్దకపు గుడ్డలా నల్లగా నిగనిగలాడుతూ" కనిపించింది. ఒక్కొక్కసారి ఆ మహాకవి తాను చెప్పదలచిన విషయమును పాఠకుని హృదయానికి హత్తుకు పోయేందుకుగాను ఉపమపై ఉపమ చెప్పుతాడు. నీల మేఘశ్యాముడైన రామచంద్రుణ్ణి కంబడు ఇలా దర్శించాడు. "మైయో (కాటుకో), మరకతమో, మఱి కడలో (సముద్రమో) మైశెముగిలో (కారుమబ్బో) - అలా కనిపించిందట రాముని నీలంపు తనువు!

మంథర చేసిన దుర్బోధకు లోనై కైకేయి తన ఆభరణాద్యలంకారములను పరిత్యజించిన ఘట్టమును కంబకవి ఇలా చిత్రించాడు.

"... ... ... ...

తన కురుల నున్న మల్లె పూదండ దీసి
నేలకున్ గొట్టె కైక - వినీల ఘనవి
చలిత శశిబింబ మిలవైచి నలిపినటుల.

వంశగతకీర్తిలతికను వమ్ము చేసి
నటుల, తన మేఖలా కంకణాళి తొలగ
ద్రోచి, చంద్రునిలో మచ్చ దుడిచె.

కనుల కాటుకనీరు తొల్కాడ, పూలు
రాలిపోయిన పూదీవె వోలె, ఆమె
సొమ్ము లటు నిటు నెగజిమ్మి జుట్టు విరియ
బోసికొని యేడ్చె దొర్లాడె పుడమి మీద."

కంబని కవిత వీనుల విందు గొలుపుతూ ఉంటుంది. ఒక పద్యం:

"పంజి యొళిర్ వింజుకుళిర్ పల్లవ మనుంగ
చ్చెంజెవియ కంజనిమిర్ సీఱడి పెయర్వాళ్
అంజొవిళ మంగై యెన వన్న మెన మిన్నుం
వంజి యెన నంజ మెన వంజ మగళ్ వన్దాళ్."

ఇందులో శూర్పణఖరాక వర్ణించ బడింది. ఆమెకు కంబడు మనోహరాకృతినే కాక కామవల్లి అనే మనోహరమైన పేరు కూడా ప్రసాదించాడు.

ఇరవైనాలుగువేల శ్లోకముల రామకథను కంబకవి 10,569 వృత్తములలో (42,276 పాదములు) సంతరించాడు. దేశభాషలలో వెలసిన తొలి రామాయణం ఇదే. అంతేకాక రసవత్కావ్యంకూడా. శఠగోపర్ అన్తాది, సరస్వతి అన్తాది మొదలైన లఘురచనలుకూడా ఆయన చేసినట్లు తెలియవస్తున్నది. అన్తాది ముక్తపద గ్రస్తరచన. శతకంలోవలె, ఇందులో నూరు పద్యములు ఉంటాయి.

దక్షిణాపథంలోనే కాక తెలుగునాడులో కూడా చోళరాజులు ప్రాభవశూన్యులు కావడంతో, ఓరుగల్లును పరిపాలించే కాకతీయనృపులు బలవంతులైనారు. కాకతీయులలో మిక్కిలి ప్రసిద్ధుడైన మొదటి ప్రతాపరుద్రుడు (1162-1197) రాజ్యం చేసేరోజులలో మూడవ కులోత్తుంగ చోళుడు చోళదేశం పరిపాలిస్తూ వుండేవాడు. అతడు వీరుడనీ, త్యాగవినోదుడనీ కంబడు పేర్కొన్నాడు. అతని

కాలంలోనూ, అతని కుమారుడైన మూడవ రాజరాజుకాలంలోనూ కంబకవి జీవించాడు. కాని కారణమేమిటో స్పష్టంగా తెలియదు, కంబకవికీ చోళరాజుకీ మధ్యవైమనస్యం ఏర్పడింది. కాగా, కంబడు మొదటి ప్రతాపరుద్రుని ఆస్థానమునకు వెళ్లెననీ, ఆయన కంబకవిపాండితీ వైభవానికి ముగ్ధుడయ్యెననీ తెలియవస్తున్నది. ఆసందర్భంగా కంబడు కాకతీయనృపుని సంబోధిస్తూ ఒకపద్యం కూడా చెప్పాడు ఆశువుగా. కంబరామాయణంలో తమ్మి, అక్కటా, తోలు మొదలైన కొన్ని తెలుగుమాటలు చోటు చేసుకోవడం కూడా గనునించదగిన అంశమే.

ఈ యుగంలో వర్ధిల్లిన కవులలో కంబకవికి పిమ్మట చెప్పదగినవాడు వాణిదాసుడు (ఒట్టకూ్కత్తర్). ఉలా, కోవై మొదలైన రచనలు చేయడంలో ఆయన ఘటికుడు నాయకుడు తన రాజధానీ నగరంలో ఊరేగింపుగా వెళ్లే వైభమును హృదయంగమంగా చిత్రించే రచనా ప్రక్రియను ఉలా అంటారు. విక్రమ చోళుడు, రెండవ కులోత్తుంగుడు, రెండవ రాజరాజు – వీరిపై ఆయన ఉలాలు సంతరించాడు. ఇవి కాక దక్కయాగప్పరణి పిళ్లై త్తమిళ్ మొదలైనవాటిని కూడా వ్రాశాడు. కంబరామాయణమునకు శేషగ్రంథ మనదగిన ఉత్తరకాండను కూడా ఆయన వెలయించాడు.

ఈ యుగంలో విలసిల్లిన కవులలో పుగళేంది అనే మహాకవి కూడా సంభావ్యుడు. కంబన్, ఒట్టకూ్కత్తర్, పుగళేంది – వీరికి మహాకవిత్రయం అనే వ్యవహారనామం ఏర్పడింది.

పుగళేంది పాండ్యుల ఆస్థానమునకు చెందినవాడు. మహాభారతంలోని నలోపాఖ్యానమును ఆధారం చేసుకొని ఆయన నళవెణ్బా అనే ప్రశస్తకావ్యం రచించాడు. అక్షరరమ్యతకూ, వెణ్బావృత్త రచనకూ ఇది ప్రసిద్ధి చెందింది. మరి కొన్ని రచనలు కూడా చేసినట్లు చెపుతారు. కాని నళవెణ్బాయే ఆయనకి చిరయశస్సు సమకూర్చింది.

ఈ సందర్భంలో చోళుల ఆస్థానకవీ, ప్రథితయశస్కుడూ అయిన జయంగొండార్ రచించిన కలింగత్తుప్పరణి కావ్యంగురించి కూడా రెండు మాటలు

చెప్పడం అవసరం. ఇది యుద్ధకావ్యములలో మొట్టమొదటిదీ, ముఖ్యమైనదీను. దీనిని అనుసరించి తరువాతి కాలంలో మరికొన్ని యుద్ధకావ్యములు వెలుగులోకి వచ్చినవి.

క్రీ.శ. 1070 నుంచి 1120 దాకా రాజ్యంచేసిన మొదటి కులోత్తుంగ చోళుడు కావించిన కళింగయుద్ధమును అభివర్ణించే చారిత్రకకావ్యం కలింగత్తుప్పరణి. ఏనుగులు వేయింటిని జయించిన మానవుని వర్ణించునదే పరణి – అని లాక్షణికులు పరణికి నిర్వచనం చేశారు. తమిళ లక్షణ శాస్త్రంలో ఉదాహృతములైన తొంభై ఆరు విధముల ప్రబంధములలో పరణి ఒకటి. కవిచక్రవర్తి బిరుదాంకితుడైన జయంగొండార్ రచించిన యీ కావ్యంనుంచి చోళరాజుల వీరోచిత కృత్యములు, చాళుక్యనృపుడైన మొదటి కులోత్తుంగుడు చోళనృపుడైన ఉదంతం, అతని కళింగయుద్ధం ఆ వివరాలు – మొదలైన వాటిని మనం గ్రహించవచ్చు. ఈ రస వత్కావ్యం నుంచి రెండు పద్యాలు.

> 'ఛాయ యను తనభార్య మాయమై దాగుకొన
> వేయి కరములతోడ వెదకెనో సూర్యుడన
> కాయు చుండెడి యెండకాక కోర్వని ధరణి
> వేయి చోట్లను పగిలి వెడద బీటలు వారె.'
>
> 'జిలిబిలి పలుకులే చిత్రముగ తడబడగ
> వెలుగొందు కనుదోయి వింతగా నెరుపెక్క
> చెలి నధరపానమే యిల మధు పానమై
> తెలివి తప్పెడు చెలులు తలుపు తెరవండి.'

రామాయణం, నళవెణ్బా, కలింగత్తుప్పరణి వంటి రసవద్రచనలు వెలుగులోకి రావడం వల్లనూ, కంబర్, ఒట్టకూత్తర్ వంటి మహాకవులు జీవించడం వల్లనూ, ఈ యుగమును తమిళసాహిత్య చరిత్రలో స్వర్ణయుగమని వ్యవహరించడంలో ఆశ్చర్యం లేదు. ఈ యుగంలో వెలసిన కావ్యములవల్ల తమిళసాహిత్యం సుసంపన్న మయింది. స్వతంత్ర రచనలతోపాటు అనుసరణ కావ్యములుకూడా

ప్రచారంలోకి వచ్చినవి. సాహిత్యంలోనూ, సాంఘికాచారములలోనూ ఆర్య ద్రావిడ సమ్మేళనం కనిపిస్తుంది. ఈ సమ్మేళనం సామరస్య పూర్వకంగా జరగడం గమనించదగిన విషయం. కనుకనే ఈకాలపు కావ్యములలో వృత్తరచన, సంస్కృత ప్రయోగ బాహుళ్యం మొదలైనవి స్థూలదృష్టికి కూడా కనిపించడం వింతకాదు.

---

1.1 కలింగత్తుప్పరణిలోని కొంత భాగమును ఆరుద్ర తెలుగుచేసి, తమ తెలుగు సేతను వెన్నెల - వేసవి అనేపేరున ప్రకటించారు (1968). ఈ తెలుగు సేతలోనివే పై పద్యములు.

---

# 6. పురాణేతిహాస యుగము

చోళపాండ్య మహీపతులు బలహీనులు కావడంతో తమిళ వాఙ్మయం రాజాశ్రయం కోల్పోయినట్లు కొందరి తలంపు ఇది నిజమే. అయినప్పటికీ, తరువాతి కాలంలో విజయనగర సమ్రాట్టులూ, వారి సామంతులూ మొదలైనవారు తమిళ సాహిత్యమును పోషించారు. విజయ నగరాధీశ్వరులు కూడా ప్రాభవ శూన్యులైన తర్వాత, తమిళసాహిత్యమును మఠాధిపతులు పోషించారు. కనుక ఈ యుగమును మఠాధిపతుల యుగమని కూడా వ్యవహరించవచ్చు.

ఈ యుగంలో పురాణములు, వ్యాఖ్యానములు, సిద్ధుల రచనలు, ప్రబంధములు, వేదాంత గ్రంథములు మొదలైనవి ఎన్నో వెలుగులోకి వచ్చినవి. ఇవి అంత ప్రశస్తములైనవి కాకపోవడంవల్లనూ, ఉత్తమ కావ్యములు వెలువడక పోవడంవల్లనూ ఈ యుగమును క్షీణయుగమని పేర్కొనవచ్చు కూడా ఇందుకు కారణాలు లేకపోలేదు. శక్తిసామర్థ్యాలుగల రాజులు లేకపోవడం, మతములకు పలుకుబడి కలగడం మొదలైనవి పేర్కొనదగినవి. అంతమాత్రమున ఈయుగంలో మహాకవులు లేరనికాని, కావ్య నిర్మాణం జరగలేదనికాని అనుకోకూడదు. విల్లిపుత్తూరార్, అరుణగిరినాథుడు, హరిదాసు, కాలమేఘ పండితుడు మొదలైన పండితకవులు ఈ పురాణేతిహాస యుగంలో వర్ధిల్లిన వారిలో సంభావ్యులు.

## విల్లిపుత్తూరార్ :

16వ శతాబ్దిలో జీవించిన యీ పండితకవి సంస్కృత ద్రావిడ భాషలలో విద్వాంసుడు. కాగా, ఆయన రచన సంస్కృత పదభూయిష్ఠమని వేరుగా చెప్పనవసరంలేదు. అయినా, ఆయన భారతరచనకు బహుళవ్యాప్తి లభించింది. అంతేకాదు, విల్లిభారతమనే ప్రసిద్ధ నామాంతరం కూడా ఏర్పడింది.[1]

విల్లిభారతంలో పది పర్వములు మాత్రమే ఉన్నవి. నాలుగువేల మూడు వందల వృత్తములలో సాగిన కావ్యం అది. తరువాతి కాలమున (18వ శతాబ్ది) జీవించిన నల్లాపిళ్ళై, మురుగప్ప ఉపాధ్యాయుడు అనే యిద్దరు కవులు అదనంగా పదివేల నాలుగు వందల పద్యములు రచించి, వాటిని విల్లిభారతంలో చేర్చారు. వారిలో నల్లాపిళ్లైయే చాలాపద్యములు రచించిన కారణంవల్ల, ఆ భాగమునకు నల్లాప్పిళ్లైభారతమనే వ్యవహారనామం కలిగింది. నేటికీ గ్రామాలలో ఈ నల్లాప్పిళ్లై భారతమునకు బహుళప్రచారం ఉన్నది. 13వ శతాబ్దిలో భారత పఠనమునకూ, భారత ప్రవచనమునకూ తమిళనాడులో విశేషవ్యాప్తి లభించినట్లు పండితుల విశ్వాసం [2]

విల్లిభారతమునకు పూర్వమే - అంటే సంగయుగంలోనే-తమిళంలో గేయ రూపంలో ఒకభారతం వెలసినట్లు, దానికి కర్త పెరుందేవనార్ అనే పండితుడనీ, ఆ కారణాన ఆయనకు భారతం రచించిన పెరుందేవనార్ అనే ప్రసిద్ధనామం ఏర్పడినట్లూ చెబుతారు [3] 10వ శతాబ్దిలో రాజ్యం చేసిన రాజసింహుడనే పాండ్య భూపతి కాలంలో వేయబడిన చిన్నమనూరు శాసనంలో ఇలా ఉన్నది.

'మా బారుతం తమిళ్ప్పడుత్తుం
మదురాపురిచ్చంగం వైత్తుం...'

మహాభారతమును తమిళ మొనర్చు మధురాపురి సంగము నెలకొల్పియు- అని పైమాటలకు అర్థం కనుక ప్రాచీన పాండ్యభూపతులు సంస్కృత మహాభారతమును తమిళం చేయించటానికి ఒక పరిషత్తు నెలకొల్పినట్లు స్పష్టమవుతున్నది. కాని యీ తమిళ భారతం పెరుందేవనారుదో మరి యెవరిదో తెలియరాలేదు. తరువాతి కాలంలో కూడా భారతవెణ్బా (పద్యకావ్యం), అరుణివై విశాఖర్ సంతరించిన భారతం మొదలైనవి వ్యాప్తిలోకి వచ్చినవి.

## అరుణగిరి నాథుడు

భక్తి పారవశ్యంతో మురుగ (కుమారస్వామి) భక్తులు పాడుకునే తిరుప్పుగళ్ అనే భక్తిగీతికా సంపుటిని సంతరించిన అరుణగిరినాథుడు కూడా సంస్కృత ద్రావిడభాషా పండితుడు. తిరుప్పుగళ్లు మూడువేల గీతముల గ్రంథం. ఒక్కొక్క

గీతమూ అమృతతుల్యం. అరుణగిరినాథుడు ప్రౌఢదేవరాయలకాలంలో - అంటే 15వ శతాబ్దిలో - జీవించినట్లు తెలియవస్తున్నది. శ్రీనాథుడు పేర్కొన్న డిండిమ భట్టు అరుణగిరినాథుడు కావచ్చునేమో! ఈ విషయంలో పర్యాప్తమైన పరిశీలన జరిగితే, మరికొన్ని సాహిత్య విషయాలు మనకు తెలియవస్తాయి. అరుణగిరినాథుడు తిరుప్పుగళునే కాక కందర్ అలంకారం కందర్ అనుభూతి మొదలైన వాటిని కూడా రచించెను. ఆయన మతంలో మురుగడే ప్రధానదైవం

## కాలమేఘ పండితుడు;

15వ శతాబ్దిలో వర్ధిల్లిన పండితకవులలో విశిష్టుడు. విశేషించి ఆశుకవి. శ్లేషకవిత చెప్పడంలోనూ, హాస్యరస ప్రధానమైన రచనలోనూ ఘటికుడు. తిరువానైక్కా ఉలా అనే కావ్యమునే కాక శ్లేషమయపద్యాలు ఎన్నో ఆయన సంతరించాడు

## హరిదాసు:

విజయనగరాధీశ్వరుడైన శ్రీకృష్ణదేవరాయలవారి ఆస్థానంలోని తమిళ కవులలో హరిదాసు ప్రముఖుడు. ఆయన ఇరుసమయవిళక్కం అనే గ్రంథం వ్రాశాడు. శైవ వైష్ణవములను గురించి తులనాత్మక దృష్టితో వ్రాయబడిన గ్రంథ మిది.

ఇంతవరకూ పేర్కొనబడిన గ్రంథములే కాక సేతుపురాణం, తిరువళైయాడల్ పురాణం, భాగవతపురాణం, కూర్మపురాణం, సీకాళత్తిపురాణం, ప్రభులింగలీల వంటి పెక్కు పురాణ గ్రంథములు వెలుగులోకి వచ్చినవి. పురాణములతో పాటు ప్రబోధ చంద్రోదయం, మెయ్ఞ్ఞాన విళక్కం వంటి వేదాంత రచనలూ, తొండైమండల శతకం, చోళమండల శతకం వంటి చారిత్రక రచనలూ, కుట్రాలక్కురవంజి, రామనాటకం వంటి గేయరూపకములు మొదలైన రచనలు ఎన్నో యీ యుగంలో వెలువడినవి. అరుణాచల కవి సంతరించిన రామనాటకం నేటికీ పండిత పామర రంజకమై బహుళ ప్రచారంలో ఉన్నది.

ఈ సందర్భంలో సిద్ధుల రచనలను గురించి ఒకటి రెండు మాటలు వ్రాయడం సముచితం. సిద్ధులనగా జ్ఞానులని అర్థం కాగా, వారి రచనలు తాత్త్విక రహస్యములకు కాణాచి అనడం సమంజసం. వారిది ప్రధానంగా మర్మ కవిత. ఈ సిద్ధులలో తొలుత తిరుమూలర్ (6వ శతాబ్దికి చెందినవాడు) సంభావ్యుడు. ఆయన గీతాలు విశేష వ్యాప్తిలో ఉన్నవి. ఒక గీతం :

"పారుని లోగిలిలో
పాడియావు లైదు కలవు.
మేపువాడు లేని కతమున
ఏపుమీరి తిరుగుచుండె నవి.
మేపువాడే ఉన్నచో
ఏపు బాగా తగ్గుచో
పారుని పాడియావులు
పాల వాగు లగును గాదె."

(పాడియావు అనగా పంచేంద్రియములు. ఏపు అనగా అహంకారం. మేపువాడు అన్న మాటకు శైవులు పశుపతి అనీ, వైష్ణవులు విష్ణుమూర్తి అనే అర్థం చెబుతారు.)

నేటికీ ఈ సిద్ధుల గీతములు మనకు బిచ్చగాండ్ర ముఖతః వినిపిస్తూ ఉంటాయి.

## కుమర గురుపరస్వామి:

తమిళ సాహిత్యాభివృద్ధికి తోడ్పడిన మఠములలో ధర్మపుర, తిరువావడుదురై మఠములు ముఖ్యంగా పేర్కొనదగినవి.

ధర్మపురమునకు చెందిన విద్వాంసులలో కుమర గురుపరస్వామి (17వ శతాబ్ది) ప్రసిద్ధుడు. యౌవనంలోనే సన్యసించిన కుమరగురుపరర్ ఢిల్లీదాకా వెళ్లి అప్పటి పాదుషాకి శైవమత ప్రాధాన్యం తెలియజేసి, ఆయన అనుమతితో కాశిలో ఒక మఠం స్థాపించినట్లు చెపుతారు. ఆయన పదహారు కృతులు వెలయించాడు.

ఏటేటా ఆయనకి గురుపూజ జరుగుతుంది. ఆ సమయంలో శైవపండితులకు సన్మానములు జరగడం గమనించదగిన అంశం.

తిరువాడుదురై మఠమునకు చెందిన శివజ్ఞాన ముని సంస్కృత ద్రావిడ భాషలలో మహాపండితుడు. ఆయన సంతరించిన కాంచిపురాణం తమిళపురాణ వాఙ్మయమునకు తలమానికం వంటిది. నేటికీ తిరుప్పనందాళ్ మరికొన్ని మఠములు తమిళ భాషాభివృద్ధికి యథోచితంగా సేవ చెయ్యడం హర్షించదగిన విషయం. శాంతలింగస్వామి, చిదంబరస్వామి, తత్వరాయర్, తాయు మానవర్ మొదలైన మహనీయులు తాత్త్విక రచనలు ఎన్నో వెలయించారు.

తాయు మానవస్వామి (1705-1742) సంస్కృత ద్రావిడ భాషా విద్వాంసుడు. ఆయన విజయరంగ చొక్కనాథనాయకుని మంత్రి. ఆ పదవినికూడా పరిత్యజించాడు; దైవ చింతనలో కాలం గడిపాడు. అందువల్ల ఆయన గీతాలు భక్తిరస ప్రధానములుగా ఉండడంలో ఆశ్చర్యమేమీ లేదు ఉపనిషద్వాణిని తేట తెల్లం కావించిన తమిళకవి తాయు మానవస్వామి అన్నా సాహసం కాదు. మచ్చుకి ఒక గీతం:

"కోప మెల్ల అణచుకొన్నను
సిద్ధు లెల్ల పొంది యున్నను
మనసు నణచుకొనని వారికి
మాట లేల పరాపర మే."

"అందరు సంతోషముగా
ఆహరహము మనవలె నని
ఆశించుటయె తప్ప
అన్య మెరుగను పరాపర మే."

ఎవరియందును భేదభావం పాటించక, అందరినీ ప్రేమించిన విశాల హృదయుడు తాయు మానవ స్వామి. సామరస్య పూర్వకమైన ప్రేమ ఆయనలోనూ ఆయన గీతములలోనూ కనిపిసుంది.

## ఉమఱు పండితుడు:

17వ శతాబ్దిలో వెలుగులోకి వచ్చిన ప్రశస్త రచనలలో ఒకటి సీఱాప్పురాణం అనే పద్యకృతి. ఇందులో మూడు కాండములూ, 92 అధ్యాయములూ, దాదాపు 5,000 వృత్తములూ ఉన్నవి. దీని కర్త ఉమఱు పండితుడు; మహమ్మదీయుడు. సీతక్కాది (సయ్యద్ ఖాదర్), అబుల్ కాశిం మరైక్కాయర్ అనే సహృదయుల ప్రోత్సాహపు ఫలితమే యీ కావ్యం. సీతక్కాది ధనికుడు; దాత గూడా. ఆయన దాతృత్వమును కొనియాడుతూ ఒక కవి యిలా అన్నాడు. "సీతక్కాది మళ్లీ యీ భూమిమీద పుడితే, అప్పుడుగాని కవుల మనుగడ బాగుపడదు." అంత గొప్పదాత ఆయన! సీఱాప్పురాణంలో మహమ్మదు నబి దివ్య చారిత్రం అభివర్ణించబడింది. అరేబియాదేశపు ఆచార వ్యవహారములూ, ఇస్లాము మతం వ్యాప్తి చెందిన వైనం మొదలైనవాటిని యీ కావ్యంనుండి గ్రహించపచ్చు.

కుణంగుడి మస్తాన్, షేక్ అబ్దుల్ ఖాదర్ నయినార్ లబ్బై, అబ్దుల్ మజీద్ ప్రభృతులు తమ రచనలద్వారా తమిళసాహిత్యమును సుసంపన్నం చేశారు. వీరిలో మస్తాన్ చాలా ప్రసిద్ధుడు. ఆయన గీతాలచే ప్రభావితులై కొందరు ఆయన మీద లఘుకృతులు వెలయించారు. మస్తాన్ గీతాలలో వాడుక తమిళం చాలాచోట్ల చోటు చేసుకోవడం గమనించదగింది.[4]

విజయనగర సామ్రాజ్య పతనానంతరం దక్షిణాపథంలోగూడా మహమ్మదీయుల ప్రాబల్యం ఎక్కువయింది. కొంతకాలంపాటు విజయనగర సామ్రాట్టుల సామంతు లనదగిన నాయకరాజులు తమిళనాడును పరిపాలించారు. నాయక రాజుల పిమ్మట మహారాష్ట్రులు రాజ్యాధికారం చెయ్యసాగారు. వారుగూడా తమిళభాషా సాహిత్యాలను యథోచితంగా పోషించారు. అయినప్పటికీ, తమిళ సాహిత్యానికి నిజమైన రాజాశ్రయం లభించలేదని చెప్పడం సమంజసం.

ఇలా ఉండగా, వ్యాపారార్థమై పాశ్చాత్యులు మన దేశమునకు వచ్చారు. వారితో పాటు విచ్చేసిన క్రైస్తవ మతప్రచారకులు తన్మతప్రచారానికి దిగారు. మతప్రచారకులలో కొందరు తమిళభాషాధ్యయనం చేశారు; మరికొందరు రచనలు గూడా చేశారు. అటువంటి వారిలో వీరమామునివర్ అనే నామాంతరం కల ఫాదర్

బెస్కీ ముఖ్యంగా పేర్కొనదగినవాడు. తమిళ భాషాసాహిత్యములను అధ్యయనం చెయ్యడమే కాక ఆయన తమిళ సాహిత్యమును సుసంపన్నం చేశాడు కూడా!

తమిళంలో రచనలు వెలయించిన ఐరోపీయులలో ప్రథముడు ఇటలీ దేశస్థుడైన డి నొబిలీ (1577-1656) అనే పాదిరీ. తత్త్వబోధకర్ అన్నది ఆయన నామాంతరం. సంస్కృతంకూడా నేర్చుకున్నాడు. ఆత్మనిర్ణయం, జ్ఞానోపదేశకాండం మొదలైన పెక్కు వచన రచనలు చేశాడు.

వీరమాముసివర్ అనే నామాంతరం కల బెస్కీ (1680-1747) కూడా ఇటలీ దేశస్థుడే. నొబిలీ, బెస్కీ - వీరిద్దరూ తమిళవచన వాఙ్మయ వికాసానికి ఎంతో దోహదం చేశారని నిస్సంశయంగా చెప్పవచ్చు. కాని బెస్కీ యశస్సౌధానికి ఆయన సంతరించిన తేంబావణి అనే కావ్యం మూలస్తంభం. యేసుక్రీస్తు జీవితము నభివర్ణించే యీ కావ్యం 30 అధ్యాయముల గ్రంథం (3,615 పద్యములున్నవి). వేదియర్ ఒళుక్కం, పరమార్థ గురువిన్‌కదై మొదలైన రచనలు కూడా చేశారు. చతురగరాది అనే నిఘంటువు కూడా సంతరించాడు. అంతేకాక తమిళము - లాటిన్ నిఘంటువు, తమిళము - ఫ్రెంచి నిఘంటువు, పోర్చుగీసు-లాటిన్-తమిళ నిఘంటువు మొదలైన వాటిని కూడా వెలయించాడు. నిఘంటు నిర్మాణ విషయంలో ఆయన తరువాతి వారికి మార్గదర్శకుడన్నా అత్యుక్తికాదు. మొత్తంమీద వీరమాముునివర్ బహుముఖ ప్రజ్ఞాశాలి అనీ, ఆయన చేసిన తమిళ వాఙ్మయసేవ చిరస్మరణీయ మైనదనీ పేర్కొనవచ్చు.

వీరుకాక బిషప్ కాల్డ్‌వెల్, జి.యు. పోప్ ప్రభృతులుగూడా తమిళభాషకు సేవ చేసిన పాశ్చాత్య పండితులు.

డ్యూప్లేవద్ద ద్విభాషిగా ఉండిన ఆనందరంగం పిళ్లైఅనే ఆయన తమిళంలో దినచర్య (డైరీ) ఒకటి వెలయించాడు. ఇది ఆనాటి తమిళభాషను గురించీ చారిత్రక విశేషములు గురించీ తెలుసుకోడానికి ఎంతైనా ఉపయోగపడుతుంది. దీని ఆంగ్లానువాదం ప్రకటించబడడం హర్షించదగిన అంశం.

ఉపసంహారంగా, పురాణేతిహాస యుగంలో రసవత్కావ్యములు ఎక్కువగా వెలువడక పోయినప్పటికీ, స్థలమాహాత్మ్య గ్రంథములూ వేదాంత గ్రంథములూ ఎన్నో వెలువడినట్లు చెప్పవచ్చు. అనగా, మతపరమైన సాహిత్యం వెలుగులోకి వచ్చినట్లు భావించవలె. ప్రతిభావంతులూ సాహితీప్రియులూ అయిన పరిపాలకులు లోపించడం, మతాధిపతులూ మత ప్రచారకులూ సాహిత్యపోషకులు కావడం మొదలైనవి యిందుకు ప్రధాన కారణాలు.

ఈ యుగం చివరిభాగంలో క్రైస్తవ మతమునకు తమిళనాడులో నిలువ నీడ లభించినట్లు చెప్పవచ్చు. క్రైస్తవమత ప్రచారమును అరికట్టదలచి కాబోలు, 17వ శతాబ్దివాడయిన శివప్రకాశస్వామి అనే ఆయన యేసుమత నిరాకరణం అనే గ్రంథం వ్రాశాడు. ఏదిఏలా ఉన్నా, మతదృష్టితో కాకుండా సాహిత్యదృష్టితో చూసినట్లయితే క్రైస్తవమత ప్రచారకులు కొందరు తమిళభాషా సాహిత్యాలకు చిరస్మరణీయమైన సేవ చేసినట్లు పేర్కొనవచ్చు.

---

1. విల్లిభారతం సంస్కృతంలో అగస్త్యభట్టు రచించిన భారతమునకు అనువాదమని కి. వా. జగన్నాథన్ అభిప్రాయం. (తమిళ్ కాప్పియంగళ్)

2. ము వరదరాజన్ : తమిళ్ ఇలక్కియ వరలాఱు, పుట 211.

3. కి. వా జగన్నాథన్ : తమిళ్ కాప్పియంగళ్.

   " . . . . ఈ గ్రంథము (భారతం) అందరి ఆదరాభిమానములను చూరగొన్నది. ఇందుకు నిదర్శనం తద్రచయితకు "భారతం రచించిన పెరుందేవనార్" అనే బిరుదం ఏర్పడడమే. దీనిని రచించడమే ఆయనకి కీర్తి హేతువు కాగా, మరి దీని పేరు పెంపు లెట్టివో ఊహించుకొనవలసినదే . . . . "

4. తమిళ సాహిత్యమునకు సేవ చేసిన మహమ్మదీయ కవులను గురించి అబ్దుల్ రహీం అనే రచయిత "ముస్లిం తమిళ్ పులవర్గళ్" అనే పుస్తకం వ్రాశారు

# 7. ఆధునిక యుగము

మనదేశంలో ఆంగ్లప్రభుత్వం స్థిరపడిన తరువాత ఆంగ్లభాషా సాహిత్యాలకు బహుళవ్యాప్తి లభించింది. ఆంగ్లం రాజభాష కావడం వల్ల, చాలామంది ఆభాష నేర్చుకున్నారు, ఆ నాళ్లలో ఆంగ్లభాషాధ్యయనం నాగరకతా చిహ్నంగా గణించబడేదన్నా సాహసం కాదు. ఆంగ్లసాహిత్య సంపర్కంవల్ల భారతీయ సాహిత్యానికి మేలు కలగకపోలేదు. మనదేశంలోని అన్నిభాషలలోనూ ఆధునిక యుగం 19వ శతాబ్దితో ప్రారంభమవుతున్నది. అనగా, ఆంగ్ల సాహిత్య సంపర్కమునకు తర్వాతనే ఆధునికయుగం ప్రారంభమైనదని పేర్కొనవచ్చు.

ఆంగ్ల భాషావ్యాప్తితో పాటు మనదేశంలోని వివిధప్రాంతాలలో నెలకొన్న ముద్రణాలయములు కూడా ఆధునిక భారతీయ సాహిత్యానికి మహోపకారం చేసినవి. తాళపత్రరూపంలో ఉన్న ప్రాచీన కావ్యములు ప్రచురితములై వ్యాప్తిలోకి వచ్చినవి. అంతవరకూ ఏ కొద్దిమంది మాత్రమో చదువుతూ వుండిన కావ్యములు ముద్రితలైనవి అనేకుల అందుబాటులోకి రావడం గమనించదగిన అంశం.

ఇది యిలా ఉండగా, ప్రాచీన భారతీయ సంస్కృతిని పరిరక్షించే వుద్దేశంతో మహనీయులు కొందరు నూతనోద్యమములు ప్రారంభించారు. మరి కొందరు మూఢాచారములను రూపు మాపాలనే సదుద్దేశంతో ఉద్యమములు ప్రారంభించారు. స్వరాజ్య సంపాదనోద్దేశంతో జాతీయోద్యమం ప్రారంభించబడింది. మహనీయులు పలువురు స్వార్థరహితులై స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. ఇలా నైతిక, సాంఘిక, రాజకీయాది వివిధరంగాలలో నూతనోద్యమములు బయలుదేరినవి. ఈ ఉద్యమముల ప్రభావం ఆధునిక భారతీయ సాహిత్యం మీద లేకపోలేదు. తమిళ సాహిత్యం కూడా ఆధునిక భారతీయ సాహిత్యంలోని అంతర్భాగం కనుక, ఈ ఉద్యమముల ప్రభావం ఆధునిక తమిళ సాహిత్యం మీద కూడా ఉన్నదనడం చర్విత చరణమే,

19 వ శతాబ్దిలో కూడా తమిళ లో స్థలపురాణములు ఎన్నో సంతరింపబడినవి. నాటక వేషం దాల్చిన గేయరచనలు, సంస్కృతానువాదములు మొదలైనవి కూడా వెలుగులోకి వచ్చినవి. ఈ శతాబ్దిలో వర్ధిల్లిన ప్రముఖులలో రామలింగస్వామి (1823-1874) అనే భక్తకవి తొలుదొలుత పేర్కొనదగినవాడు. భక్తిరసప్లావితమైన ఆయన కవితనుండి తమిళ నుడికారపు సొంపును గ్రహించవచ్చు. భావగాంభీర్యమునకు ఆయన కవిత పెట్టింది పేరు. రామలింగస్వామి చెప్పిన పద్య సమూహమును తిరువరుట్పా అని వ్యవహరిస్తారు. జాతిమత భేదములు కల్లలనీ, అందరూ ఒక్క జాతికి చెందిన వారనీ ఆయన ప్రబోధించాడు.

"నాకు ముక్తి వలయు ననెడుకోరిక లేదు;
జగతిలోని జీవజాలమునకు
సంతస మ్మొదవగ సంచరింప దలతు -
ఇదియె పో మదీయ యిచ్ఛ, తండ్రి!"

అని ఆయన భగవంతుడికి విన్నవించుకున్నాడు.

బహుగ్రంథకర్త, పండిత శిఖామణి అయిన మహావిద్వాన్ మీనాక్షి సుందరం పిళ్లై (1815-1876) 19 వ శతాబ్దిలో వర్ధిల్లిన పండితులలో ప్రముఖుడు. ఆయన పెక్కు స్థలమాహాత్మ్య గ్రంథములు వెలయించారు. ఆయన శిష్యుడే మహా మహోపాధ్యాయ, దాక్షిణాత్య కళానిధి, డాక్టర్ ఉ. వే. స్వామినాథ అయ్యరు (1856-1942). సంగకాలపు కావ్యాలను లెస్సగా పరిష్కరించి నిర్దుష్టంగా ప్రకటించిన చిరయశస్సు అయ్యరుగారిదే. గ్రంథాంతమున పదసూచిక కూడా ఆయన చేర్చాడు. తమిళభాషా సాహిత్యాలకు ఆయన చేసిన మహోపకారం వర్ణనాతీతం. తన గురుదేవుని జీవిత విశేషాదికమును ఆయన "మీనాక్షిసుందరం పిళ్లై చరిత్తిరం" అనే పేరుతో రచించి, తరువాతి వారికి జీవిత చరిత్ర విషయంలో దోవ చూపారు. అంతేకాక స్వీయచరిత్ర రచనకు కూడా ఆయనదే ఆచార్యపీఠం. ఆయన బహుముఖ ప్రజ్ఞను గుర్తించిన తమిళులు ఆయన నిలువెత్తు విగ్రహమును చెన్నపురిలోని రాజధానీ కళాశాలలో స్థాపించడం ఎంతైనా హర్షించదగిన విషయం.

ఇరక్షణియ యాత్రికం మొదలైన కృతులు రచించిన కృష్ణపిళ్లై (1827-1900), వినోదరసమంజరి అనే వ్యాస సంపుటిని సంతరించిన వీరాస్వామిసెట్టి, పండితుడూ పత్రికా రచయితా అయిన కో. వడివేలు సెట్టియార్ (1863-1936) తమిళసాహిత్యమును ఆంగ్లములో రచించిన ఎం. యస్. పూర్ణలింగంపిళ్లై (1866-1947), బహుభాషాపండితుడూ, బహుగ్రంథకర్తా అయిన మఱైమలై అడిగళ్ (స్వామి వేదాచలం, 1876-1950), తమిళసాహిత్య చరిత్రను వెల యించిన కా. సుబ్రహ్మణ్య పిళ్లై (1885-1945), పరిశోధక పండితుడైన న. ము. వేంకటస్వామినాట్టార్ (1884-1944), మనోన్మణీయ మనే ఉత్తమ నాటకమును సంతరించిన పె. సుందరం పిళ్లై మొదలైనవారు పేర్కొనదగిన. మహాపండితులు.

ఇక 20వ శతాబ్దిలో, తమిళసాహిత్య వీథులు మరింత విస్తృతములైనవి వచన రచనకు విశేషప్రాధాన్యం ఏర్పడింది. ప్రాచీన కావ్యాలకు వ్యాఖ్యానములు వెలిసినవి. సారస్వత సమాజములూ సాహిత్య పత్రికలూ వెలుగులోకి వచ్చినవి.

ఈ శతాబ్ది ప్రారంభంలో కూడా మహాపండితులు ఎందరో ర్ధిల్లినారు. రూపావతి మొదలైన నాటకములు వెలయించిన వి. కో. సూర్యనారాయణశాస్త్రి, తమిళసాహిత్య చారిత్రకర్త, చెందమిళ్ పత్రికా సంపాదకుడూ అయిన మహా విద్వాన్ ఆర్. రాఘవ అయ్యంగారు, ఆశియాజ్యోతి వంటి కావ్యములు సంత రించిన కవి మణిదేశిక వినాయకం పిళ్లై, బహుముఖప్రతిభాశాలీ, "గాంది అడిగళుం-మనిద వాళ్కైయుం" (గాంధీజీ-మానవ జీవితమూ) వంటి ఉద్గ్రంథ రచయితా అయిన తిరు. వి. కల్యాణసుందరం ముదలియారు (1883-1953), బహుగ్రంథకర్త, ప్రముఖ పరిశోధకుడూ అయిన యస్. వైయాపురిపిళ్లై (1891-1956) మున్నగు పండితులు తమిళసాహిత్యమును పరిపుష్టంచేసిన మహనీయులు.

ఈ సందర్భంలో భాషాకవిశేఖర బిరుదాంచితులూ చేరన్ సెంగుట్టువన్, ఆరాయచ్చిత్తొగుది (పరిశోధకవ్యాస సంపుటి) వంటి ఉద్గ్రంథములు ఎన్నో రచించిన ము. రాఘవ అయ్యంగారు, మదరాసు ప్రభుత్వపు తమిళ ఆస్థానకవి

పండితుడూ అయిన నామక్కల్ వె. రామలింగం పిళ్లై ప్రభృతులుకూడా సంభా వించదగిన వారే.

## సుబ్రహ్మణ్య భారతి:

ఇక జాతీయ కవి అని తమిళులు కొనియాడే మహాకవి సుబ్రహ్మణ్య భారతిని (1882-1921) గురించి చెప్పవలసి వున్నది. ఇది భారతి యుగమన్నప్ప టికీ సాహసం కాదు.

భారతిని సంస్మరించగానే కమనీయ కాల్పనిక జగత్తు, దారిద్ర్యం, పార తంత్ర్యం-ఈ మూడు విషయాలూ స్ఫురణకు వస్తాయి. దారిద్ర్య దుఃఖమును కొంతసేపయినా ఆయన విస్మరించ గలిగాడు; కాని పారతంత్ర్య దుఃఖమును మాత్రం విస్మరించలేక పోయాడు. పద్యం చెప్పినా, గద్యం వ్రాసినా, పరా శక్తిని ప్రార్థించినా, పాట పాడినా ఆయన్ని పారతంత్ర్య దుఃఖం రంపపుకోత పెడుతూ వుండేది. దాస్య శృంఖలములచే బంధించబడి, స్వేచ్ఛావాయువులు పీల్చ లేకున్నానుగదా అని ఆయన సదా వాపోయేవాడు. ఈ పద్యం పరికించండి:

" వాన లేకున్న జీవిత వైభవమ్ము
మాసి పోజాలదే, పెక్కు మాట లేల?
మమత గొల్పెడి స్వాతంత్ర్య మమరకున్న
దేని కీ జన్మ! దీనుల మైన మనకు?"

భారతి ప్రతిరచనలోనూ ఈ స్వాతంత్ర్య వాంఛ ప్రధానంగా ప్రవ్యక్త మవుతూ వుంటుంది.

గేయరచన చెయ్యడంలో భారతి అందెవేసిన చెయ్యి. ఆయన గేయములు దేశభక్తి ప్రబోధకములు; లేదా భక్తిరస ప్లావితములు. సాహిత్యమును శక్తివంత మైన ఒక ఆయుధంగా ఉపయోగించిన తమిళకవులలో భారతియే అద్యుడన వచ్చు. గేయములేకాక, వ్యాసాలు, చిన్నకథలు, హాస్యప్రధానములైన రచనలు, తాత్త్వికరచనలు మొదలైన వివిధ సాహిత్య ప్రక్రియలలోనూ ఆయన రచనలు వెలయించాడు. ప్రముఖ పత్రికారచయితకూడా, ఆయన సంపాదకీయములు

పేర్కొనదగినవి. ఆయన కావ్యాలలో "పాంచాలి శపథం" ఉదాహరించదగినది. "జ్ఞానరథం" అనే వచనకావ్యం నుండి ఆయన ఆత్మీయతను గ్రహించవచ్చు. పరాశక్తిని ఉద్దేశించి ఆయన పాడిన గేయములు, కణ్ణన్‌పాటలు మొదలైనవి తమిళసాహిత్యంలో విశిష్టస్థానం గడించినవి.

భారతి విశాలహృదయుడు. ఆయన రచనలు మతసహనమునకూ భాషా సహనమునకూ నిలయములు. వ్యావహారిక తమిళమునకు సాహిత్యంలో పెద్దపీట వేసిన విశాలమనస్కుడు భారతి. ఒకగేయంలో ఆయన తెలుగుభాషను ఇలా కీర్తించాడు.

విరియగాచిన వెన్నెల రాత్రిలో
చేరదేశపు చెలులు వెంట రాగా
సుందరాంధ్ర పదమ్మును పాడుతూ
సింధునదిని పడవ నడుపుచు నాడుదాం?

సంప్రదాయ బద్ధమైన తమిళ సాహిత్యానికి కొత్తదనం ప్రసాదించి తమిళ సాహిత్య వీథుల్ని సువిశాలం చేసిన సి. సుబ్రహ్మణ్యభారతి జీవించింది కేవలం 39 సంవత్సరాలే!

ఆధునిక సాహిత్యంలోని వివిధ సాహిత్య ప్రక్రియలను పరిశీలించేందుకు ముందు మదరాసు విశ్వవిద్యాలయంవారు ప్రచురించిన బృహత్పద కోశమును (Tamil Lexicon) గురించి రెండుమాటలు నుడువవలసి వున్నది. ఈ నిఘంటువు అంతకుముందు వెలువడిన నిఘంటువు లన్నిటి కంటె ప్రశస్తమైన దని నిస్సంశయంగా చెప్పవచ్చు. దీనిని పూర్తి చేయడానికి 23 సంవత్సరాలు (1913-1936) పట్టింది. దీనికి చాలాకాలం సంపాదకులుగా వ్యవహరించిన యస్. వైయాపురి పిళ్లై కృషి బహుధా శ్లాఘనీయం!

ఇక కవిత, నవల, కథానిక, నాటకం మొదలైన సాహిత్యప్రక్రియలు ఆధునిక తమిళ సాహిత్యంలో ఎలా పరిణతి చెందినవో పరిశీలిద్దాము.

## కవిత

ఆధునిక తమిళకవిత అనగానే సుబ్రహ్మణ్య భారతిపేరు వెంటనేస్ఫురణకు వస్తుంది. సంప్రదాయపు బరువుతో కుంగిపోయే కవితకు ఆయన కొత్త మెరుగులు తీర్చిదిద్దాడు. గేయాంశం ఆయన కవితలో ప్రధానంగా కనిపిస్తుంది. కొందరు భారతిని విప్లవకవిగా పేర్కొన్నారు; కొందరు భావకవిగా కొనియాడారు. జాతి మత విభేదాలను నిరసించాడు. మూఢవిశ్వాసాలను తూర్పారపట్టాడు స్త్రీ విద్యనూ, స్త్రీ స్వాతంత్ర్యాన్ని ప్రోత్సహించాడు. భారత జాతీయతను వ్యక్తం చేశాడు. భారతీయ సాహిత్యంలోని ఏకత్వాన్ని గుర్తించాడు. అయినప్పటికీ, భారతి ఎంత నవీనుడో అంత సంప్రదాయ విధేయుడు. ప్రాచీన తమిళ సాహిత్యమన్నా, తమిళకవులన్నా ఆయనకి అపారమైన భక్తి. ఆయన జాతీయతా దృష్టి కల తాత్త్వికుడు.

భారతి భావసంపదను గ్రహించేందుకు ప్రళయతాండవం అనే కింది కవిత తోడ్పడుతుంది.

> బద్దలైన బ్రహ్మాండములో బహుభంగుల ఉరుములు తాళము వేయగ
> రోదసిలో రుధిరతృష్ణ రూపెత్తిన భూతవ్రాతము పాడగ
> పాటలోని భావం నీ అందెలరవళిని లీనము కాగా
> మైమరచి ఆడే కాళి, చాముండి, కంకాళి
> అమ్మా, అమ్మా –
>
> చెదిరిపోయిన పంచభూతాలు ఏకమై, ఆవల
> అవి కూడా శక్తిపథమున లీనముకాగా – అక్కడ
> కన్నులు చెదిరే కాంతితో, మనసుకి అందని వేగంతో
> చేసెదవు తుదలేని తాండవం, క్రక్కెదవు నిప్పులు
> అమ్మా, అమ్మా
>
> నిను కన్గొని ముగ్ధుడనైతి నమ్మా.
> పొడువడిన యెడారి రూపు మరింత మాసిపోగా

నంచలనం, సత్త్వసంపన్నత గతి తప్పగా
విధిపిశాచం 'ఓహోహో' అంటూ సందడి చేయగా
శివ మెక్కినదానవై చేసెదవు ప్రళయతాండవం
అమ్మా, అమ్మా

నిను కన్గొని ముగ్ధుడనైతినమ్మా
శక్తిభూతాలు కేశాకేశి పోరాడగా
చట్టచ్చడ చడచట్టని తాళం వినబడగా, అప్పుడు
ఎటు చూచిన కనిపించును - త్వదీయ
వీక్షణాగ్నికి నుసియైపోయిన వస్తుసముదాయం.
అమ్మా అమ్మా

నిను కన్గొని ముగ్ధుడనైతినమ్మా
లోకత్రయమూ కాలంలా నిర్మాలము కాగా
ప్రతిభాసించు నప్పుడు ఈశ్వరుని మౌనజ్యోతి ఒక్కటే - ఆ
పరమశివుని చూచినంతనె తొలగును నీక్రోధాగ్నియు
అప్పుడతనితో కలసి చేసెదవు ఆనంద తాండవం
అమ్మా అమ్మా
నిను కన్గొని ముగ్ధుడనైతినమ్మా.

మరోకవిత :

మోగించండి గుడి గంటలు
అవతరించింది నవభారతం.
ఆమె కొత్త పేరు - పూర్వమున్నదే - భారతవర్షం.
మోగించండి గుడిగంటలు
చెయ్యండి విందులు జరపండి వేడుకలు.
తల్లి కొత్త విజ్ఞానం సంతరించుకుంటోంది
కళలూ, శాస్త్రాలూ నేర్చుకుంటోంది.
మోగించండి, గుడిగంటలు.

తమిళ నవయుగ ప్రవక్త భారతికి తర్వాత పేర్కొనదగిన కవి భారతి దాసన్. ఆయన అభ్యుదయ భావాలుగల కవి అనడంలో సందేహం లేదు. సంఘంలో పేరుకుపోయిన రకరకాల భేదాలను నిర్భయంగా విమర్శించడమే కాకుండా, ఆర్థిక అసమానత్వం తొలగాలనీ దేశంలోని సంపద నలుగురికీ లభ్యమయ్యేటట్లు చూడాలనీ ఆయన వివరించాడు. "లోకం నీది" అనే కవిత నుంచి కొన్ని పాదాలు:

"నాజాతి అనే భావనతో
మానవ సముద్రాన్ని చూచి సంతోషించు;
జ్ఞానాన్ని విస్తృతం చెయ్యి, అఖండం చెయ్యి,
విశాలదృష్టితో ఆకట్టుకో ప్రజను
మానవసముద్రం నేనని చెప్పు
చీలికలేదు, భేదంలేదు.
లోకం తినగా తిను, ధరించగా ధరించు,
సంపద సర్వజనుల దనుచు
సమష్టి భావనతో వ్యవహరించు.
ఆకాశంలా ప్రజను అవరించి
అమలమైన అనురాగంతో
అల్పబుద్ధులకు సైతం దీన్ని వివరించు."

సలక్షణమైనభాష, శక్తివంతమైనశైలి, ప్రగతి శీలాత్మకమైన భావం భారతిదాసన్ కవితకు అందచందాలు సమకూర్చినవి.

భారతిలా, భారతిదాసన్ కూడా తరువాతి తమిళ కవులకు మార్గదర్శకుడైనాడు సురతా (సుబ్బురత్నదాసన్-భారతిదాసన్ అసలుపేరు సుబ్బురత్నం), ముడియరశన్ మున్నగువారు భారతిదాసన్ అనుయాయుల్లో ముఖ్యంగా పేర్కొనదగినవారు. వీరి కవితలలోనూ అభ్యుదయభావాలు కనిపిస్తాయి. తమిళప్రశస్తి వీరి రచనలలో ఎక్కువగా కనిపిస్తుంది. ప్రకృతి రామణీయకాన్ని అభివర్ణించే కవితలు కూడా వీరు వెలయించారు.

సంప్రదాయానుసారంగా రచన సాగిస్తున్న ఆధునిక తమిళ కవులలో శుద్ధానంద భారతియార్, మ. ప. పెరియసామి తూరన్, అ. శ్రీనివాసరాఘవన్ (నాణల్), యస్. డి. యస్. యోగి, కి. వా. జగన్నాథన్, మీ. ప. సోమసుందరం, యస్. డి. సుందరం, త్రిలోక సీతారాం, కా. ము. షెరీఫ్: తురైవన్, ఎ. వి. ఆర్. కృష్ణస్వామి రెడ్డియార్, పుత్తనేరి రా. సుబ్రమణియన్ ప్రభృతులు పేర్కొనదగినవారు. వీరిలో సంప్రదాయ ప్రాబల్యం కనిపించినా, వీరి రచనలలో నవ్యత కనిపించకపోదు. ఇతర విషయాలతో పాటు భక్తి, తాత్త్వికచింతన మొదలైన వాటిని ఇతివృత్తాలుగా స్వీకరిస్తున్నారు.

సాంప్రదాయక కవితనుగురించి చర్చించుటకు మునుపు కవిమణి దేశిక వినాయకపిళ్లైని గురించి తొలుత ప్రస్తావించాలి. ఆయన కవిత సంప్రదాయ బద్ధంగా కొనసాగినా, అందులో నవ్యభావాలు గోచరిస్తాయి. శబ్దాడంబరం ఎరుగని చక్కని కవిత కవిమణిది. భగవదర్చన అనే యీ కవితను పరిశీలించండి.

"కోవెల నంతా చక్కగ చూశాను
గోపురమూ ఎక్కి పరికించాను
ఆ దేవ దేవుని మాత్రం
ఎంత వెదికినా చూడ నైతిని.

శిల్పము లెన్నో చూశాను
చిత్రము లెన్నో చూశాను
ఆ అద్భుతమూర్తిని మాత్రం
అక్క డెక్కడా చూడ నైతిని.

ధూపం వేయుట చూశాను
దీపం చూపుట చూశాను
ఆ ఆపద్బాంధవుని మాత్రం
అక్కడ నేను చూడ నైతిని.

కంటితో సొగసులు పరికిస్తూ
మనస్సు నేమో అడవికి మళ్లిస్తూ
ఒనరించే పూజల వల్ల లాభం
అణు మాత్ర మైనా కనిపించదు.

గుండెలో అతడు నెలకొన్నాడు
గుర్తించాలి దీసిని మనం
గుండెలోనే చూడ గలిగితే
గుడి కూడా కనిపిస్తుందట.

ఎడ్విన్ ఆర్నాల్డ్ రచించిన లైట్ ఆఫ్ ఏషియా అనే కావ్యమును అనుస రించి దేశిక వినాయకంపిళ్లై 'ఆసియ జోతి' అనే చక్కని కావ్యం వెలయించారు. ఆలాగే, ఫిట్జిరాల్డ్ ఇంగ్లీషు అనువాదమును ఆధారం చేసికొని ఉమర్ ఖయ్యాం గీతాలను తమిళం చేశారు. ఈ రెండూ తమిళుల ఆదరాభిమానములు చూర గొన్నవి. మచ్చుకి ఒకటి రెండు గీతములు :

"ఎండకు తగిన నీడ కలదు
కమ్మని తెమ్మెర కూడ కలదు
చేతను కంబని కవిత కలదు
పాత్రము నిండుగ మధువు కలదు.

భక్తి గీతము లెన్నో ఉన్నవి
తెలిసి పాడుటకు నీ వున్నావు
ఇహలోకపు ఈ సౌఖ్యమును మించి
స్వర్గమన్నది వేరొకటి కలదా !"

దేశిక వినాయకం పిళ్లై వహించిన స్వాతంత్ర్యమును తెలుసుకోవడానికి ఈ గీతములు ఉపకరిస్తాయి.

దేశభక్తుడుగా, గాంధేయ కవిగా వినుతి కెక్కిన నామక్కల్ వె. రామ లింగం పిళ్లై (1888-1975) కూడా ఈ సందర్భంలో స్మరణీయుడు. ఆయన

వ్రాసిన కావ్యాలలో అవనుం అవళుం (అతడూ ఆమె) అనేది విశిష్ట మయింది. అవిభక్త మదరాసు రాష్ట్రంలో (1949) ఆయన ఆస్థాన తమిళ కవిగా నియుక్తు డైనాడు. భారత ప్రభుత్వం ఆయన్ని పద్మభూషణ బిరుదుతో సత్కరించింది.

రామలింగం పిళ్లైకి చిరకీర్తి ప్రసాదించిన రచన "గాంధి అంజలి" అనే గేయ సంపుటి. 1931లో తంజావూరు జిల్లాలోని వేదారణ్యంలో జరిగిన ఉప్పు సత్యాగ్రహానికి రాజాజీ నాయకత్వం వహించగా, అప్పుడు నామక్కల్ కవి యీ కింది గేయం రచించారు. స్వాతంత్ర్య సమర కాలంలోనే కాదు, ఆ తర్వాత కూడా తమిళుల్ని ఉత్తేజ పరిచిన గొప్ప గేయమిది.

"కత్తులులేని నెత్తురులేని
యుద్ధ మొకటి వస్తున్నది
సత్య మెపుడు నిలుచు నంచు
తలచు వారు చేరండి.

చూడనులేదు విన్నదిలేదు
ఖండన మీ మాదిరి;
మును పెన్నడో చేసిన పున్నెము
పండెను ఈ నాడు.

గాంధి అనెడు శాంతమూర్తి
చూపిన మంచిమార్గమిది
మానవాళికి బాధ తగ్గగ
వెలసిన దైవ మార్గ మిది."

రామలింగంపిళ్లై కవియే కాక ప్రముఖ చిత్రకారుడు కూడా.

ఇంకా కవియోగి శుద్ధానందభారతి, అచలాంబికై అమ్మైయార్, కుళన్దై కవి ప్రభృతులు కూడా పేర్కొనదగిన వారే. శుద్ధానంద భారతిగారి భారత శక్తి కావ్యం, అచలాంబికై అమ్మగారి గాంధిపురాణం (3,000 పైబడిన పద్యా లున్నవి) మొదలైన కావ్యాలు పేర్కొన దగినవి. ఈ మధ్య మహాత్మా గాంధి

కావ్యం అనే బృహత్కావ్యం ఒకటి వెలువడినది. దీని రచయిత టి. కె. రామానుజ కవిరాజర్. అలాగే, టి. వెంకటకృష్ణ అయ్యంగార్ రఘువంశ కావ్యం అనే బృహత్కావ్యమును వెలయించారు. ఆధునిక తమిళ సాహిత్యంలో బృహత్కావ్యముల సంఖ్య స్వల్పమనవచ్చు.

కొత్తమంగలం సుబ్బు ప్రతిభ కల గేయ రచయిత. శ్రావ్యంగా పాడగల శక్తి కూడా ఆయనకి ఉన్నది. విషయం ఏదైనా సరే, దాన్ని చక్కని గేయంగా మలచి పాడగలనేర్పు ఆయనకి వెన్నతో పెట్టినవిద్య అనవచ్చు. ఆయన గేయములన్నీ జానపద గేయముల ఫక్కీలో ఉంటాయి. గేయ రూపంలో గాంధి మగాన్ కదై (గాంధీ మహాత్ముని కథ) అనే బృహద్రచన చేశారు. అది ఎంతో ప్రచారం గడించుకున్నది. త్రిలోక సీతారాం, సురభి ప్రభృతులు జానపదగేయముల బాణీలో గేయ రచనలు చేశారు.

నేడు చలన చిత్రకవిగా పేరు పెంపులు గడించిన కణ్ణదాసన్ కూడా పేర్కొన దగిన కవి. ఆయన నూర్లకొలది పాటలు వ్రాశారు. ప్రాచీన తమిళ సాహిత్యంలోని భావములు ఆయన పాటలలో కొత్తజీవం పోసుకున్నవని చెప్పవచ్చు. వాణిదాసన్, కంబదాసన్, వేళవేన్దన్, తంగవేలన్ ప్రభృతులు ప్రసిద్ధికెక్కిన ఆధునిక కవులలో కొందరు. జమదగ్ని అనే ఆయన కాళిదాసు మేఘసందేశము మొదలైన వాటిని తమిళ కావ్యాలుగా అనువదించారు. ఇక త్రిలోక సీతారాం "తెలియని వింత" అనే కవితను పరికిద్దాం:

వేకువ జామున కొమ్మ మీది కాకి
కావు కావు మనుట విన్నాను
బద్ధకం మాని తోటలోని పక్షి
ఆకాశంలో ఎగురుట చూశాను.

దిక్కు లన్నీ తిరిగి తిరిగి
చిక్కిన ఆహారమును
ముక్కుతో కాలివేళ్లతో
రెక్కలతో తీసుకవచ్చి,

పట్టువంటిమేను గల తన పాపలకు
తీసుకు వచ్చిన ఆహారం ప్రేమతో పెట్టి
కాలి వేళ్లతో ముక్కుతో ఒళ్లు నిమిరి
తల్లి పక్షి పొందే ఆ సంతోషం
కనుగొని తన్మయత్వం చెందాను
కల్పనా శక్తిని నేను పొందాను.
ఉపాయము లున్నవి మెదడులో
ఉద్రేక మున్నది ఎడదలో
కోటి విద్యలూ నేర్చినా
కోటి జన్మలూ ఎత్తినా
ఈ లోకంలో ఎలా జీవించుట?
ఇంకా తెలియని వింతే యిది.

తమిళంలో అభ్యుదయ కవులుగా ప్రసిద్ధి కెక్కిన టి. యం. సి. రఘునాథన్, కె.సి.యస్. అరుణాచలం, చిన్నప్పభారతి, పట్టుకోట్టై కల్యాణసుందరం మొదలైనవారు వెలయించిన కవితా సంపుటాలు పరిశీలించ దగినవి. వీరిలో కూడా సంప్రదాయ ప్రాబల్యం లేక పోలేదు. రఘునాథన్ శైలిలో సంవాదాత్మక శైలి కనిపిస్తుంది.

భారతి ప్రారంభించిన వచనకవిత యింకా ప్రచుర ప్రచారానికి రాలేదనీ, తమిళంలో నేడు వెలువడుతున్న వచనకవితలకు పండితుల ఆదరాభిమానములు అంతగా లభించడం లేదనీ చెప్పవచ్చు. వచన కవిత యింకా ప్రయోగ దశలో ఉన్న దనడం సాహసం కాదనుకుంటాను. వచన కవితలు వెలయించిన వారిలో న. పిచ్చమూర్తి, సి. సు. చెల్లప్ప వైదీశ్వరన్, జ్ఞానకూత్తన్ ప్రభృతులు పేర్కొనదగినవారు. కణైయాళి, కచటతపఱ, దీపం మొదలైన పత్రికలు వచన కవితను ప్రోత్సహిస్తున్నవి. "దెసిణి" అనే కవి "కవితై" అనే పత్రికను నడుపుతున్నారు. ఇది చిన్న పత్రికయే అయినప్పటికీ, ఇది కవితాఖండికలకు మాత్రమే ఉద్దేశించబడింది.

ఈ మధ్య యువకులు కొందరు దేశంలో నానాటికీ తీవ్రరూపం దాలుస్తున్న నిరుద్యోగ సమస్య, ఆర్థిక అసమానత్వం మొదలైన వాటిని ఇతివృత్తములుగా

స్వీకరించి వచన కవితలు వెలయిస్తున్నారు. సంప్రదాయ విరుద్ధము లైన భావ ములు ప్రవేశ పెడుతున్నారు. ఇటీవల మదరాసులో కొంతకాలంగా సముద్ర తీరాన కవిసమ్మేళనం జరుగుతున్నది. ప్రతి నెలా మొదటి ఆదివారం సాయం సమయాన ఈ కవులు సమావేశమై తమ కవితలు వినిపిస్తారు. పొన్నడియాన్ అనే ఆయన సంపాదకత్వమున ముల్లైచ్చరం అనే పత్రికను ఈ సంఘంవారు నిర్వహిస్తున్నారు. అలైగళ్ ఆయిరం (అలలు వేయి) అనే పేరున రెండు కవితా సంపుటములు కూడా ప్రచురించారు. మొత్తంమీద ఆధునిక తమిళ కవులలో పలువురు సంప్రదాయ విధేయులనీ, సంప్రదాయచ్ఛందస్సులలో కవితలు వెల యిస్తున్నారనీ చెప్పవచ్చు.

ఇక ఇటీవల వెలువడిన కొన్ని మినీ కవితలు పరిశీలిద్దాం.

## సత్యం

పాత్రలేనా
నింపగలవు నీటిని ?
ఆకలితో
నకనకలాడే
మా పొట్టలు సైతం నింపగలవు.

- పేనా. మనోహరన్.

## ఆకులు రాలే కాలం

కళ్లు మూసుకోండి
ఆమె
బట్టలు మార్చుకుంటోంది.

- దేవ దేవన్.

## మరికొన్ని శవాలు

"డబ్బంటే శవం కూడా నోరు తెరుస్తుంది."
నాకు తెలీదు.

దబ్బుంటే
నువ్వుల నూనె
కొబ్బరి నూనె
వంకాయలూ
కళ్యాణ మండపమూ
ఇంకా ఏవేవో
నోళ్లు వెళ్లబెట్టుకోవడం
నాకు తెలుసు.
మనమూ నోళ్లు వెళ్ల బెట్టుకోవలసిందే.

– న. పిచ్చమూర్తి

## మొదటి రాత్రి

పొలంలోని చెరకుగడ
వయస్సు రాగానే
బండి ఎక్కి
ఊ ఊ
గి గి
మిల్లు చేరి
రసం స్ర
విం
చి
పిప్పిగా మా
రిం
ది.

– పా. రత్నసభాపతి అయ్యర్.

## మట్టి మంత్రి

రామునిపాదం తగలగా
రాళ్లన్నీ విరులైనవట

ఇందులో ఏముంది వింత ?
మా మంత్రిగారి పాదం పంకమునుపే
మట్టికి ఏదేదో జరిగింది !

— జ్ఞానక్కూత్తర్.

## ప్రకృతి

నోటీసులు అంటించ రాదని
వ్రాసిన ప్రహరీ గోడమీద
వేప కొమ్మ నీడ
నోటీసులా కనిపిస్తోంది.

— న. జయరామన్.

## బీదవాడినై ఉండాలి

నే నెందుకు కావాలి ధనవంతుణ్ణి
నే నెందుకు కొట్టాలి పేదవాని కడుపు
నే నెందుకు కూడబెట్టాలి ధనం వ్యర్థంగా
నే నెందుకు చావాలి విషపు సూదులతో ?

రాబడి పన్ను దాచేందుకు ధర్మాలు చేసి
వదాన్యు డనే పే రెందుకు పొందాలి !
ముమ్మూర్తులా మూర్ఖులైన వారిని
మహా మేధావు లని నే నెందుకు పొగడాలి ?

చెమట లోడ్చి మనుగడ సాగించాలంటే
ఎప్పుడూ బీదవాడినై ఉండాలి.

— తంజై విల్లోన్
(కొన్ని పాదాలు మాత్రం)

## నాటకము

తమిళ లాక్షణికులు తమభాషను ఇయల్, ఇశై, నాటకం అని మూడు భాగాలుగా విభజించారు. ఇయత్రమిశ్, ఇశైత్తమిశ్, నాటకత్తమిశ్ అని ఆ విభాగ

ములు వ్యవహృతము లవుతున్నవి. గద్యపద్య రచనలలో వ్యవహృత మయ్యే భాషకు ఇయ్రటమిళ్ అనిపేరు. రాగతాళ లయాన్వితమూ, గానానుకూలమూ అయిన భాషను ఇశైత్తమిళ్ అని వ్యవహరించారు. ఇది పాటలలోనూ పదముల లోనూ ప్రయుక్తం. తేవారం, రామాయణ కీర్తనలు మొదలైనవాటిలో వాడబడిన భాష ఇశైత్తమిళ్. ఇయల్, ఇశైత్తమిళముల కలయికవల్ల ఏర్పడిన భాషకు నాటకత్తమిళ్ అనే వ్యవహారనామం ఏర్పడింది. దీన్ని దృశ్యకావ్యములలో ఉపయోగిస్తారు.

సంగయుగంలోనే నాటక తమిళంలో పెక్కు రచనలు వెలువడినవనీ, అవి అన్నీ కాలగర్భంలో కలిసిపోయినవనీ తమిళ పండితుల అభిప్రాయం. భరతం, అగత్తియం, ముఱువల్, జయంతం అనే గ్రంథములు తమిళ నాటక లక్షణములు తెలియజేయుచున్న రచనలు; ఇవి నేడు అలభ్యములు. కనుక తమిళ పండితుల అభిప్రాయం ప్రకారం అతిప్రాచీన కాలంలోనే తమిళంలో నాటక వాఙ్మయం వెలసినట్లు చెప్పవచ్చు.

తమిళనాటక వాఙ్మయం పరిణామమును పరిశీలించడానికి పూర్వం నాటక శబ్దమును గురించి ప్రస్తావించడం సమంజసం నాటకం సంస్కృతశబ్దం. ఆర్యుల ప్రాబల్యం దక్షిణాపథంలో బలపడేకొద్ది, తమిళులకు సంస్కృత భాషాసాహిత్యా లతో పరిచయం కలగజొచ్చింది. కనుక ఆర్యసంపర్కమునకు తర్వాతనే తమి ళంలో నాటకం వెలిసినట్లు ఒకవాదం ఉన్నది, కాని యిందుకు భిన్నమైన వాదం కూడా ఒకటి ఉన్నది. తమిళంలో కూత్తు అనే ఒక శబ్దం ఉన్నది. ఇది నాటకమనే అర్థంలో తొలుత వాడబడేది. రూపకమునకు సమానార్థకమైన తమిళశబ్దమిది. దశవిధ రూపకములలో నాటకం ఒకటి అన్నట్లుగా, వివిధములైన కూత్తులలో నాటకం ఒకటి అని తమిళ పండితుల విశ్వాసం. నాటకవియల్ అనే గ్రంథంలో నాటకప్రకరణాదులైన దశవిధ రూపకములు వివిధములైన కూత్తులుగా ఉదాహ రించబడినవి.[1] 'నాటకం కథాశరీరం గల కూత్తు' అని వి.జి. సూర్యనారాయణ శాస్త్రి పేర్కొన్నారు.[2]

ఈ సందర్భంలో ఒక్క విషయం మాత్రం నిస్సంశయంగా చెప్పవచ్చు. తమిళ కవులలో నాలుగురకముల వారున్నట్లుగా తెలియవస్తున్నది వారు పాణర్, కూత్తర్, పొరునర్, విరలియార్ అనేవారు నటకులైనవారికి కూత్తర్ అనేవ్యవహారనామం ఏర్పడినది. వేషధారణ కావించి వారు ఒకవిధమైన ఆట ఆడేవారట. అందువల్ల వారికి ఆపేరు వచ్చింది.

ఇక తమిళనాటక ప్రాదుర్భావమును పరిశీలిద్దాము. దేవోత్సవాదులలో సంస్కృత నాటకములు ప్రదర్శించబడేవి. దేవోత్సవ సమయాలలో జరిగే ఆట పాటలే చివరికి నాటకంగా పరిణమించి వుండవచ్చునని తమిళపండితుల విశ్వాసం. తొలుత అటువంటి నాటకాలలో కథాత్మక సంభాషణలు లేవనీ, అవి కాలక్రమాన ఏర్పడెననీ భావిస్తున్నారు. ఆ సంభాషణలు కూడా మొట్టమొదట పద్యరూపంలో ఉండేవి. ఆ తర్వాత నాటక తమిళంలో వేత్తివియల్, పొదువియల్ అనే రెండు భాగాలు ఏర్పడినవి. రాజులచే ఆదరించబడిన నాటకములు వేత్త్రియల్ అనీ, సామాన్యులచే ఆదరించ బడినవి పొదువియల్ అనీ పేర్కొనబడినవి.

అలా సామాన్యులచే సైతం సమాదరించబడిన తమిళ నాటక వాఙ్మయం జైన బౌద్ధమత విజృంభణముతో పతనస్థితికి పాల్పడినట్లు తెలియవస్తున్నది. నాటక ప్రదర్శనవల్ల కామోద్రేకం కలుగ వచ్చుననీ, అది ధర్మహానికి దారితీసినా తియ్యవచ్చుననీ భావించి జైన బౌద్ధ మతాచార్యులు నాటక ప్రదర్శనల పట్ల వైముఖ్యం ప్రదర్శించారట! కాగా, ఆనాటి రాజులు కూడా నాటకములు ప్రోత్సహించడం మాని వేశారట!

కాని జైనుల కాలంలో వెలుగులోకి వచ్చిన సిలప్పదికార కావ్యమునకు 'ఇయల్ ఇశై నాటకపొరుళ్ తొడర్నిలై సెయ్యుళ్' అనీ; "నాటక కాప్పియం" అనీ నామాంతరములు కలవు. కనుకనే యీ కావ్యం నాటకవేషం వేసుకున్న పద్యరచనగా ప్రసిద్ధి వహించింది. నాటక కథనమే తత్కావ్యమునకు ఒక సోయగం సమకూర్చింది. సిలప్పదికారంలో అరంగేట్రు గాదై (రంగాధిరోహణ గాథ) అనే ఒక అధ్యాయం ఉన్నది. ఇది నాటక రంగ స్థలమును చిత్రించేదిగా ఉన్నదని విజ్ఞుల విశ్వాసం. కనుక జైన బౌద్ధుల కాలంలో నాటకం ప్రచారంలో ఉన్నట్లు భావించ వచ్చు.

నాటకధోరణిలో సంతరించ బడిన సిలప్పదికారము మినహాయిస్తే, తమిళంలో 18వ శతాబ్ది పూర్వార్ధం వరకు నాటకములు లేవని చెప్పడం సత్య సన్నిహితం. కనుక ఆంగ్లభాషా వాఙ్మయముల సంపర్కమునకు తర్వాతనే ఆధు నిక తమిళ నాటకం వెలసినట్లు చెప్పవచ్చు.

దేశినాటకము లనదగిన కుఱవంజి, పళ్లు, కూత్తులు నేటికీ తమిళనాడులో ప్రచుర ప్రచారంలో ఉన్నవి. వీటిని ఆట భాగవతములతో పోల్చవచ్చు. షేక్స్పియర్ మహాకవికి ప్లూటార్క్స్ లైవ్స్ ఎలాతోడ్పడిందో అలాగే నాడూనేడూ కూడా భారతీయ నాటక కర్తలకు రామాయణ భారతాలు తోడ్పడినవి; తోడ్ప డుతున్నవి. మన పెద్దలు సంస్కృత నాటకాలను రామాయణ నాటకాలనీ, భారత నాటకాలనీ విభజించారు. అలాగే, తమిళంలో తొలిరోజుల్లో వెలసిన నాటకాలనూ విభజించవచ్చు. అరుణాచల కవిరాయని రామనాటకం, స్వామినాథపిళ్లై రామనాటకం, కందయ్యాపిళ్లై రామవిలాసం, భవానందంపిళ్లై సీతాకళ్యాణం మొదలైన రామాయణ నాటకాలు. గణపతి అయ్యరు అభిమన్యు నాటకం, నాగేశఅయ్యరు అర్జున నాటకం, రామస్వామిఅయ్యరు అల్లినాటకం మొదలైనవి భారతనాటకములు. ఇవికాక, శివభక్త శిఖామణి అయిన నందవారు దివ్య చారిత్రమును అభివర్ణించే నందనార్ చరిత్తిరక్కీర్తనై కూడా ప్రసిద్ధమైన రచన. దీనికర్త గోపా. కృష్ణ భారతి. వీటిలో అభినయాంశం కంటె గేయాంశమే ఎక్కువగా ఉన్నదనవచ్చు. కనుక ఇవి గేయరూపకములనీ పేర్కొనవచ్చు. నందనారు చరిత్రము, అరుణాచల కవిరాయని రామనాటకము తప్ప కడమవన్నీ నేడు నామమాత్రము లని చెప్పడం సమంజసం.

అరుణాచల కవిరాయని రామనాటకం నుంచి ఒక గీతం:

పల్లవి

ఇదిగో విభీషణా! లంకాపురి రాజ్యం
ఇంద్రాది దేవత లున్నంతదాకా!

అనుపల్లవి

నాకు తోడుగా నీవు మనెదవని
నీ కొసగితి రాజ్యం నిఖిలలోక మెరుగగా ॥ఇదిగో॥

చరణాలు

వేద మున్నంతదాకా వేదగీతి వినిపించునందాకా
పారిజాతములూ పంచభూతములూ ఉన్నంతదాకా
ఇదిగో ఇదిగో ఇదిగో ఇదిగో.
వాన కురియునందాకా కడలి నీరున్నంతదాకా
ఈరేడు లోకాలూ, నా పేరు నిలిచినందాకా
ఇదిగో ఇదిగో ఇదిగో ఇదిగో ॥ఇదిగో॥

గోపాలకృష్ణ భారతి సంతరించిన "నందనార్ చరిత్తిరక్కీర్తనై" నుంచి ఒక ప్రసిద్ధ గీతం.

పల్లవి

శివలోకనాథుని చూచి సేవించి వద్దాము రారె

అనుపల్లవి

భవభయములను బాపి
పరమపదము నొసగే ఆ ॥శివ॥

చరణాలు

ఆశల కడలిలో పడితిమి, యిక
జ్ఞానమును విడిచితిమి
పాశము తొలిగే పథము కానక
పాపాత్ముల మైతిమి ॥శివ॥

మానవజన్మ మిచ్చెను - తనను
కొలువగ చేతులిచ్చెను

పాలూ తేనెలా తరలివెళ్లి
రథము కింద నిలిచీ ।శివ॥

తమిళ నాటక సాహిత్యమునకు కొత్త పుటలు చేర్చినవారు పె సుందరంపిళ్లై, వి.జి. సూర్యనారాయణశాస్త్రి ప్రభృతులు.

లార్డ్ లిట్టన్ కృతి అయిన **Lost Tales of Miletus** నుండి గ్రహించి సుందరంపిళ్లై మనోన్మణీయం అనే చక్కని నాటకం వ్రాశారు. షేక్స్పియర్ అడుగు జాడలలో నడిచిన సుందరంపిళ్లై పద్యరూపంలో రచన చేశారు. కాని షేక్స్పియర్ నాటకాలు రంగస్థలమును ఉద్దేశించి వ్రాయబడినవి. ఈవిషయమును సుందరంపిళ్లై పాటించినట్లు కనిపించదు. అందువల్ల మనోన్మణీయం ప్రదర్శనానుకూల మైన రచన కాలేదు. కాని సాహిత్యపు విలువకల నాటకమిది.

సూర్యనారాయణ శాస్త్రి కూడా పేరు గడించిన నాటక రచయిత. ఆయన కళావతి, మాన విజయం పేర్కొనదగినవి. వరదరాజ అయ్యంగారు అనే రచయిత విస్మృత విజయనగర సామ్రాజ్యం అనే నాటకం వ్రాశారు. శంకరదాస్ స్వాములవారు నాటకరంగమునకు చేసిన సేవ పేర్కొనదగినది. ఆయన పెక్కు నటుల్ని తయారు చెయ్యడమే కాకుండా, సుమారు నలభై నాటకాలు కూడా వ్రాశారు. పద్యగత భావమును మళ్లీ వచనంలోనూ వివరించడమనే అకాలపు పోకడ ఆయన నాటకములలో బాగా కనిపిస్తుంది. ఆయన నాటకములు పద్యమయం.

రంగస్థలమును మనస్సులో ఉంచుకుని నాటకరచన చేసిన యశస్సు పమ్మల్ సంబంధం ముదలియారుకి (1873 - 1964) దక్కుతుంది. దాదాపు నూరు నాటకాలు వ్రాశారు. వాటిలో కొన్ని పౌరాణికములు; మరికొన్ని సాంఘికములు. అభినయమునకు ప్రాధాన్య మివ్వడంవల్ల, ఆయన నాటకములలో పద్యములసంఖ్య పరిమిత మయింది. భావతీవ్రతను తెలియజేయుటకే పాటలు వాడబడినవి. తమిళ నాటక చరిత్రలో ఇది చెప్పుకోదగిన మార్పు. ఆయన నాటకాలలో మనోహర (కాల్పనికం), వేదాళవులగం (సాంఘికం), సభాపతి (ప్రహసనం),

మగపతి (మాక్‌బెత్‌కి అనుసరణ), అమలాదిత్యన్ (హామ్లెట్‌కి అనుసరణ) మొదలైనవి పేర్కొనదగినవి. కాని సాహిత్యదృష్టితో చూచినప్పుడు సంబంధం ముదలియారు నాటకాలు మనోన్మణీయంవలె నిలుచునో లేదో ప్రస్తుతం చెప్పలేము.

ఆంధ్రనాటక పితామహులైన ధర్మవరం రామకృష్ణమాచార్యులవారికి నేను ఏకలవ్య శిష్యుడను-అని సంబంధం ముదలియారు ఒకచోట పేర్కొన్నారు[3]. ధర్మవరం వారి ప్రభావం ఆయనమీద ఉండడం గమనించదగిన అంశం. ధర్మవరం వారి సరస వినోదినీ సభ (యస్.వి.యస్) వంటి సభను ఒకటి స్థాపించి ముదలియారు తమిళ నాటక రంగస్థలమునకు ఎనలేని సేవ చేశారు. ఆయన స్థాపించిన సభ పేరు సుగుణ విలాస సభ (యస్.వి.యస్.). స్వయంగా నటులు కావడంవల్ల, ఆయన రచనలు ప్రదర్శనానుకూలములై ప్రేక్షకుల్ని అలరిస్తున్నవి. ధర్మవరం వారి ప్రోద్బలంవల్ల తాను నాటకకర్త నైనానని ఆయన పేర్కొనడం, ఆయన సహృదయతకూ హృదయ వైశాల్యానికీ తార్కాణం. సంబంధం ముదలియారుని తమిళనాటక పితామహులని పేర్కొనవచ్చు.

తమిళనాటక వాఙ్మయ వికాసమునకు తోడ్పడిన సంస్కృతాంగ్ల నాటకానువాదములు కొన్ని ఉన్నవి. మఱైమలై అడిగళ్ అనువదించిన శాకుంతలం, కదిరేశసెట్టియార్ తమిళం చేసిన "మణ్ణియల్ సిఱుతేర్" (మృచ్ఛకటికం), యస్.వి. కణ్ణపిరాన్‌పిళ్ళై చేసిన మర్చంట్ ఆఫ్ వెనిస్ అనువాదం మొదలైనవి పేర్కొనదగినవి. ఇంకా సింబలిన్, జ్యూలియస్ సీజర్, ఒథెల్లో, ఘోస్ట్స్ (ఇబ్సెన్,) చెర్రీ ఆర్చార్డ్ (ఛెకోవ్), నూర్జహాన్ (ద్విజేంద్రలాల్‌రాయ్) మొదలైనవి కూడా తమిళం చేయబడినవి. కేంద్ర సాహిత్య అకాదెమీ పక్షాన హామ్లెట్ (అను:యస్. మహారాజన్), మాక్‌బెత్ (అను:కె.ఆర్. శ్రీనివాస అయ్యంగారు), ఒథెల్లో (అను: ఎ.సి. చెట్టియారు) అనువాదములు ప్రకటించబడినవి.

మహారాష్ట్రనుంచి వచ్చి తమిళనాడులో పర్యటించిన కొన్ని నాటక కంపెనీల వల్ల తమిళ నాటకరంగ చరిత్రలో మార్పులు కొన్ని యేర్పడినవి. పాటలు తగ్గుముఖంపట్టడం, వచనభాగం ఎక్కువ కావడం, సాంఘికేతివృత్తములను స్వీకరించడం మొదలైనవి ఆ మార్పులలో కొన్ని.

జాతీయోద్యమం ఫలితంగా తమిళంలో దేశభక్తి ప్రబోధాత్మకము లైన నాటకాలు వెలుగులోకి వచ్చినవి. తె.పొ. కృష్ణస్వామిప్పొవలర్ రచించిన 'కదరిన్ వెట్రి', (ఖద్దరువిజయం), బొంబాయి మెయిల్ మొదలైన చక్కని నాటకాలు ప్రజాభిమానం చూరగొన్నవి. ఆయన వ్రాసిన దేశియక్కొడీ (జాతీయజెండా) కూడా పేర్కొనదగినదే. అంతేకాక ఆయన ఇంగ్లాండులో కూడా తమిళ నాటకాలు ప్రదర్శింపజేశాడు. ఈసందర్భంలో కన్నయ్యనాయుడు కృషిని కొనియాడక తప్పదు. రంగస్థలమునకు ఆయనచేసిన సేవ ప్రశంసార్హం. రా. వెంకటాచలం వ్రాసిన వీరపాండ్య కట్టబొమ్మన్, ఎతిరాజులు రచించిన అవ్వైయార్ (తమిళ కవయిత్రి) మొదలైనవి కూడా స్మరింపదగినవే. చారిత్రక నాటకాలతో పాటు పౌరాణికములు కూడా ఎన్నో వెలువడినవి. ప్రసిద్ధ తమిళనవలలు నాటకీకరించబడినవి. ఈ కోవకు చెందిన వాటిలో "కల్కి" రచించిన పార్థివన్ కనవు, శివకామియిన్ శపథం మొదలైనవి గమనించదగినవి. ఈ సందర్భంలో కందసామి ముదలియార్ కృషిని ప్రస్తావించాలి. చంద్రకాంత, మోహన సుందరం, రాజేంద్ర మొదలైనవి ఆయన రచనలలో కొన్ని. నవలలలోని సంభాషణలను ఆయన తన నాటకాలలో యథాతథంగా ఉంచాడు.

యస్.డి. సుందరం వ్రాసిన "కవియిన్ కనవు" (కవిస్వప్నం), బి.యస్. రామయ్య రచించిన "తేరోట్టి మగన్" (రథచోదకుని కుమారుడు - కర్ణుడు), ప్రెసిడెంట్ పంచాక్షరం మొదలైనవి, టి.కె. ముత్తుస్వామి వెలయించిన "గుమాస్తావిన్ పెణ్" (గుమాస్తా కూతురు), రాజా భర్తృహరి మున్నగునవి, సి.యన్. అణ్ణాదురై సంతరించిన "ఓర్ ఇరవు" (ఒక రాత్రి), చంద్రమోహన్ మొదలైనవి, కు.స. కృష్ణమూర్తి వ్రాసిన అందమాన్ ఖైది, నారణదురైక్కణ్ణన్ రచించిన ఉయిరోవియం (సజీవచిత్రం) మొదలైనవి కొన్ని ప్రసిద్ధనాటకాలు. ఇంకా అరు. రామనాథన్, శివకుప్పుస్వామిపిళ్లై ప్రభృతులు కూడా నాటక కర్తలుగా ప్రసిద్ధికెక్కారు.

ఈ సందర్భమున రేడియో నాటకములను గురించి కూడా ప్రస్తావించడం సమంజసం. రేడియోనాటకం (నాటికకూడా) శ్రవ్యమే అయినప్పటికీ, కొన్ని విష

యాలను నాటక రంగస్థలంమీద కంటె రేడియో నాటకంలో సమర్థవంతంగా తెలియజేయవచ్చు. రేడియోనాటక శిల్పంలో ఒక ప్రత్యేకత కలదనడం నిర్వివాదాంశం. రేడియో పుణ్యమా అని ఎన్నో నాటికలు సంతరించబడినవి. ఈ కోవకు చెందిన రచనలలో శుద్ధానందభారతి, కె.ఎ.పి. విశ్వనాథన్, పూర్ణం విశ్వనాథన్, త్రిలోక సీతారాం, సుకి సుబ్రహ్మణ్యం, యస్.డి. సుందరం, బి యస్ రామయ్యా, తుత్తె వన్ ప్రభృతులవి ఉదాహరించ దగినవి. ఎ. శ్రీనివాసరాఘవన్, పెరియస్వామి తూరన్, కు.స. కృష్ణమూర్తి మొదలైనవారు పద్యనాటికలు వెలయించారు. ప్రస్తుతం ఎందరో నాటికారచన కావిస్తున్నారు.

తమిళ నాటకరంగమును గురించి ప్రస్తావించేటప్పుడు కన్నయ్యా, నవాబ్ రాజమాణిక్కం పిళ్లై మున్నగువారిని ప్రశంసించక తప్పదు. రంగాలంకరణ విషయంలో వీరు వహించిన శ్రద్ధ అనల్పం. వీరి నాటక ప్రదర్శనలు చలనచిత్రములను తలపిస్తాయి. నవాబ్ రాజమాణిక్కం పిళ్లై నాటకప్రదర్శనలలో నన్ను మిక్కిలిగా ఆకర్షించింది రామదాసు. రామదాసు నాటకంలో రాజమాణిక్క పిళ్లై తానీషానవాబ్ వేషం ధరించేవారు. కనుకనే ఆయనకి నవాబ్ రాజమాణిక్కంపిళ్లై అనేపేరు కలిగింది. అవ్వైయార్, రాజరాజచోళన్ మొదలైన చక్కని నాటకాలు ప్రదర్శించి పేరు పెంపులు గడించిన టి.కె.యస్. సోదరులు కూడా సంభావ్యులు. యస్.వి. సహస్రనామం, ఆర్.యస్. మనోహర్ ఎన్నో చారిత్రక పౌరాణిక నాటకాలు ప్రదర్శించారు. 'చో' నామాంతరం కల యస్.రామస్వామి మహమ్మద్ బిన్ తుగ్లక్, ఎన్నుగ్రి తణియు మిన్ద సుదందిర దాగం (ఎన్నడు మడియు నీ స్వాతంత్ర్యదాహం) వంటి పెక్కు సాంఘిక నాటకాలు ఎన్నోసార్లు ఎన్నోపట్టణాలలో ప్రదర్శించి తమిళుల ఆదరాభిమానములు బహుథా చూరగొన్నారు. కె బాలచందర్ 'ఎదిర్‌నీచ్చల్' వంటి ఉత్తమ సాంఘిక నాటకములు వ్రాశారు. సుప్రసిద్ధ చలనచిత్ర నటులైన యస్.యస్ కృష్ణన్, టి.ఎ మధురం, శివాజి గణేశన్, యం.కె. రాధ, యం.జి. రామచంద్రన్, యస్.యస్. రాజేంద్రన్ ప్రభృతులు నాటకము లెన్నో ప్రదర్శించి యథోచితంగా రంగస్థలమునకు కూడా సేవ చేశారు; చేస్తున్నారు.

ఉపసంహారమున, తమిళనాటక వాఙ్మయంగురించి రెండుమాటలు: ప్రాచీన కాలంలోనే తమిళంలో నాటకములు వాడుకలో ఉన్నట్లు పండితుల విశ్వాసం. కాని అవి నేటి నాటకముల వంటివి కావనడం సత్య సన్నిహితం. నాటకము లెన్నో వెలుగులోకి వచ్చినా, రంగస్థల సంప్రదాయములలో మార్పులెన్నో ఏర్పడినా, నాటక ప్రక్రియలో ప్రయోగము లింకా జరుగుతున్నవనీ త్వరలోనే ఉత్తమ నాటకములు వెలువడగలవనీ ఆశించవచ్చు.

## నవల

ఆధునిక సాహిత్య ప్రక్రియలలో నవల చాలా ముఖ్యమయింది. ఇది ఇటీవలి కాలంలో వ్యాప్తిలోకి వచ్చినా, నేడు నవలకు గల ప్రచురప్రచారం మరి యే యితర సాహిత్య ప్రక్రియనాలేదనవచ్చు. నవలను తమిళ రచయితలు నావల్ అనీ పుదినం అనీ వ్యవహరిస్తారు.

నేటికి సరిగ్గా నూరేళ్లక్రితం తొలి తమిళ నవలఅయిన ప్రతాప ముదలియార్ చరిత్రం వెలిసింది. దీని రచయిత మాయూరం వేదనాయకంపిళ్లై (1826-1889). ఆయన కవీ, సంగీత శాస్త్రజ్ఞుడూను. తమిళంలో వచనకావ్యాలు లేని కొరతను తీర్చే అభిలాషతో తానీ నవలను వ్రాసినట్లు ఆయన పీఠికలో పేర్కొన్నారు. ఆనాటి తమిళవచన శైలిని తెలుసుకునేందుకు కూడా ఈ నవల ఉపకరిస్తుంది. నేటి కొందరు రచయితలవలె కాక అయన సంస్కృత శబ్దములు కొంచెం ఎక్కువగానే ఉపయోగించినట్లు చెప్పవచ్చు. ఉదాహరణానికి కథాప్రారంభంలోని కొన్ని వాక్యాలను యథా తథంగా ఉదాహరిస్తున్నాను.

"ఇన్దదేశం ఇంగిలీష్ దురైత్తనత్తార్ స్వాదీనమాగి చి కాలత్తిర్కు పిన్బు సత్యపురి ఎన్నుం ఊరివే తొండైమండల ముదలియార్ కులత్తివేనాన్ పిఱన్దేన్. ఎన్. పాట్టనారాగియ ఏకాంబరముదలియార్ ఇన్దదేశత్తై ఆణ్డనవాబు గళిడత్తిల్ దివాన్‌వుద్యోగం సేద్యు అళవట్ర దిరవియం గళైయుం బూస్తితిగళైయుం సంపాదిత్తార్." (ఈ దేశము ఇంగ్లీషు దొరతనమువారి స్వాధీనమైన కొంతకాల

మునకు పిమ్మట సత్యపురి అను ఊరిలో తొండమండల ముదలియార్ కులములో నేను పుట్టితిని. మా తాతగారైన ఏకాంబర ముదలియార్ ఈ దేశము నేలిన నవాబులయొద్ద దివాన్‌గిరీ చేసి అంతులేని ద్రవ్యమును, భూస్థితిని సంపాదించెను.)

ప్రతాప ముదలియార్ చరిత్రం ఒక సాంఘిక నవల. తమిళనాడులోని ఆచారవ్యవహారములు, గృహస్థజీవితం మొదలైనవి యిందులో అభివర్ణితములు. కథానాయకుడు సజ్జనుడూ, విద్వాంసుడూను. అతడు తన జీవిత వృత్తాంతమును-పుట్టినది మొదలు పెళ్లిపేరంటము లయ్యేవరకు, ఆతర్వాత జరిగిన విశేషములు-కథగా వివరిస్తాడు. మధ్యమధ్య హాస్యరసం చిప్పిలుతూ వుండడం ఒక విశేషం. కథానాయకుని తల్లి అయిన సుందర అన్నీ, భార్య అయిన జ్ఞానాంబాళూ విద్యుల్లతలవలె ప్రకాశిస్తారు. వీరిద్దరూ ఆభిజాత్య సంపన్నలు. న్యాయంకోసం పాటుపడతారు. నీత్యుద్బోధకంగా సంతరించబడిన యీ నవలలోని పాత్రచిత్రణ ఉదాత్తముగా ఉన్నదనవచ్చు.

ప్రతాప ముదలియార్ చరిత్రమునే కాక సుగుణసుందరి చరిత్రం అనే నవలను కూడా వేదనాయకం పిళ్లై వ్రాశారు. సర్వసమరస కీర్తనలు, నీతినూల్, పెణ్‌మతినూలై మొదలైనవి ఆయన యితర రచనలు.

తమిళంలో వెలసిన రెండవ నవల పి ఆర్ రాజం అయ్యరు (1872-1898) రచించిన కమలాంబాళ్ చరిత్రం. ఇదికూడా సాంఘిక నవలే. విమర్శకుల దృష్టిలో ఇదే మొదటి తమిళ నవల. ఎందుకంటే, ప్రతాప ముదలియార్ చరిత్రను చదువుతున్నంతసేపూ ఏదో ఒక పాతకథను చదువుతున్నట్టు అనిపిస్తుంది.

కమలాంబాళ్ చరిత్రలో కమలాంబాళ్ కథానాయిక. ఆమె జీవిత వృత్తాంతమే యిందలి ప్రధాన కథ. దైనందిన సంసార యాత్రలో సంభవించే సుఖదుఃఖాలు, తమిళ దేశపు గ్రామజీవితం నవలలో కళ్లకు కట్టినట్లుగా వర్ణించబడినవి. చక్కని పాత్రపోషణా, చిక్కని శైలీ యీ నవలకు అందచందాలు చేకూర్చినవి. ఒక్క తమిళంలోనే కాదు, ఆంగ్లంలోనూ మంచి పండితుడు రాజమయ్యరు.

వేదాంత విషయాలంటే ఆయన కెంతో అభిమానం. కాని దురదృష్టం, ఇరవై ఆరేళ్లకే ఆయన శాశ్వతంగా కన్నుమూశారు.

నవలా రచనలో కృషి చేసిన తొలి తమిళ రచయితలలో అ. మాధవయ్య (1872-1925) కడపటివాడు. ఆయన పద్మావతి చరిత్రం, విజయమార్తాండం అనే నవలలు వ్రాశారు. వాటిలో పద్మావతి చరిత్రమే ప్రశస్తమయింది. ఆయన సంఘసంస్కరణాభిలాష ఈ నవలలో ప్రవ్యక్త మవుతుంది. వేదనాయకం పిళ్లై, రాజంఅయ్యరు, మాధవయ్యా వీరు ముగ్గురూ తమిళ నవలా సాహిత్యమునకు గట్టి పునాదులు వేశారు.

ఈ సందర్భంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రం గురించి రెండు మాటలు చెప్పడం సమంజసం. నవలా సాహిత్యపు తొలిరోజులలో తెలుగులోగాని తమిళంలోగాని వెలువడిన రచనలకు చరిత్ర మనే పేరు పెట్టడం గమనించదగిన అంశం. సూక్ష్మంగా చూచినట్లయితే, ఆ నవలలలో కనిపించే వ్యక్తుల మనస్తత్వం ఇంచుమించు ఒకేవిధంగా ఉన్నట్టు తెలియవస్తుంది. పాపభీతీ, దైవభక్తీ, న్యాయానురక్తీ, పూర్వాచార పరాయణతా వారిలో కానవచ్చే కొన్ని సాధారణ లక్షణాలు. అభిజాత్య సంపన్నులైన వ్యక్తులనే కథానాయకులుగా వారు గ్రహించారు. సాంఘిక నవలతోనే తెలుగు తమిళ నవలా సాహిత్యాలు ప్రారంభంకావడం పేర్కొనదగిన విషయం. తర్వాతనే చారిత్రక నవలలు, అపరాధ పరిశోధక నవలలు మొదలైనవి వెలుగులోకి వచ్చినవి.

అపరాధ పరిశోధక నవలలు వ్రాసిన వారిలో రంగరాజు, వడువూర్ దురైస్వామి అయ్యంగారు, కోదైనాయకి మొదలైనవారు ప్రముఖులు. కోదైనాయకి సుమారు 150 నవలలు వ్రాసి పేరు పెంపులు గడించుకున్న రచయిత్రి. కథాకథనంలో ఆమె ప్రదర్శించిన నైపుణ్యం ప్రశంసార్హం. పండిత నటేశశాస్త్రి రచించిన దీనదయాళు, దిక్కట్ర ఇరు కుళన్దైగళ్ (దిక్కులేని ఇద్దరు పిల్లలు) మొదలైనవి పేర్కొనదగినవి. రెయ్‌నాల్డ్ నవలల్ని ఆధారం చేసుకుని ఆరణి కుప్పుస్వామి ముదలియార్ చక్కని నవలలు వ్రాశారు. మఱైమలై అడి

గళ్ (స్వామి వేదాచలం) రచించిన కుముదవల్లి లేక నాగనాట్టరసికూడా చక్కని నవల

తమిళ చారిత్రక నవల అనగానే కల్కి పేరు ప్రప్రథమంగా స్ఫురణకు రావడం పరిపాటి. కల్కి గుప్తనామం. అసలు పేరు రా. కృష్ణమూర్తి (1899-1954). సుప్రసిద్ధ రచయితగా, పత్రికా సంపాదకుడుగా, దేశభక్తుడుగా, తమిళ భాషాభిమానిగా ఆయన చిరయశస్సు నార్జించారు. స్వయంగా నవలలూ కథానికలూ వ్రాయడమే కాకుండా, నవలా రచననుకూడా ప్రోత్సహించారు. నేటి తమిళ రచయితలు పలువురు ఆయన్ని అనుసరిస్తున్నారు కనుక ఆధునిక తమిళ నవలా సాహిత్యమన్నప్పుడు, మొదట కల్కిని ఉదాహరించడం సమంజసం.

కళ్వనిన్ కాదలి (చోరుని ప్రేయసి), పార్తిపన్ కనవు (పార్థివస్వప్నము), శివకామియిన్ శపదం (శివకామి శపథం), అలై ఓశై (అలల ఘోష) మొదలైనవి కల్కి నవలలలో పేర్కొనదగినవి. ప్రాచీన తమిళ సంస్కృతిఅన్నా, తమిళ మహీపతులన్నా కల్కికి మహాభిమానం. ప్రాచీనకాలంలో వర్ధిల్లిన చేర చోళ పాండ్య మహీపతులు ధర్మమార్గావలంబకులనీ, వీరవరేణ్యులనీ సాధారణంగా భావించబడుతున్నది. కల్కి రచనలు చదువుతున్నప్పుడు ఈ భావం మనకు స్ఫురిస్తుంది. చారిత్రక నవలలు సంతరించడంలో ఆయన అందె వేసిన చెయ్యి.

కల్కి నవలలో అలై ఓశై ప్రత్యేకంగా పేర్కొనదగిన రచన "నేను వ్రాసిన పుస్తకాలలో యాభై లేక నూరేళ్లపాటు నిలువగలిగేది ఏదైనా ఒకటి ఉన్నదంటే, అదే అలై ఓశై అని నా అభిప్రాయం." అని ఆయనే పేర్కొన్నారు. ఇది 828 పుటల బృహద్రచన. ఇది సాంఘిక నవలే అయినా, ఒకవిధంగా చూస్తే దీన్ని రాజకీయ నవల అనవచ్చు. ఒక సహృదయుడీ రచనను గురించి ముచ్చటిస్తూ, "ఈ నవలను గాంధీయుగ పురాణ మనవచ్చు" అని సెలవిచ్చాడు. ఇది నిజం. ఉప్పు సత్యాగ్రహం, కరాచీ కాంగ్రెసు, బీహార్ భూకంపం, హరిపురా కాంగ్రెసు, సంస్థానాధిపతుల ధోరణి, 1942 ఆగస్టు ఉద్యమం, దాని ననుసరించి

జరిగిన పోరాటం, ఆగస్టు 1947, ఆతర్వాత ఇండియాలోనూ పాకిస్తాన్‌లోనూ చెలరేగిన మతకలహాలు, కాందిశీకుల శిబిరాలు, గాంధీనిర్యాణం మొదలైన ఎన్నో విషయాలను ఎంతో నేర్పుగా కథలో చొప్పించి, వాటికి సాహిత్యంలో స్థానం కల్పించారు కల్కి. అలైఓశై నాలుగు భాగాల నవల. భూకంపం, తుపాను, అగ్నిపర్వతం, ప్రళయం—అని ఆ నాలుగు భాగాలకు నామకరణం చేశారు నవలా కర్త. బీహారు భూకంపం, కాంగ్రెసు సంస్థలో సోషలిస్టు పక్షమునకు చెందిన కొందరు యువకులు తెచ్చిన తుపాను, 1942లో మనదేశంలో ప్రతివ్యక్తి హృదయంలోనూ లేచిన అగ్నిపర్వతం, స్వాతంత్ర్యానంతరం మతం పేరుతో ఏర్పడిన ప్రళయం మొదలైనవి ఈ నాలుగు భాగాలలోని ప్రధాన విషయాలు. ప్రధాన కథలో కొంత డొంకతిరుగుడు ఉన్నప్పటికీ, ఈ వివిధ విషయాలను నేర్పుతో చొప్పించి కథకు జీవం పోశారు కల్కి. నవల పెద్దదే అయినా, పాఠకునికి విసుగు కలగనట్లుగా రచయిత దీనిని తీర్చిదిద్దారు. పైపెచ్చు, ముందుపుటలలో రచయిత ఏమి చెప్పనున్నాడో అనే ఉత్కంఠ కలుగుతుంది. కల్కి నవలలో కనిపించే వైశిష్ట్యమే యిది. కథాగత వివరములే కాక, కల్కి రచనావిధానం, సన్నివేశకల్పనా మొదలైనవి హృద్యంగానూ, సంభాషణలు సజీవంగానూ ఉంటాయి.

కల్కి కృష్ణమూర్తికి తర్వాత పేర్కొన దగిన వారిలో ముఖ్యులు చాండిల్యాన్, ము. వరదరాజన్, అఖిలన్, తి. జానకిరామన్, డి. జయకాంతన్, జగశిర్పియన్, రాజంకృష్ణన్, నా. పార్థసారథి, క. నా. సుబ్రహ్మణ్యం, అర్. షణ్ముగ సుందరం ప్రభృతులు.

సుప్రసిద్ధ పండితుడూ రచయితా అయిన ము. వరదరాజన్ అగల్ విళక్కు (ప్రమిదదీపం), కళిత్తుండు మొదలైన పెక్కు నవలలు వ్రాశారు. ఆధునిక తమిళరచయితల శైలిలో రెండురకాలు కొట్టవచ్చినట్టుగా కనిపిస్తున్నవి. కొందరు వ్యావహారికాన్ని ఆదరించే వారయితే, మరికొందరు గ్రాంథికవాదులు. కాని వరదరాజన్ మధ్యేమార్గం అనుసరించారు. ఆయన శైలి గ్రాంథికానికి సన్నిహితంగా కనిపించినా, అది వీరగ్రాంథికం కాదు; సులభ సుందరం. పి. యం. కణ్ణన్ వ్రాసిన నాగవల్లి, ముళ్‌వేలి; తి. జానకిరామన్ నంతరించిన మోహముళ్, అమ్మా వన్దాళ్; మి. పా. సోమసుందరం వ్రాసిన రవిచంద్రిక; చాండిల్యాన్ రచిం

చిన జీవభూమి; క. నా. సుబ్రహ్మణ్యం వ్రాసిన ఒరునాళ్, పొయ్‌త్తేవు; టి. యన్. కుమారస్వామి వెలయించిన అన్బిన్ యెల్లై; నా. పార్థసారథి రచించిన కుఱింజి మలర్; ఇ. బాలకృష్ణనాయుడు వ్రాసిన దనయక్కాన్ కోట్టై మొదలైనవి తమిళ పాఠకలోకమును అలరించిన గొన్ని నవలలు.

సుప్రసిద్ధ రచయిత అయిన అఖిలన్ నవలలలో ఒక విశిష్టత స్పష్టంగా గోచరిస్తుంది. స్వాతంత్ర్య సమరగాథ ఆయన రచనలకు నేపథ్యంగా కనిపిస్తుంది. నేతాజీ సుభాస్ చంద్రబోసు స్థాపించిన సైన్యమును ఆధారంగా చేసుకుని సంతరించబడిన నవల నెంజిన్ అలైగళ్ (హృదయ తరంగాలు). చోళుల వృత్తాంతము నభివర్ణించే చారిత్రక నవల "వేంగైయిన్ మైన్దన్". ఈ మధ్య ఆయన వ్రాసిన "ఎంగే పోగిరోం" (ఎక్కడికి వెడుతున్నాం) నవల ప్రస్తుత పరిస్థితులలోని ఆవకతవకలనూ గాంధేయ మార్గంలోని వైశిష్ట్యమునూ తెలియజేస్తుంది. కోవి మణిశేఖరన్ పెక్కు చారిత్రక నవలలు సంతరించారు.

నేటి ప్రముఖ నవలా రచయితలలో ఒకరు జయకాంతన్. అయన రచనలో వాస్తవిక దృక్పథం గోచరిస్తుంది. "సిలనేరంగళిల్ సిల మనిదర్‌గళ్" (కొన్ని వేళల్లో కొందరు మనుషులు) ఆయనకి పేరు తెచ్చిన నవలలలో ఒకటి. విభిన్న వ్యక్తుల మనస్తత్వ పరిశీలన యిందులో మనకు ప్రధానంగా కనిపిస్తుంది.

రాజం కృష్ణన్ విలక్షణమైన నవలా రచయిత్రి. ఆమె నవలలు ఇద్దరమ్మాయిలు ముగ్గురు రబ్బాయిలు వంటివి కావు. ఆమె రచనకు ఒక ప్రత్యేక ఆశయం ఉంటుంది. గోవాస్వాతంత్ర్య సమరగాథకు సంబంధించిన నవల "వళైక్కరం." నీలగిరి ప్రాంతాల నివసించే వారి సుఖదుఃఖాలను తెలియజేసే ప్రశస్తమైన నవల కుఱింజిత్తేన్. కనుక రాజం కృష్ణన్ రచనలు ఒక ప్రయోజనాన్ని ఆశించి చేయబడినవిగ భావించడం అత్యుక్తి కాదు. అంతే కాని ఆషామాషీగా చేయబడిన రచనలు కావు.

ఇంకా అశోకమిత్రన్, ఇందిరా పార్థసారధి. నీల పద్మనాభన్ ప్రభృతులు నవలా రచనలో ప్రయోగాలు చేస్తున్నారు'. ఉదాహరణానికి నీలపద్మనాభన్ "పళ్లికొండపురం" (అనంత శయనం) తిరువనంతపురంలోని సామాజిక జీవి

తాన్ని పలుకోణములనుంచి పరిశీలించి వ్రాయబడిన నవల. నవలలోని ప్రతిపాత్ర వెనుక రసవత్తరమైన ఒక కథ ఉంటుంది. వారందరి కథలే తిరువనంతపురం సామాజిక జీవిత చరిత్ర. గుహప్రియ, లక్ష్మిగా చిరపరిచిత అయిన త్రిపుర సుందరి. సి. సు. చెల్లప్ప, శంకరరామ్, చిదంబర సుబ్రహ్మణ్యం మొదలైనవారు తమ రచనలద్వారా తమిళ నవలా సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్నారు. కల్కి, ఆనంద వికటన్, కలైమగళ్ మొదలైన పత్రికలు నవలా రచయితలను ప్రోత్సహిస్తున్నవి.

ఈ సందర్భంలో ఇతరభాషలనుంచి తమిళంలోకి నవలలు అనువదిస్తున్న రచయితలను గురించి కూడా చెప్పడం సమంజసం. కా. శ్రీ. శ్రీ (కె. యస్. శ్రీనివాసాచార్య). టి యస్. కుమారస్వామి, వీళినాథన్, సరస్వతీ రామనాథన్, యస్. కె. సీతాదేవి, యం. యస్. కమల మొదలైనవారు మరాఠీ, బెంగాలీ, తెలుగు, కన్నడం మున్నగు భాషలలోంచి మంచి మంచి నవలలు తమిళం చేశారు. చల్లా రాధాకృష్ణశర్మ వ్రాసిన "ఆయిరం తలైనాగం" విశ్వనాథ సత్యనారాయణ గారి వేయిపడగలు నవలకు అనుసరణ. ఈ మధ్య కొన్ని తెలుగు నవలలు తమిళం చేయబడినవి.

## కథానిక

ప్రతిభాషలో వలె, తమిళంలోనూ కథావాఙ్మయం అతి ప్రాచీన మయింది. కాని ఆంగ్ల భాషాసాహిత్యముల సంపర్కం వల్ల కథానిక వాడుకలోకి వచ్చింది.

వీర మా మునివర్ నామాంతరం కల రెవరెండ్ బెస్కి "పరమార్థగురు కదై" అనే చిన్న కథల సంపుటం ఒకటి ప్రకటించారు. ఇది హాస్యరస ప్రధానం. ఆ తర్వాత వినోదరస మంజరి, కథా చింతామణి వంటి కొన్ని సంపుటాలు వెలువడినవి. ఇవి వినోదజ్ఞానాత్మకములైన కథల పుస్తకములు. అయినా, కథానికా సాహిత్యానికి శ్రీకారం చుట్టినవారు. వ. వే. సు. అయ్యరు. ఆయన ప్రముఖ దేశభక్తుడు; సాహితీవేత్త కూడా. సుబ్రహ్మణ్య భారతికూడా కథానికలు కొన్ని వెలయించినా, వ. వే. సు. అయ్యరుని తమిళ కథానికా సాహిత్యమునకు మూలపురుషుడుగా భావించడం సముచితం.

రవీంద్రనాథ ఠాకూరు రచించిన కాబూలీవాలా మొదలైన పదకొండు కథలను తొలుదొలుత తమిళం చేసిన రచయిత వ. వే. సు. అయ్యరు. ఈ అనువాద కథలతోపాటు, ఆయన కొన్ని స్వతంత్ర కథానికలుకూడా సంతరించారు."కుళత్తంగరై అరశమరం సొన్నకదై" (చెరువు గట్టుమీది రావిచెట్టు చెప్పిన కథ) హృదయ విదారకమైన కథానిక. భర్తను అపార్థం చేసుకుని చివరికి ఆత్మహత్య చేసుకున్న ఒక అభాగ్యురాలిని మన మీ కథలో చూడవచ్చు.

కథానికా సాహిత్యం పరిపూర్ణంగా వికసించింది యీ శతాబ్దిలోనే. పుదుమైప్పిత్తన్ (చొ. వృద్ధాచలం), రాజాజీ (చక్రవర్తి రాజగోపాలాచారి), కు. ప. రాజగోపాలన్, బి. యస్. రామయ్యా, ల స. రామామృతం, మౌని, సి. సు. చెల్లప్ప, అళగిరిస్వామి, న. పిచ్చమూర్తి, తి. జానకిరామన్, యస్. అఖిలన్, చిదంబర సుబ్రహ్మణ్యన్, జయకాంతన్, కి. వా. జగన్నాథన్, తి. జ. ర. మొదలైన వారు చక్కని కథానికలు సంతరించారు.

ఈ నాడు కథానిక లేని తమిళ పత్రిక లేదన్నా అతిశయోక్తి కానే కాదు. కల్కి, కుముదం, ఆనంద వికటన్, దినమణి కదిర్, దీపం మొదలైనవి కథానికలు ప్రకటిస్తున్నవి. కాని ఆ రోజుల్లో, (అనగా 1933 ఆ ప్రాంతాల) కథానికలకు ఎంతో ప్రోత్సాహమిచ్చిన ప్రముఖ పత్రిక మణిక్కొడి. దాని సంపాదకులు బి. యస్. రామయ్యా.

పేరుకి తగ్గట్టుగా, పుదుమైప్పిత్తన్ నవ్యదృష్టి కలవాడు. పాత కథలను కొత్త చూపుతో ఆయన పరిశీలించారు. అలాగే, శైలి విషయంలో కూడా పాతబడిన మాటలను పరిహరించి వాడుక తమిళమును స్వీకరించారు. అందువల్ల ఆయన శైలికి జిగీ బిగీ కలిగినవి. సాంఘిక సమస్యలనే కాకుండా పౌరాణిక గాథలను కూడా ఇతివృత్తాలుగా గ్రహించారు. ఇందుకు ఒక ఉదాహరణ. పుదుమైప్పిత్తన్ శాపవిమోచనం అనే కథానిక వ్రాశారు. ఇది అహల్యకథ. శాపమునకు విమోచనం లభించినా, చేసిన పాపానికి విమోచనం కలగలేదనే భావంతో బాధతో అహల్య మళ్లీ శిలగా మారిపోతుంది. గౌతము డేమో మళ్లీ తపస్సుకి బయలుదేరతాడు. ఇలా అహల్యా శాపవిమోచనమును కథానికగా అభివర్ణించారు పుదుమైప్పిత్తన్.

స్వాతంత్ర్య యోధుడుగా సాహితీవేత్తగా సమప్రజ్ఞ ప్రదర్శించిన సవ్యసాచి రాజాజీ. ఆయన శైలి సులభసుందరం. శక్తివంతమైన వాడుకభాషలో ఆనాళ్లలో తీవ్రరూపం దాల్చిన సాంఘిక సమస్యలను ఆయన కథలుగా మలచారు. దేవానై అనే ఒక కథానికలో చేనేత వస్త్రానికి గిరాకీ లేకపోవడంవల్ల చేనేత పారిశ్రామికులు ఆర్థికంగా పడిన బాధలూ వాటివల్ల కలిగిన దుష్ఫలితమూ వర్ణించబడినవి. చేనేత కుటుంబంలో పుట్టిపెరిగిన యువతి దేవానై. పల్లెటూరిది. స్వగ్రామంలో ఉన్నంతవరకూ హాయిగా ఉన్న దేవానై, ఇల్లు గడవని కారణంగా, పట్టణం చేరుకుని చివరికి బిచ్చగత్తెగా మారుతుంది. కరుణ రస ప్రధానమైన కథ యిది.

బి. యస్. రామయ్య పెక్కు కథానికలు వెలయించారు. ఆయన కథలలో నట్చత్తిరక్కుళన్దైగళ్ (నక్షత్ర సంతానం) ప్రసిదికెక్కింది. కల్కి కూడా కథానికలు వ్రాశారు. కేదారియిన్ తాయార్ (కేదారియొక్క తల్లి) కథలో ఛాందస బ్రాహ్మణ కుటుంబములలో కానవచ్చే మూఢాచారములను ఆయన నిశితంగా విమర్శించారు. మౌని చాలాకథలు వ్రాయలేదు. కాని వ్రాసినవిమాత్రం గొప్పవి. ఒక్కసారి చదివితే అవి సులభంగా అర్థంకావు. తి. జానకి రామన్ సుప్రసిద్ధ కథకులలో ఒకరు. ఆయన రచనలలో తంజావూరు జిల్లా వాడుక తమిళం అందాలు దిద్దుకుంది. ఆయన వ్రాసిన గోపుర విళక్కు ఒక కొత్తదృక్పథంతో వ్రాయబడింది. కుటుంబ సంరక్షణార్థం ఒకస్త్రీ తన శరీరమును విక్రయించుకుంటుంది. ఆమె మరణానంతరంకూడా ఆమెను విమర్శిస్తారు ఆ గ్రామస్థులు. అంత అంధత్వంలో నివసిస్తున్న ఆ గ్రామస్థులకు వెలుతురు అవసరంలేదని భావించిన ఒక వృద్ధుడు గోపురంమీద వెలుగుతున్న దీపమును ఆర్పివేస్తాడు.

సుప్రసిద్ధ పండితుడూ విమర్శకుడూ అయిన కి. వా. జగన్నాథన్ చక్కని కథానికలు కొన్ని సంతరించారు. ఆయన కథానికలలో మిట్టాయ్‌క్కారన్ ప్రసిద్ధమయింది. ఒక కుర్రవాడు మిఠాయి గంపనుంచి ఒక మిఠాయి తీసుకుని తింటాడు. అది చూచి ఆ మిఠాయి అమ్మేవాడు కోపంకొద్దీ కుర్రవాణ్ణి కొడతాడు. కొంచెం సేపయిన తర్వాత, దారిలో రాయి తగిలి మిఠాయి అమ్మేవాడు

కిందపడగా, గంపకాస్తా పక్కనున్న మురుగు కాలువలో పడిపోయింది. మిఠాయిలన్నీ పాడయిపోయినాయి. అప్పు డనుకుంటాడుగదా అతడు. "ఒక్క మిఠాయి తీసుకున్నందుకు కుర్రవాణ్ణి కొట్టాను. ఇప్పుడేం చెయ్యను." పశ్చాత్తప్తుడైన అతను వెంటనే ఆ కుర్రవాణ్ణి సమీపించి ప్రేమపూర్వకంగా అనునయిస్తాడు. సంగకాలపు కవితలలో కానవచ్చే కొన్ని సంఘటనలను ఆయన చక్కని కథలుగా చిత్రించారు.

జయకాంతన్ కథలలో విప్లవాత్మక ధోరణి బాగా కనిపిస్తుంది. బ్రహ్మోపదేశం అనే కథలో జాత్యౌన్నత్యతత్వం విమర్శించబడింది. శీలసంపన్నుడైన ఒక బ్రాహ్మణుడు నిమ్నజాతికి చెందిన ఒకనికి జందెం వేసి నువ్వే బ్రాహ్మణుడివి అని చెపుతాడు. అఖిలన్, సుందర రామస్వామి, కి. చంద్రశేఖరన్, త.నా కుమారస్వామి, "మున్షి", "విన్దన్", శ్రీ వేణుగోపాలన్ మొదలైనవారు కథానికలు వ్రాశారు.

రచయిత్రులలో నవలలు వ్రాసేవారికంటె కథానికలు వ్రాసేవారే ఎక్కువమంది కనిపిస్తారు. రాజం కృష్ణన్, వసుమతి రామస్వామి, చూడామణి, సరోజా రామమూర్తి, "కృత్తిక", విమలారమణి మొదలైనవారు ప్రశస్తములైన కథానికలు రచించారు. మొత్తంమీద తమిళ కథానికా వాఙ్మయం సువిశాలమైనది. తమిళ కథలు కొన్ని తెలుగు, ఆంగ్లం మొదలైన భాషలలోకి అనూదితములైనవి.

## విమర్శ వ్యాసము.

ఉత్తమ విమర్శ కావ్యరసాస్వాదనమునకు బహుథా ఉపకరిస్తుంది. తమిళ వేదమైన తిరుక్కుఱళుకి ప్రాచీనులే కొందరు ప్రశస్తములైన వ్యాఖ్యానములు వెలయించారు. వాటిలో పరిమేలళగర్ వ్రాసిన వ్యాఖ్యానం ప్రసిద్ధి కెక్కింది. నేడుకూడా ఈ ఉద్గ్రంథమునకు ఉత్తమ వ్యాఖ్యానాలు వెలువడుతున్నవి. నామక్కల్ రామలింగం పిళ్లై "తిరుక్కుఱళ్ పుదు ఉరై", ము. వరదరాజన్ వ్రాసిన "తిరువళ్లువర్", తె. పొ. మీనాక్షి సుందరం వెలయించిన "వళ్లువర్

కండనాడుం కామముం, కె. వ. జగన్నాథన్ వెలయించిన వ్యాఖ్యానము మొదలైనవి పేర్కొనదగినవి. తిరుక్కుఱళులోని వివిధ విషయములను పరిశీలించుటకై మదరాసు విశ్వవిద్యాలయంలో ఒక ప్రత్యేక శాఖ ఏర్పాటు చేయబడడం గమనించదగిన అంశం. అలాగే, కంబరామాయణమును గురించి కూడా పలువురు విమర్శగ్రంథములు వెలయించారు; వ్యాసములెన్నో ప్రకటించారు. అణ్ణామలై విశ్వవిద్యాలయం, ఉ. వే. స్వామినాథయ్యరు గ్రంథాలయం కంబరామాయణమునకు సంశోధిత ముద్రణములు ప్రకటించినవి. కంబన్ కళగం వంటి సాహిత్య సంస్థలు కంబరామాయణమునకు సంబంధించిన వ్యాసములూ, విమర్శలూ ప్రకటిస్తున్నవి. కంబన్ జయంత్యుత్సవములు జరుపుతున్నవి.

ఈ సందర్భంలో రసహృదయులూ ప్రసిద్ధ విమర్శకులూ అయిన టి.కె.సి.ని. (టి. కె. చిదంబరనాథముదలియారు) గురించి చెప్పడం ముఖ్యం. కంబరామాయణమునూ ఇతర ప్రాచీన కావ్యములనూ ఆయన విమర్శనాత్మక దృష్టితో అధ్యయనం చేసి వాటిలోని సొగసులు తెలియజేశారు. ఆయన దృష్టిలో కంబరామాయణం ప్రక్షిప్తపద్యముల మయం. టి. కె. సి. పరిష్కృత రామాయణంలో (కంబర్ తరుం రామాయణం) బాలకాండలో 167 పద్యములూ, అయోధ్యాకాండలో 550 పద్యములూ మాత్రమే చేర్చబడినవి. కడమవన్నీ తరువాత చేర్చబడినవి. కాని ప్రస్తుతం ప్రచారంలో ఉన్న కంబరామాయణంలో బాలకాండలో 1,420 పద్యములూ, అయోధ్యాకాండలో 1,210 పద్యములూ ఉన్నవి. టి.కె.సి. వల్ల ఉత్తేజితులై పలువురు రచయితలు కంబరామాయణాది కావ్యపరిశీలన చేశారు. పి. శ్రీ, అ. శ్రీనివాసరాఘవన్, అ. స. జ్ఞానసంబంధన్, యస్. మహరాజన్, రామకృష్ణన్, యం. యం. ఇస్మాయిల్, కె. శ్రీనివాసన్ ప్రభృతులు కంబరామాయణమును గురించి ప్రశస్తములైన పుస్తకములు వెలయించారు. ఇస్మాయిల్ అధ్యక్షతను ఏర్పడిన కంబన్ కళగంవారు ప్రస్తుతం కంబరామాయణ సంశోధిత ముద్రణమును తయారు చేస్తున్నారు.

ఉ. వే. స్వామినాథయ్యరు, చెల్వకేశవరాయ ముదలియారు సోమసుందర భారతి, యస్. వైయాపురి పిళ్లై, రా. రాఘవఅయ్యంగారు, ము. రాఘవఅయ్యంగారు, ఆర్.పి. సేతుపిళ్లై, తిరు.వి. కల్యాణ సుందర ముదలియారు, ము. వరద రాజన్, అ. చిదంబరనాథన్ చెట్టియారు, క అప్పాదురై, కు. కోదండపాణి పిళ్లై ప్రభృతులు తమిళ సాహిత్యం, తమిళ సంస్కృతి మొదలైనవాటిని గురించి అమూల్యములైన వ్యాసములు వ్రాశారు, ము. రాఘవ అయ్యంగారు సంతరించిన "ఆరాయ్చ్చిత్తొగుది" ప్రశస్త పరిశోధక వ్యాస సంపుటి. అలాగే, వైయాపురి పిళ్లై వ్యాసములు బహువిషయ సంభరితములు. స్వామినాథయ్యరు వ్రాసిన నాన్ కణ్డదుం కేట్టదుం (నేను విన్నవీ కన్నవీ) అమూల్య వ్యాస సంపుటి. పైగా, సులభమూ సలక్షణమూ అయిన వచనరచనకు ఆ సంపుటం లక్ష్యప్రాయమై భాసిస్తున్నది. అన్యభాషలలోవలె, తమిళంలోనూ విశ్వవిద్యాలయములలో పనిచేసే అధ్యాపకులు సాహిత్యవ్యాస సంపుటులు ఎన్నో ప్రకటిస్తున్నారు.

సాహిత్య విమర్శకు సంబంధించిన గ్రంథములుకూడా కొన్ని వెలువడినవి. అ. స. జ్ఞానసంబంధన్ వ్రాసిన ఇలక్కియక్కలై (సాహిత్యకళ), ము వరద రాజన్ సంతరించిన ఇలక్కియత్తిఱన్, కి. వా. జగనాథన్ రచించిన తమిళ్ కాప్పియంగళ్ (తమిళ కావ్యములు) మొదలైనవి ప్రసిద్ధములు. భాషాతత్త్వశాస్త్రమునకు సంబంధించిన గ్రంథములలో ము. వరదరాజన్ "రచించిన మొళివరలాఱు", "మొళినూల్"; వైయాపురి పిళ్లై వ్రాసిన "చొల్‌కలై విరున్దు" మున్నగునవి సంభావించదగినవి.

తమిళసాహిత్య చరిత్రను గురించి పలువురు పండితులు గ్రంథములు వెలయించారు. వారిలో వి.జి. సూర్యనారాయణశాస్త్రి (తమిళ్ మొళియిన్ వరలాఱు, తమిళ్‌ప్పులవర్ చరిత్తిరం), టి. ఎ. సదాశివ పండారత్తార్ (శతాబ్దముల వారీగా వెలువడిన తమిళ సాహిత్య చరిత్ర), రా. రాఘవ అయ్యంగారు (తమిళ్ మొళి వరలాఱు), యస్ రామస్వామి నాయుడు (తమిళి లక్కియం), మయిలై సీని వెంకటస్వామి (శమణముం తమిళుం, బౌద్ధముం తమిళుం), ము. వరద

రాజన్ (తమిళ్ ఇలక్కియ వరలాఱు), ము. అరుణాచలం (సమగ్ర తమిళ సాహిత్య చరిత్ర), ఎ.వి. సుబ్రహ్మణ్య అయ్యరు (తర్కాల తమిళ్ ఇలక్కియం), ప్రభృతులు పేర్కొనదగినవారు. వీరి రచనలు తమిళ సాహిత్య పరిశీలనకు ఎంతగానో ఉపకరిస్తాయి.

తమిళ భాషా సాహిత్యములను గురించి యం. యస్. పూర్ణలింగంపిళ్లై, తె. పొ. మీనాక్షి సుందరం, జేసుదాసన్, వైయాపురి పిళ్లై ఆంగ్లంలో గ్రంథ రచన కావించారు.

## జీవిత చరిత్ర

ఇతర ప్రక్రియలతో పోల్చి చూచినప్పుడు, జీవిత చరిత్రలు చాలా తమిళంలో వెలువడలేదని చెప్పడం సత్య సన్నిహితం. ప్రముఖ దేశభక్తుడైన వ. ఉ. చిదంబరంపిళ్లై తన భార్య జీవితకథను "వళ్లియమ్మై చరిత్తిరం" అనే పేరున పద్యాలలో వ్రాశారు సుప్రసిద్ధ విద్వాంసులైన ఉ. వే స్వామినాథయ్యరు తమ గురువయిన మీనాక్షిసుందరంపిళ్లై జీవితచరిత్రను అభివర్ణించారు. ఆ కాలపు ఇతర పండితులను గూర్చి తెలుసుకోడానికి కూడా ఈ జీవితచరిత్ర ఎంతైనా ఉపకరిస్తుంది. టాల్‌స్టాయ్ వంటి పాశ్చాత్య ప్రముఖుల్ని గురించి స్వామినాథశర్మ ప్రభృతులు అమూల్యములైన జీవిత చరిత్రలు వ్రాశారు. సుబ్రహ్మణ్య భారతిని గురించి వ రా., రా. పద్మనాభన్ మొదలైనవారు చక్కని పుస్తకాలు ప్రకటించారు ఈ సందర్భమున, ఎంతో శ్రమకోర్చి భారతి వచనరచనలను "భారతి తమిళ్" అనే పేర ఒక సంపుటంగా ప్రచురించిన పెరియసామి తూరన్ కృషి ప్రశంసనీయం.

మ. పొ. శివజ్ఞానం మధురమోహనమైన శైలిలో వీరపాండ్య కట్టబొమ్మన్, కప్పలోట్టియ తమిళన్ (ఓడ నడిపిన తమిళుడు - వ. ఉ. చిదంబరంపిళ్లై) మొదలైన జీవిత చరిత్రలు వెలయించారు. రామలింగ స్వామిని గురించి ఆయన సంతరించిన గ్రంథం అమూల్యమయింది. కి. చంద్రశేఖరన్ బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన కృష్ణస్వామి అయ్యరుని గురించి వ్రాశారు.

ప్రముఖ వైద్యుడూ అశేష శేముషీ సంపన్నుడూ అయిన డాక్టర్ రంగాచారిని గురించి రాజిరి కృష్ణన్ రచించిన ఉద్గ్రంథం ఆధునిక జీవిత చరిత్రలకు తలమానిక మనవచ్చు. ఇంకా పలువురు ప్రముఖ దేశభక్తులు, కవులు, సంఘ సంస్కర్తలు మొదలైన వారిని గురించి జీవిత చరిత్రలు చిన్నవీ పెద్దవీ వెలయించారు. అ. వె. నటరాజన్ ఎంతో శ్రమించి మహాపురుషులను గురించి జీవిత చరిత్రలు వెలయించారు. సుప్రసిద్ధ రచయిత పి. శ్రీ. రామానుజాచార్యులవారి జీవిత చరిత్రను సాధికారంగా వ్రాశారు.

## స్వీయ చరిత్ర

తమిళంలో వెలువడిన స్వీయ చరిత్రల సంఖ్యా అత్యల్పం వెలువడిన వాటిలో కొన్ని మంచివే ఉండడం గమనించదగిన అంశం. 'తమిళ తాత' అని పేరు గడించిన ఉ. వే. స్వామినాథయ్యరు వ్రాసుకున్న 'ఎన్ చరిత్తిరం' (నా చరిత్ర), తిరు. వి. కల్యాణ సుందర ముదలియార్ వ్రాసుకున్న 'వాళ్కైక్కుఱిప్పుగళ్' (జీవిత సూచనలు), నామక్కల్ రామలింగం పిళ్లైగారి స్వీయ చరిత్ర మొదలైనవి పేర్కొనదగినవి.

## ఆధునిక విజ్ఞానం మొదలైనవి

సాహిత్య మనగా కథలూ కాకరకాయలు కాదనే భావం ఇపుడిపుడు క్రమ క్రమంగా తొలగిపోతున్నది. ఆధునిక విజ్ఞాన శాస్త్రమును గురించి తమిళంలో రచన చెయ్యాలనే అభిలాష రచయితలలో బలీయంగా ఉన్నది. తత్ఫలితంగా కొన్ని మంచి రచనలు వెలుగులోకి వచ్చినవి. యస్. శివపాద సుందరం వ్రాసిన 'ఒలిపరప్పుక్కలై' శబ్దప్రసారమునకు సంబంధించిన బృహద్రచన. పి. యస్. అప్పుస్వామి ప్రభృతులు విజ్ఞానశాస్త్ర సంబంధములైన చక్కని రచనలు చేశారు. ఎ. కె. చెట్టియార్ వ్రాసిన ఉలగం చుట్రియ తమిళన్ (ప్రపంచం పర్యటించిన తమిళుడు) ప్రశస్తమైన ప్రయాణగ్రంథం. ఆయన యిటువంటివే మరి కొన్ని పుస్తకాలు వ్రాశారు. మీ. ప. సోమసుందరం తన లండన్ పర్యటనానుభవములను చక్కని శైలిలో "అక్కరై చ్చీమైయిల్" (ఆవలి గట్టునున్న

సీమలో) అనే ప్రయాణగ్రంథం వ్రాశారు. ఇంకా సి, సుబ్రహ్మణ్యం, యస్. డి. సుందరవడివేలు, మణియన్, అ. ము. పరమశివానందం మొదలైనవారు ప్రయాణగ్రంథములు సంతరించారు.

తమిళనాడులోని వివిధ మండలములను గురించీ ప్రజాజీవితమును గురించీ ప్రశస్తములైన పుస్తకాలు ప్రచురించారు సోమ. లె. అనబడే యస్. యం. లక్ష్మణన్. కుట్టుకళను గూర్చి కుయిలి రాజేశ్వరి మంచి పుస్తకం వ్రాశారు.

లేఖా సాహిత్యంకూడా కొంతవరకు తమిళంలో అభివృద్ధి చెందింది. సి. యస్. అణ్ణాదురై, ము. వరదరాజన్ మరికొందరు లేఖలలో తమిళసంస్కృతి మొదలైనవాటిని గురించి వివరించారు.

సుప్రసిద్ధక్షేత్రములను గురించి ఆకర్షకమైన శైలిలో భరణీధరన్ ఎన్నో వ్యాసములు ప్రకటించారు. వీరి కస్తూరితిలకం (కస్తూరిబాయి జీవిత చరిత్ర) ఒక ప్రశస్తరచన. సదాశివపండారత్తార్, నాగస్వామి ప్రభృతులు శాసనములకూ గుళ్లు గోపురములకూ సంబంధించిన వ్యాసము లెన్నో ప్రకటించారు. సాహిత్య గ్రంథాలతో పాటు చారిత్రక రచనలుకూడా ప్రకటించారు మ. రాజమాణిక్కం, అ. కి. పరంధామనార్ మొదలైనవారు.

## బాల సాహిత్యం

అతి ప్రాచీనమైన బాలసాహిత్యంలో కృషిచేస్తున్న తమిళ రచయితలు ఎందరో మనకు కనిపిస్తారు. బాలసాహిత్యమును ప్రోత్సహిస్తున్న పత్రికల సంఖ్య నానాటికి ఎక్కువవుతున్నది. అలాగే బాలసాహిత్యమును ప్రకటించే పుస్తక ప్రకాశకులూ చాలామంది ఉన్నారు. అంతేకాదు. 1950లో బాలల రచయితల సంఘం (కుళన్దై ఎళుత్తాళర్ సంగం) మదరాసులో స్థాపించబడింది. నాటినుంచీ నేటిదాకా ఈ సంఘం బాలవాఙ్మయమునకు ఎనలేని సేవ చేస్తూనే వున్నది. బాలసాహిత్య మహాసభలు నిర్వహించడం, బాలసాహిత్య నిర్మాతలను సముచిత రీతిని గౌరవించడం, బాలసాహిత్యంగురించి పరిశోధన మొదలైన వాటిని జరిపించడం మొదలైనవి ఈ సంఘ కార్యకలాపాలు. బాలసాహిత్య రచ

యితలు ఎవరెవరు? అనే పుస్తకం కూడా ప్రకటించింది. తమిళంలో వెలువడిన పిల్లలపుస్తకాల పట్టిక నొకదానిని తయారు చేసింది. బా సాహిత్యం గురించి ఒక పరిశీలన జరిపి పిల్లల అభిరుచులూ మొదలైన వాటిని గ్రహించేందుకు తోడ్పడింది. ఈ సంవత్సరం ఈ సంఘం రజతోత్సవం జరుపుకుంది. దీని స్థాపకులు అళ. వళ్లియప్ప. బాలవాఙ్మయ వికాసమునకు ఆయన చేసిన కృషి అభినందనీయం.

తమిళ బాలసాహిత్య మన్నప్పుడు సుబ్రహ్మణ్య భారతి పేరు తొలుత స్ఫురణకు వస్తుంది. పిల్లలకోసం ఆయన గేయములు వ్రాశారు; కథలూ కల్పించారు. మచ్చుకి ఒకటి రెండు గేయములు.

వేదము వెలసిన దేశమిది – మేటి
వీరులు పుట్టిన దేశమిది.
అఖండ హిందూస్థాన మిది – దైవ
మనుచు పూజింపుము దీనిని పాపా.

జాతులు లేవే పాపా – కులమున
హెచ్చుతగ్గులు ఎంచుట పాపము
నీతీ న్యాయము విద్యాబుద్ధులు
గలవారే జాత్యధికులు.

కల్లలాడకు పాపా – ఎన్నడూ
సాడీలు చెప్పకు పాపా.
దేవుడే మనల కాపాడు పాపా – ఎట్టి
కీడూ వాటిల్లదు పాపా.

చక్కని ఆట లాడుము పాపా – నువ్వు
సోమరివై ఉండకు పాపా.
కలిసి మెలిసి ఆడుము పాపా – ఒక్క
రినీ నిందించకు పాపా.

చిట్టి పిచ్చుకవలె నువ్వు
తిరగాలి ఎగరాలి పాపా.
పులుగులు పిట్టలు చూసి నువ్వు
మురిసిపోవాలి పాపా.

కవిమణి దేశిక వినాయకం పిళ్లై కూడా బాలబాలికల్ని ఉద్దేశించి చక్కని గేయములు ఎన్నో వ్రాశారు. కాకిని గురించి ఆయన చెప్పిన గేయం:

కాకీ కాకీ ఎగురుచు రావె
కళ్లకు కాటుక తీసుకు రావె.
కోడీ కోడీ కూయుచు రావె
పాపకు పూలూ తీసుకు రావె.

తెల్లని ఆవా వెంటనె రావె
పిల్లకు పాలూ తీసుకు రావె.

కోడిని గురించి యీ కింది గేయం ఆయన వ్రాశారు

కోడీ కోడీ రా, రావె
కొక్కొ్కరొకో మంటూ రావె
కోడీ పరుగిడి రా, రావె
పూలను చూపగ రావె.

పోడిచీ యుద్ధం చేయుటకో
చెత్తను కుళ్ల గించుటకో
కత్తుల వంటివి కాలికి వేళ్లు
దేవుడు నీకూ ఇచ్చాడు.

పొద్దున పూట కూయుచు మమ్ము
నిద్దుర నుంచీ లేపెదవు

చక్కగ పనులు చేయగ మమ్ము
లేపెదవు, మా మంచికోడి.

దేశిక వినాయకం పిళ్లై ఆవును గురించి ఒక పెద్ద గేయం వ్రాశారు. అందులోంచి కొన్ని పంక్తులు :

తీయని పాలూ యిచ్చేవు - పొలానికి
మంచి ఎరువూ యిచ్చేవు.
బండిని లాగే ఎద్దుని - చక్కగ
పెంచీ పెద్ద చేసేవు.

తల్లిలేని పిల్లలకు తల్లివయ్యేవు - వ్యాధితో
తల్లడిల్లు వారికి మందు వయ్యేవు.

కవిమణి భావసంపదను గ్రహించడానికి పై పంక్తులు తోడ్పడగలవు.

కా. నమశ్శివాయ ముదలియారు, మణి తిరునావుక్కరసు ముదలియారు, మయిలై శివముత్తు, పెరియస్వామి తూరన్, తణికై ఉలగనాదన్, తి. జ. ర. (తి. జ. రంగనాథన్), పె. నా. అప్పుస్వామి, యన్. నటేశన్ (రాజి), అళ. వళ్లియప్ప, పూవణ్ణన్ (వి. డ. గోపాలకృష్ణన్), సుందర వడివేలు, వైత్తణ్ణా, కల్వి గోపాలకృష్ణన్, శబరిరాజన్, "ఆర్వి" తంబి శ్రీనివాసన్, నాగముత్తయ్యా, కె. జయలక్ష్మి. కామాక్షి శ్రీనివాసన్ ప్రభృతులు పిల్లలకోసం కమ్మని కవితలూ చక్కని కథలూ ఎన్నెన్నో సంతరించారు. బాలసాహిత్య ప్రకాశకులుగా కూడా పారినిలయం, కలైమగళ్ కార్యాలయం, తమిళ్ పుత్తకాలయం, శైవసిద్ధాంత పుస్తక ప్రకాశక కళగం మొదలైన సంస్థలు ప్రసిద్ధి కెక్కినవి.

పిల్లలకు కథలు చెప్పడంలో తి. జ. ర. అందెవేసిన చెయ్యి. విజ్ఞాన శాస్త్రాదివిషయములు వివరించడంలో కల్వి గోపాలకృష్ణన్, అప్పుస్వామి మొదలైనవారు సిద్ధహస్తులు. కమ్మని కవితలు వెలయించడంలో పెరియస్వామి తూరన్, అళ. వళ్లియప్ప ప్రభృతులు పైవువాటము లెరిగినవారు. ఈ మధ్య పూరణ్ణన్ తమిళ బాలసాహిత్య చరిత్రను వివరించే పుస్తకం వ్రాశారు. కాగా,

బాలసాహిత్యమునకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉన్నదని నిస్సంశయంగా పేర్కొన వచ్చు.

పెరియస్వామి తూరన్ గురించి రెండు మాటలు: ఆయన కవి. తమిళ విజ్ఞాన సర్వస్వమునకు ప్రధాన సంపాదకులు. ఆయన సంపాదకత్వమున బాల విజ్ఞాన సర్వస్వం కూడా వెలుగులోకి రావడం ఎంతైనా కొనియాడదగిన అంశం. విమానం గురించి ఆయన వ్రాసిన గేయం.

రెక్క లల్లార్చకుండా
గగన వీథికి లేచెదను
పక్షివోలె పై కెగిరెదను
మీకు సంతోషం కలగగా.

మెరుపు తీగలా వేగంగా
నే నెగిరి వెడుతున్న
ఎంద రెందరినో నాలో
ఎక్కించుకు వెళ్లెదను.

ఏమీ పండని ఎడారినీ
కొండలు, కడలిని దాటి
రెండు రోజులలో ప్రపంచం
తిరిగి వచ్చేను నేను.

నీలాకాశంలో ఎగరడమూ
ఎంతో దూరం వెళ్లడమూ
నాకు సంబరం ప్రతిరోజూ –
మంచి పాపవు, నాతో రావా.

తమిళ బాల సాహిత్యానికి తన రచనాశక్తిని పూర్తిగా వినియోగిస్తున్న అళ. వళ్లియప్ప ముఖ్యంగా కవి. "మలరుం ఉళ్లం" అనే ఆయన కవితా సంపుటం పేర్కొనదగింది. మహాపురుషుల జీవిత కథలను మనోజ్ఞమైన శైలిలో తెలియ

జేశారు. మణిక్కుమణి అనే పిల్లల నవలను కూడా వ్రాశారు. మచ్చుకి రెండు గేయములు:

చదువుకుందాం

తేనె ఉన్న చోటు వెదుకుచు
ఎగిరి వచ్చు తుమ్మెదలా
పంచదార ఉన్న తావుని
చేరుకొనెడు చీమలా

పండ్ల చెట్లు ఉన్న తోటకు
పరుగు లెత్తు చిలుకలా
సిరులు కులుకు దేశమునకు
చేరునట్టి ప్రజలా

పల్లమెరిగి గలగల మంటూ
ప్రవహించు వరదలా
మంచిమంచి పుస్తకాలు
వెదికి వెదికి చదువుకుందాం.

ఇల్లు కడదాం

ఇటుకలు వద్దు సిమెంటు వద్దు
డబ్బాదస్కాం ఆసలే వద్దు
త్వరలోనే అందమైన యిల్లు
తయారవుతుంది తమ్ముడూ.

ఇనుమూ వద్దు కలపా వద్దు
ఏమీ వద్దనే వద్దు తమ్ముడూ
అతి త్వరగా మనమూ కట్టవచ్చు
అందమైన యిల్లొకటి తమ్ముడూ.

వడ్రంగి వద్దు తాపీమేస్త్రీ వద్దు
పనివారితో అసలే పనిలేదు
దొంగలు లోనికి రాలేరు.
చీకు చింతలు వద్దు తమ్ముడూ.

తాళపు చెవి వద్దు తాళము వద్దు
గొళ్లెం గిళ్లెం అసలే వద్దు
సర్కారు వారికి యింటిపన్ను
కట్ట నవసరం లేదు తమ్ముడూ.

డబ్బాదస్కాం పనిముట్లకోసం
దిగులెందుకు తమ్ముడూ
కడలి యొడ్డున ఇసుకయిల్లు
కట్టాలంటే తమ్ముడూ.

ఈ సందర్భంలో మదరాసులోని దక్షిణ భాషా పుస్తక సంస్థవారు బాల వాఙ్మయాభివృద్ధికి చేసిన కృషిని ప్రశంసించక తప్పదు. మంచి మంచి పుస్తకాలు, చక్కని బొమ్మలతో, ఎన్నో ప్రకటించారు. పిల్లల పుస్తకాల పోటీలు నిర్వహించారు. పోటీలలో నెగ్గిన బాలకథలను ఇతర దక్షిణాది భాషలలోకి అనువదించారు.

## తమిళ పత్రికలు

ఈనాడు రేడియోవలె, పత్రికలు కూడా సాహిత్యాభివృద్ధికి తోడ్పడుతున్నవి; రచయితలను ప్రోత్సహిస్తున్నవి. కనుక సాహిత్య పరిశీలన చేసేటప్పుడు, పత్రికలను గురించి కూడా దిఙ్మాత్రంగానైనా తెలుసుకోవడం సముచితం. 4

తొలుత తమిళంలో మతసంబంధమైన పత్రికలు వెలుగులోకి వచ్చినవి. 1875లో స్నేగబోదన్ అనే క్రైస్తవమత పత్రిక వెలువడింది. ఆ తర్వాత వేద విళక్కన్ (1890), వేదబోద మాద తోళి (1929) మొదలైన పత్రికలు వెలువడినవి. 1883లో హిందుమత సీర్‌తిరుత్తి అనే పత్రిక వెలుగు చూసింది.

సిద్ధాంతం (1912), ద్రావిడ భాగవతన్ (1914), రామానుజన్ (1918) మొదలైనవి కాలక్రమాన వెలువడినవి. అలాగే ఇస్లాం నేశన్ (1909) మొదలైన మహమ్మదీయమత పత్రికలు కూడా వచ్చినవి. ఆయా కులములకు సంబంధించిన పత్రికలు కూడా వెలువడినవి. శాన్డోర్ కులవివేక బోధిని (1909), వన్నియ (వహ్ని) కులక్షత్రియ దీపం (1912), ఆర్యవైశ్యాభిమాని (1914) మొదలైనవి యీ కోవకు చెందినవి.

నానాటికి మన దేశంలో రాజకీయ చైతన్యం ఎక్కువయ్యేకొద్దీ, వివిధ భారతీయ భాషలలో దిన, వార, మాస పత్రికలు మొదలైనవి ప్రచారంలోకి వచ్చినవి. అలా వచ్చిన వాటిలో దినవర్తమాని (1852) మొట్ట మొదటిది. ఆ తర్వాత, 1880లో సుదేశమిత్తిరన్ (స్వదేశ మిత్రన్) వార పత్రికగా వెలువడింది. క్రమక్రమంగా అది వారానికి మూడుసార్లు వెలువడుతూ చివరికి దిన పత్రికగా వెలువడసాగింది. నేటికీ ఇది ప్రచారంలో ఉండడం గమనించదగిన విషయం. దీని స్థాపక - సంపాదకులు జి. సుబ్రహ్మణ్య అయ్యరు. ఆయన దేశ భక్తుడు; సంఘ సంస్కరణాభిలాషి. ఈ పత్రికలో తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి 1904, నవంబరులో సహాయ సంపాదకుడుగా చేరారు. భారతి నిజమైన సారస్వత జీవితం ఆ సంవత్సరంనుంచే ప్రారంభమైనట్లు కొందరి అభిప్రాయం.

మంచిమాటలతో పని చేయించుకోవడంలో సుబ్రహ్మణ్య అయ్యరు ఘటికులట! ఈ విషయమును భారతి ఒకచోట ఇలా తెలియజేశాడు. ఏదైనా అవసరమైన పని వచ్చినప్పుడు అయ్యరుగారు, "భారతి! నువ్వు చక్కని తమిళం వ్రాస్తావు. నీకు అక్షరలక్షలు ఇవ్వవచ్చు. నువ్వు కాళిదాసంతటివాడివి. కాని నేను భోజమహారాజును కానుగదా మరి! నీకు తగిన సనా ం చెయ్యగల ఆర్థిక స్తోమత నాకు లేదు." అనేవారట. ఇలా పని చేయించుకున్నా సుబ్రహ్మణ్య అయ్యరుని గురించి ప్రస్తావిస్తూ భారతి యిలా పేర్కొన్నాడు. "పత్రికారంగములో నాకు శిక్షణా అనుభవమూ కలుగుటకు కారకులు ఆయనే. అయన్ని నేను ఒక విధంగా నా గురువని భావిస్తున్నాను." ఆరోజుల్లో దినపత్రికను స్థాపించి, పత్రికారచనలో మార్గదర్శకత్వం వహించిన సుబ్రహ్మభణ్య అయ్యరు బహుధా ప్రశంసార్హులు. [5]

ఆ తర్వాత తిరు. వి. కల్యాణసుందర ముదలియారు దేశభక్తన్ అనే దిన పత్రికను స్థాపించారు. ఆయన చేతిలో తమిళ పత్రికా రచన అందాలు దిద్దుకున్నది. ప్రసిద్ధ దేశభక్తులైన డాక్టర్ పి. వరదరాజులు నాయుడు సంపాదకులుగా ఉన్న తమిళనాడు అనే దిన పత్రిక మదరాసునుంచి చాలాకాలం వెలువడింది. మొదట్లో అది వార పత్రికగా ఉండేది. రాయ చొక్కలింగం అనే విద్వత్కవి సంపాదకత్వంలో ఊళియన్ అనే దిన పత్రికా, జయభారతి, సుయరాజ్య (స్వరాజ్య) మొదలైన జాతీయ వారపత్రికలూ మదరాసునుంచి వెలువడినవి. టి. యస్. చొక్కలింగం సంపాదకులుగా గాంధి, ఇందియా, దినమణి, దినసరి మొదలైన దినపత్రికలు వెలువడినవి. ఆ తర్వాత కాలక్రమాన నవయుగం, భారతదేవి, దినతంతి, దారుల్ ఇస్లాం, ఎంగళ్ నాడు, నంనాడు, తమిళ్‌నాడు, నవ ఇందియా, నవమణి, దినమలర్, జనశక్తి, మురసొలి మొదలైన దిన పత్రికలు వెలుగు చూచినవి. వీటిలో కొన్ని రాజకీయ పక్షములకు చెందిన పత్రికలు.

ఈ సందర్భంలో పత్రికా సంపాదకుడుగా కూడా సుబ్రహ్మణ్య భారతిని గురించి తెలుసుకోవడం సమంజసం. అప్పుడే ఆయన బహుముఖమైన సేవను గ్రహించడానికి వీలు కలుగుతుంది. స్వదేశమిత్రన్‌లో పని చేసే రోజులలో, తన వ్యక్తిగతాభిప్రాయములను నలుగురికి నిర్భయంగా తెలియ జేయాలనే సంకల్పం ఆయనకి కలిగింది. తత్ఫలితంగా భారతి 1950లో చక్రవర్తిని అనే మాస పత్రికను ప్రారంభించాడు. ఆ మరుసటి సంవత్సరం ఇందియా అనే వార పత్రికను ఆరంభించాడు. స్వాతంత్ర్యం, సమత్వం, సహోదరత్వం - ఇవే ఆ పత్రిక ఆశయాలు. విడి ప్రతి వెల ఒక్క అణా. కాని సాలుచందా వివరాలు వింత గొలుపుతాయి. పరికించండి.

| | | | |
|---|---|---|---|
| ప్రభుత్వమునకు | ... | ... | రూ. 50-00 |
| జమీందారులు, సంస్థానాధిపతులు మొదలైన వారికి | | | రూ. 30-00 |
| నెలకు రూ. 200-00 పైబడి ఆదాయం గలవారికి | | | రూ. 15-00 |
| కడమ వారికి | ... | ... | రూ. 3-00 |

ఇండియా పత్రిక మొదట మదరాసునుంచీ, ఆ తర్వాత పుదుచ్చేరినుంచీ వెలువడేది.

సాహిత్య మాసపత్రికలు కూడా ఎన్నో వెలువడినవి. మాదర్ మిత్రి (1889), మహారాణి (1887), చక్రవర్తిని (1905), మాదర్ బోదిని (1911) మొదలైనవి తొలినాళ్లలో వెలువడినవి. ఇవి మహిళల పత్రికలుకూడా. ఆ తర్వాత ఆనందబోదిని, ఆనంద గుణబోదిని, వివేక చింతామణి, జనాభిమాని, చెందమిళ్, చెందమిళ్ చ్చెల్వి, తమిళ్ పొప్పొళిల్, కలై మగళ్ (1923), తామరై మొదలైనవి ప్రచారంలోకి వచ్చి, యథోచితంగా సాహిత్య సేవ చేసినవి.

చెందమిళ్ పత్రికను గురించి రెండుమాటలు చెప్పడం సమంజసం. ఈ సాహిత్య పత్రిక మధురలో స్థాపించబడింది. దీని తొలి సంపాదకులు రా. రాఘవ అయ్యంగారు. ప్రాచీన పద్ధతి ప్రకారం తమిళ భాషా సాహిత్యాలు అధ్యయనం చేసిన పండితు డాయన. అమూల్యమైన సాహిత్యవ్యాసము లెన్నో ఆయన ఆ పత్రికలో ప్రకటించారు. మహాపండితుడైన ము. రాఘవ అయ్యంగారుకూడా ఆ పత్రికకు సంపాదకులు కావడం గమనించ దగిన అంశం.

అలాగే కలైమగళ్ కూడా సాహిత్యసేవ చేస్తున్న ప్రముఖ పత్రిక. దీనికి చాలాకాలంగా సుప్రసిద్ధ రచయిత అయిన కి. వా. జగన్నాథన్ సంపాదకులుగా ఉన్నారు. సాహిత్య వ్యాసములను ఆదరించడంతో పాటు ఉత్తమ నవలారచనను కూడా ప్రోత్సహిస్తున్నది. ఈ పత్రికా నిర్వాహకులే మంజరి అనే ఉత్తమ సాహిత్య పత్రికను (Literary Digest) నడుపుతున్నారు. ఇతర దేశభాషా పత్రికలలో ప్రచురితము లయ్యే ఉత్తమ వ్యాసములను తమిళం చేసి యిందులో ప్రకటిస్తున్నారు. అంతేకాక ఉత్తమ గ్రంథములను కుదించి ఆ సంగ్రహములను కూడా ప్రచురిస్తున్నారు. ఈ కోవకు చెందిన సాహిత్య పత్రిక తెలుగులో లేదని నా అభిప్రాయం. ఈ పత్రికకు ప్రస్తుత సంపాదకులు త. నా. సేనాపతి. ఈయన బహుభాషాభిజ్ఞుడైన రచయిత.

మరొక ప్రముఖ సాహిత్య పత్రిక దీపం. దీని సంపాదకులు నా. పార్థసారథి. ప్రసిద్ధ రచయిత అయిన పార్థసారథి బహుగ్రంథకర్తలు. ఎన్నో నవ

అలూ కథానికా సంపుటములూ వెలువరించారు. అలాగే కనై యాళి మొదలైనవి ఆధునిక సాహిత్యమును ప్రోత్సహించే పత్రికలు.

కేవలం కథలకోసమే పుట్టినవా అన్నట్లు కొన్ని పత్రికలు వెలువడినవి. సర్వజన రంజని (1911), నావల్ (1918), మనోరంజని (1920), కథారంజని (1922) మొదలైనవి ఈ వర్గమునకు చెందినవి.

అలాగే హాస్యరస ప్రధానములైన కొన్ని పత్రికలు వెలుగులోకి వచ్చినవి. ఆనంద వికటన్, ఆనందవిజయ వికటన్, ప్రచండ వికటన్, వసంత వికటన్, కుమార వికటన్, కుఱుంబన్ మొదలైనవి. వీటిలో నేటికీ ప్రచురప్రచారంలో ఉన్న పత్రిక ఆనందవికటన్. ఇందులోని వ్యంగ్య చిత్రాలు కడుపుబ్బేటట్లు నవ్విస్తాయి. దీని తొలి సంపాదకులు వికటకవి వైద్యనాథయ్యరు. ఆ తర్వాత దీనిని సుప్రసిద్ధ చలనచిత్ర నిర్మాత యస్. యస్. వాసన్ నిర్వహించారు. ప్రచండ వికటన్ సంపాదకులైన నారాయణ దురైక్కణ్ణన్ కథానికలూ నవలలూ సంతరించారు. నూతన సాహిత్య ప్రక్రియలకు దోహద మిచ్చిన సహృదయులు.

నేటి హాస్యరస ప్రధాన పత్రికలలో ముఖ్యంగా చెప్పదగింది "చో" నిర్వహిస్తున్న "తుగ్లక్". రాజకీయ విషయములను వ్యంగ్యంగా చిత్రించడంలో ఈ పత్రిక విజయం సాధించిదని చెప్పవచ్చు.

నేడు ప్రచుర ప్రచారంలో ఉన్న తమిళ వార పత్రికలలో కల్కి, కుముదం - రెండూ పేర్కొనదగినవి. 1941, అగస్టులో కల్కిని టి. సదాశివన్, సుప్రసిద్ధ రచయిత అయిన "కల్కి" రా. కృష్ణమూర్తి, ప్రారంభించారు. రాజాజీ, టి. కె. సి. ప్రభృతులు అండగా నిలిచారు. తమిళనాడులో పత్రికాపఠనాసక్తిని కల్పించిన కీర్తి కల్కికి చెందుతుంది. "కల్కి" నవలలు త్యాగభూమి, శివకామియిన్ శపథం ధారావాహికంగా ఈ పత్రికలో ప్రచురితమయ్యే రోజులలో, వారం వారం ప్రతులకోసం సాహితీ ప్రియులు క్యూలో నిలబడేవారు. కాగా పఠనాసక్తిని - ముఖ్యంగా మహిళలలో-ఆ విధంగా ఈ పత్రిక

ఎక్కువ చేసింది. ఉత్తమ నవలల ప్రచురణతోపాటు, కల్కి చక్కని హాస్యము ను కూడా తమిళ పాఠక లోకమునకు అందించింది. కి రాజేంద్రన్, యస్. వి. యస్. (యస్. వెంకట సుబ్రహ్మణ్యం) ప్రభృతులు ఈ పత్రికకు సంబంధించిన వారే. తొలుత ఇది పక్ష పత్రికగా ఉండేది.

ఒక్క తమిళంలోనే కాదు, ఇతర భారతీయ భాషలలోనూ అత్యధిక ప్రచారం కల పత్రిక కుముదం. దీనిని సుమారు నాలుగున్నరలక్షల మంది చదువు తున్నారు. దీని సంపాదకులు యస్. ఎ. పి. అణ్ణామలై. ప్రముఖ వార పత్రికలలో "దినమణి కదిర్"కి కూడా స్థాన మున్నది.

ఇక బాలల పత్రికలూ ఎన్నో వెలువడుతున్నవి. బాలియర్ మిత్తిరన్ (1911), బాలవినోదిని (1918), బాల చింతామణి (1935), అంబులిమామా (చందమామ), పాప్పా, కణ్ణన్, కల్కండు, గోకులం మొదలైనవి ఈ కోవకు చెందినవి.

పైవి కాక వ్యవసాయం, విజ్ఞానశాస్త్రం, చలనచిత్ర పరిశ్రమ మొదలైన వాటికి సంబంధించిన పత్రికలూ ఎన్నో వెలువడుతున్నవి.

దక్షిణ భాషాపుస్తకసంస్థ ఆధ్వర్యవంలో యునెస్కో కూరియర్ తమిళంలో వెలువడడం ఒక విశేషం. హిందీ తప్ప ఏ యితర భారతీయ భాషలోనూ ఈ అంతర్జాతీయ పత్రిక వెలువడడం లేదు. దీని ప్రస్తుత సంపాదకులు యం. మహ్మద్ ముస్తఫా.

1971 లెక్కల ప్రకారం తమిళంలో 572 పత్రికలు వెలువడుతున్నట్లు తెలియవస్తున్నది. ఈ కింది వివరాలు పరిశీలించ దగినవి.

| | తెలుగు | తమిళం |
|---|---|---|
| దినపత్రికలు | 13 | 45 |
| వార పత్రికలు | 96 | 74 |
| పక్ష పత్రికలు | 54 | 210 |
| మాస పత్రికలు | 210 | 243 |
| మొత్తం | 373 | 572 |

తమిళనాడు నుంచి వివిధ భాషలలో వెలువడే పత్రికల సంఖ్య 1,077 కాగా ఆంధ్రప్రదేశ్ నుంచి 647 మాత్రమే వెలువడుతున్నవి.

---

1. నాటక లక్షణములను తెలియజేసే గ్రంథ మిది. దశరూపకము ననుసరించి యిది వ్రాయబడిందనవచ్చు. దీనికి కర్త వి.జి. సూర్యనారాయణ శాస్త్రి. న. బలరామ అయ్యరు దీనికి చక్కని వివరణ వెలయించారు.

2. చూడుడు : వి. జి. సూర్యనారాయణ శాస్త్రి గారి "తమిళ్ మొళియిన్ వరలాఱు", పుట 56. చెన్నపురి క్రైస్తవ కళాశాలలో ఆయన చాలా కాలం తమిళ పండితులుగా పని చేశారు. బహు గ్రంథకర్త. తమిళ భాషాభిమానం కొద్దీ ఆయన తన పేరుని పరిదిమాఱ్ కలైజర్ అని మార్చుకున్నారు. 33 యేండ్లు మాత్రమే ఆయన జీవించారు (1870-1903).

3. పరిశోధన.

4. వివరములకు నా సుబ్రహ్మణ్య భారతిని చూడుడు: పుటలు 11-14.

5. ఇంకా వివరములకు చూడుడు: మా. సు. సంబందన్ వ్రాసిన వ్యాసం, భారతి, 1960.

# 8. ఉపసంహారము

తమిళ భాషా సాహిత్యములు బహు ప్రాచీనములు. ఇది నిర్వివాదాంశం. అయినప్పటికీ సంస్కృతభాషాసాహిత్యముల ప్రభావం తమిళం మీద లేక పోలేదు. మొదటినుంచీ తమిళులు సంస్కృత శబ్దములను తమభాషా స్వభావం అనుసరించి తమిళం చేసుకున్నారు. ఆ విధంగా సంస్కృత శబ్దములను ఉప యోగించినా, సంస్కృతమును ఆ పేరుతో పిలువక వడమొళి అని వ్యవహ రించినా, తమిళులకు మొదట్లో సంస్కృతభాషా సాహిత్యముల పట్ల ద్వేషభావం ఉన్నట్లు చెప్పలేము. ఇతర భారతీయ భాషలవలె, తమిళం కూడా రామాయణ, భారతాదులనుండి ఇతివృత్తములు గ్రహించింది. సంగయుగపు సారస్వతంలోనే రామకథా ప్రశంస కనిపించడం, ఆ నాళ్లలోనే భారతం తమిళ సాహిత్యంలో చోటు చేసుకోవడం మొదలైన విషయాలు పరిశీలించదగినవి. అంతమాత్రాన సంగయుగపు తమిళసాహిత్యమునకు ప్రత్యేకత లేదని భావించరాదు. అది అంతగా మత ప్రసక్తి లేనిది. పైగా సంగయుగంలో సంకలన కృతులు వెలువ డడం మరొక విశేషం. కవయిత్రులు కూడా కొందరు వర్ధిల్లినట్లు తెలియవస్తున్నది. అయితే తమిళంలో చంపూకావ్యరచనా పద్ధతి చాలా ఆలస్యంగా ప్రచారంలోకి వచ్చింది.

నేడు నామమాత్రంగా ఉన్న ఐంద్రవ్యాకరణము ననుసరించి ప్రశస్త లక్షణ గ్రంథమైన తొల్కాప్పియం సంతరించబడినట్లు భావించబడుతున్నది. తొల్కాప్పియ రచనాకాలం క్రీ.పూ. మూడవ శతాబ్ది అని కొందరి అభిప్రాయం. పూర్వు లీ విధంగా పేర్కొన్నారు, ప్రాచీన గ్రంథాలలో ఇలా పేర్కొన బడింది- అని తొల్కాప్పియం కర్త చాలా చోట్ల చెప్పినందువల్ల, ఆ లక్షణ గ్రంథం వెలుగులోకి రాక పూర్వమే తమిళంలో సాహిత్యం ప్రచారంలో ఉండి వుండాలని తమిళ పండితుల విశ్వాసం. నిజమే కావచ్చు. అప్పటి గ్రంథము లన్నీ తరువాతి కాలంలో భ్రష్టములై ఉండవచ్చు. ఏది ఎలా ఉన్నా, ఐంద్రవ్యాకరణం తమిళ నాడులో ప్రచారంలో ఉండడం, అది తొల్కాప్పియ రచనకు తోడ్పడడం

గమనించ దగినవి. కాలక్రమాన, సంస్కృత శబ్దములను సంస్కృత భాషాభిజ్ఞు లైన జైన వైష్ణవ విద్వాంసులు తమ తమిళ రచనలలో యథేచ్ఛంగా ఉపయోగించారు. మణి ప్రవాళ మనే కొత్తశైలి వాడుకలోకి వచ్చింది.

కాని రాను రాను సంస్కృత శబ్దములను పరిహరించాలనే అభిలాష తమిళ రచయితలకు కలిగింది. కాని కొందరి వ్రాతలలో సంస్కృత శబ్దములు ఎన్నో చోటు చేసుకున్నవి. సంగకాలపు కవులలో కపిలర్, నక్కీ(త్కీ)రర్ మొదలైన వా రెందరో బ్రాహ్మణులు. తొల్కాప్పియనారు కూడా బ్రాహ్మణు డనే అభిప్రాయం ఒకటి లేకపోలేదు. నక్కీరుని గురించి ఒక ఉదంతం. కుయక్కోడన్ అనే కుమ్మరి ఆర్యం (సంస్కృతం) మంచిది, తమిళం మంచిది కాదన్నందుకు నక్కీరుడు ఎంతో నొచ్చుకున్నాడట! ఈ సందర్భంలో ఒక సంగతి చెప్పడం సమంజసం. ప్రాచీన తమిళవాఙ్మయంలో మనకు బ్రాహ్మణేతర కవులు పలువురు కనిపిస్తారు. తిరుక్కుఱళ్, సిలప్పదికారం, మణిమేకలై, పెరుంగదై(బృహత్కథ), జీవక చింతామణి, పెరియ పురాణం, (కంబ) రామాయణం, కందపురాణం, మొదలైనవి బ్రాహ్మణేతరకవుల రచనలే. వ్యాఖ్యాతలలో పలువురు బ్రాహ్మణులు.

సంస్కృతం దేవభాష అని మనం అనుకున్నా, ఆ భాష ఎన్నో ద్రావిడ భాషా శబ్దములను స్వీకరించిన విషయం పండితలోకమునకు తెలిసిందే. ఆ నాళ్లలో మన పెద్దలు ఇతరభాషా శబ్దములను తమ తమ భాషలలో చేర్చుకున్నారు. అలా శబ్ద సంపదను వృద్ధి చేసుకున్నారు. ఆరోగ్యకర మైన యీ లక్షణం భాషాభివృద్ధికి ఎంతైనా తోడ్పడుతుంది.

ఈనాడు అన్నికులాల వారిలోనూ అన్నిమతాల వారిలోనూ ఉత్తమ రచయితలు ఉండడం పేర్కొననగిన అంశం. కొందరు గ్రాంథిక భాషావాదులు; మరికొందరు వ్యావహారిక భాషావాదులు. గ్రాంథికవాదుల తమిళ శైలి మరీ మడి కట్టుకున్నట్టుగా ఉంటుంది. వీరి శైలిలో సంస్కృత శబ్దాలుగాని ఆంగ్లశబ్దాలు గాని కనిపించవు. ఈ శైలిని ఎక్కువగా ఆదరించేవారు పండితులు మాత్రమే అన్నా సాహసం కాదు. వాడుక తమిళంలో సంస్కృత శబ్దాలతోపాటు ఆంగ్ల శబ్దాలుకూడా వినిపిస్తూ వుంటాయి. వ్యావహారిక భాషావాదులు వీటిని పరిహరించరు. నవలలు, కథానికలు మొదలైనవి వ్రాసేవారిలో ముక్కాలు మువ్వీసం

మంది వ్యావహారిక భాషావాదులే. ముఖ్యంగా యువరచయితలు పలువురు వాడుక భాషను ఆదరిస్తున్నారు. కొందరు ఆయా జిల్లాలలో వాడుకలో ఉన్న భాషనే స్వీకరిస్తున్నారు. తమిళ శైలిలో ఈ మార్పుని తీసుకువచ్చిన రచయిత తమిళ నవయుగ ప్రవక్త అయిన సుబ్రహ్మణ్య భారతి అనక తప్పదు. కల్కి మొదలైన తరువాతి రచయితలు ఈ వాడుకభాషా వాదానికి అండదండగా నిలిచారు; బ్రహ్మరథం పట్టారు. కవితలో కూడా వాడుకభాషను చొప్పించిన కీర్తి భారతికే చెందుతుంది. ప్రాచీనత అన్నా, ప్రాచీన కవులన్నా ఆయనకి అభిమానం ఉన్నా, ఆ అభిమానం ఆయనలో దురభిమానంగా మారలేదు. అంతేకాక, ఆ అభిమానం భారతి నవ్యదృష్టికి అడ్డుగోడగా నిలవనూ లేదు. భారతి సాహిత్యంలో పాతకొత్తల మేలి కలయిక అలవోకగా చూచేవారికి సైతం కనిపిస్తుంది. అయినా, విశ్వవిద్యాలయములలోనూ పాఠశాలలలోనూ గ్రాంథిక తమిళంలో వ్రాయబడిన పుస్తకములనే పాఠ్యగ్రంథములుగా నిర్ణయిస్తున్నారు.

ఆధునిక తమిళ సాహిత్య వీథులు సుందరములూ సువిశాలములే అయినా, ఉత్తమ నవలలవలె, ప్రశస్తములైన కథానికలవలె కమ్మని కవితలు అంత విరివిగా వెలువడుటలేదని నా అభిప్రాయం. భారతి ప్రవేశపెట్టిన వచనకవిత యింకా ప్రయోగదశలోనే ఉన్నది. సంగకాలపు కవితలు, తర్వాత వెలువడిన పంచకావ్యములు, ఆ తర్వాత వెలువడిన కంబరామాయణం మొదలైన వాటితో పోల్చి చూసినప్పుడు ఈ వెలితి కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఉత్తమ కవితా సంప్రదాయములు కలిగిన తమిళ సాహిత్యంలో నేడు ఉత్తమ కవితలు విరివిగా కనిపించక పోవడం శోచనీయం. ఒకవేళ, ఈ సంప్రదాయపు బరువువల్ల ఇటువంటి పరిస్థితి యేర్పడిందేమో! కావచ్చు. కాని ఉత్తమ సాహిత్యం శూన్యంలోంచి ఏర్పడదు కనుక, ఈ సంప్రదాయ ప్రాబల్యం అత్యుత్తమ కవితా ప్రాదుర్భావమునకు తోడ్పడగలదని నా అభిప్రాయం.

తమిళం ఎంత ప్రాచీనమైనదో అంత ప్రధానమైన భాష. ఆధునిక తమిళ రచయితలలో ఉత్తమ కథకులూ నవలాకర్తలూ ఉన్నారు; ప్రతిభ గలవారున్నారు. అయినా, ఏ తమిళ రచనకూ భారతీయ జ్ఞానపీఠం వారి బహుమతి నేటివరకూ రాలేదు. ఈ కొరత త్వరలోనే తీరాలని నా కోరిక.

తమిళ పత్రికారంగం వలె, తమిళనాటక రంగస్థలం ఎంతో ప్రగతిని సాధించింది. రంగస్థల నాటకములు ప్రజల అభిమానమును చూరగొంటున్నవి కూడా. సామాజిక పరిస్థితులను సునిశితమైన హాస్యంతో మేళవించి నాటకములు ప్రదర్శిస్తున్నారు. కొన్ని రంగస్థల నాటములను రేడియో వారు ధారావాహికంగా ప్రసారం చేస్తున్నారు. అవి శ్రోతలను ఆకట్టుకుంటున్నవి. కాని సాహిత్యపు విలువ కల నాటకములు అంతగా లేవని చెప్పవచ్చు.

మొత్తంమీద, వేదతుల్యమైన తిరుక్కుఱళ్, రసవత్కావ్యము లైన సిలప్పదికారాది కృతులు, రసరామణీయకములకు కాణాచి అనదగిన కంబరామాయణం, ప్రౌఢ గంభీర భావ బంధురము లైన తిరుమూలర్ మొదలైన సిద్ధుల గేయములు, గరీయఃప్రతిభుడైన సుబ్రహ్మణ్యభారతి రచనలు మున్నగునవి తమిళ సాహిత్య సర్వతికి అమూల్య భూషణము లని నిస్సంశయంగా చెప్పవచ్చు. ప్రతి ప్రాంతీయ భాషా భారతీయ భాషే కనుక, ఈ తమిళ రచన లన్నీ భారతీయ సాహిత్య సుందరోద్యానంలో వికసించిన విరులు; సౌరభములు వెలార్చే సంపెంగలు; భారతీయు లందరూ ఈ పుష్ప సౌరభములను తనివితీరా ఆఘ్రాణించాలని నా అభిలాష.

# అనుబంధం 1

## తెలుగులో తమిళ రచనలు

అబ్దుల్ ఖాదర్ (వళరుం చుదర్) ఆకాశదీపం. అను: మధురాంతకం రాజారాం, పిల్లల నవల.

అవ్వైయార్ (నల్వాళి) నీతిభవనము. అను: క్రొత్తపల్లి సూర్యారావు, పద్యములు, 1924.

ఆండాళ్, తిరుప్పావై అను: మేడేపల్లి వేంకట రమణాచార్యులు, 1937.

--- తిరుప్పావై అను: కందాడై శేషాచార్యులు, 1939.

--- తిరుప్పావై అను: టి. యన్. యన్. జె. తిరువెంకటాచార్య, 1957.

--- రసధుని అను: ముత్తేవి లక్ష్మణదాసు. 1970.

--- అను: దేవులపల్లి వేంకటకృష్ణ శాస్త్రి, 1975

ఇళంగో అడిగళ్ (సిలప్పదికారం) అందియ కత అను: పూతలపట్టు శ్రీరాములు రెడ్డి, కావ్యం, 1957.

కంబన్ (రామాయణం) కంబ రామాయణము అను: పూతలపట్టు శ్రీరాములు రెడ్డి, కావ్యం, 1950, 1953.

కపిలర్ (కురింజిప్పాట్టు) శైలగీతము అను: ముదునూరి జగన్నాథరాజు, కవిత, 1968.

"కల్కి" రా. కష్ణమూర్తి (పార్తిపన్ కనవు) పార్థివ స్వప్నము అను: యన్. సి. వి. నరసింహాచార్య, నవల, 1972.

కల్కి గోపాలకృష్ణన్ (మణి యెన్న) త్రైమెంతయింది? అను: చల్లా రాధాకృష్ణ శర్మ, పిల్లలకోసం, 1967.

--- (వళి కాట్టియ ఉత్తమర్) దారి చూపిన తాత: గాంధీ, అను: చల్లా రాధాకృష్ణశర్మ, జీవిత చరిత్ర, 1969.

--- (పరక్కుం పాప్పా) పేపరు పాపాయి, అను: టి. వి. రంగాచార్యులు, పిల్లల నవల, 1960

--- (కనవు ఉలగిల్ కుళందైగళ్) స్వప్నలోకంలో, అను: సభాపతి, పిల్లల నవల.

కుమర గురుపరస్వామి (నీతి నెఱి విళక్కం) నీతి మార్గ ప్రదీపిక, అను: డి. సుబ్రహ్మణ్యం, పద్యములు, 1969.

చిదంబరనాథన్ చెట్టియార్, ఎ. (సంపాదకుడు) (తమిళ్ చిరుకదైక్కళంజియం) తమిళ కథామంజరి, అను: వాకాటి పాండురంగరావు, కథానికలు, 1972.

జయం గొండాన్ (కలిం గత్తుప్పరణి) వెన్నెలవేసవి (కొంత భాగం మాత్రం), అను: ఆరుద్ర, కవిత, 1968.

తిరువళ్లువర్ (తిరుక్కుఱళ్) త్రివర్గ ప్రదీపిక, అను: కనుపర్తి వేంకటరామ విద్యానందనాథులు, పద్యము, 1877.

--- త్రివర్గము, అను: చొక్కం నరసింహులు నాయుడు, పద్యము, 1892.

--- త్రివర్గము, అను: పూతలపట్టు శ్రీరాములు రెడ్డి, పద్యము, 1948.

--- కుఱళ్, అను: ముదిగంటి జగ్గన్నశాస్త్రి, ఇంగ్లీషునుంచి, 1952.

--- నీతిసుధ, అను: జొలయ్య, పద్యము, 1955.

--- శ్రీపదులు, అను: శొంఠి శ్రీపతిశాస్త్రి, పద్యము, 1966.

తిలకవతి, ఎ. పిల్లల టాగూరు, అను: మ. రాజారాం, 1961.

పట్టణప్పిళ్ల, పట్టణప్పిళ్ల పద్యములు, అను: బి. రామస్వామి నాయుడు, 1887.

పెరియాళ్వారు (తిరుప్పల్లాండు) తిరుప్పల్లాండు ద్విపదలు, అను: సుదర్శ నాళ్వారయ్య, స్తుతి, 1861.

భవానందం పిళ్లై, యస్. హరిశ్చంద్ర నాటకము. అను: తెలియదు. 1918.

రామలింగస్వామి (దెయ్వ మణిమాలై) దైవత మణిమాల అను: యం. పద్మ నాభం, పద్యములు, 1965.

రాజం అయ్యరు (కమలాంబాళ్ చరిత్తిరం) సంసార సాగరం, అను: శ్రీవాత్సవ, నవల.

రాజగోపాలాచారి, సి. (ఆత్మ చింతనై) ఆత్మ చింతనము అను; చల్లా రాధా కృష్ణ శర్మ, వేదాంతం, 1953.

--- (కర్పనైక్కాడు) రాజాజీ కట్టుకథలు, అను: టి. రంగాచార్యులు, పిల్లలకథలు, 1957.

--- (వ్యాసర్ విరున్దు) రాజాజీ మహాభారతం, అను: శ్రీవాత్సవ, వచనం, 1960.

--- (చక్రవర్తి త్తిరుమగన్) రాజాజీ రామాయణం, అను: కె. శ్రీనివాసా చార్యులు, వచనం, 1961.

--- (రామకృష్ణోపనిడదం) శ్రీరామ కృష్ణోపనిషత్తు, అను: ప్రత్తిపాటి సత్యనారాయణ, వేదాంతం.

వళ్లియప్ప, అళ (మణిక్కు మణి) చిట్టికి చిరుగంట, అను: చల్లా రాధాకృష్ణ శర్మ, పిల్లల నవల, 1962.

శబరి రాజన్, యం. యల్. (మన్తిర విత్తై) కడుపులో గారడీ, అను: చల్లా రాధాకృష్ణశర్మ, పిల్లలకోసం, 1960.

శఠగోప (నమ్మాళ్వారు - తిరువాయ్‌మొళి) శఠగోప గీతామృతము, అను: నల్లాన్ చక్రవర్తుల వెంకటరాఘవాచార్యులు, పద్యము, 1942.

--- శఠగోప సహస్రం, అను: మేడేపల్లి వేంకట రమణాచార్యులు, పద్యము.

--- తిరువాయ్ మొళి, అను: కె. రామానుజాచార్య, 1910,

--- శ్రీముఖ సూక్తి, అను: బచ్చు పాపయ్యశ్రేష్టి, పద్యము, 1948.

శాత్తనార్ (మణిమేకలై) మణిమేఖల, అను: పూతలపట్టు శ్రీరాములు రెడ్డి, కావ్యం, 1955

సంబందం ముదలియార్, పి. లీలావతీ సులోచనము. అను: శ్రీపాద కామేశ్వర రావు, నాటకం, 1927.

సుబ్రహ్మణ్యం, కా. నా. (అసురగణం) అసురగణం, అను: బి.వి. సింగరాచార్య, పి. సభాపతి, నవల, 1968.

సుబ్రహ్మణ్య భారతి, సి. (భారతియార్ ఇన్కవి త్తిరట్టు - ఆర్. పి. సేతుపిళ్లై సంపాదితం)భారతి వారి మధుర కవితా సంహిత, అను: పూతలపట్టు శ్రీరాములు రెడ్డి, కవిత, 1961.

--- (చందిరికైయిన్ కదై) చంద్రిక కథ, అను: గోపాలకృష్ణ, రాఘవన్, నవల, 1971.

సేక్కిళారు (పెరియ పురాణం) భక్త లీలామృతము, అను: ఒ. వై. దొరసామయ్య, వచనం, 1900.

--- శ్రీ శివభక్త చరితము, అను: పొంగూరు సూర్యనారాయణ శర్మ, వచనం, 1962.

సోమసుందరం, మీ. ప. (సంపాదకుడు) నవనాటికలు, అను: శ్రీవాత్సవ.

--- తమిళ కథానికలు, అను: చల్లా రాధాకృష్ణ శర్మ.

స్వామినాథ అయ్యరు, ఉ. వే. (ఎన్ చరిత్తిరం) నా చరిత్ర, అను: యన్.
సి. వి. నరసింహాచార్య, స్వీయచరిత్ర, 1965.

[ఈ పట్టిక అసమగ్రము.

ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యస్వామి, కరాలపాటి ఆళ్వారయ్య, మాఢభూషి గోపాలాచార్యులు ప్రభృతులు ఆళ్వారులు వెలయించిన పాశురము లను ప్రతిపదార్థ సహితంగా, తెలుగు చేశారు. ఉదాహరణానికి, మాఢభూషి గోపాలాచార్యులు కులశేఖర సూక్తిమాల, భాగవత సారము, శ్రీ గోదా సూక్తిమాల మొదలైన వాటిని తిరుపతి, శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ వారి పత్రికలో ప్రచురించారు. ఇవి పుస్తకరూపం దాల్చలేదు. అలాగే, క్రొత్తపల్లి సూర్యారావు అవ్వైయార్ సూక్తులు మరికొన్నిటిని తెలుగు చేసి 1924, 1925 లలో భారతిలో ప్రకటించారు. ఇవి కూడా పుస్తక రూపం దాల్చ లేదని నా అభిప్రాయం. కనుకనే వీటిని ఈ పట్టికలో చేర్చలేదు. నా దృష్టికి రాని మరికొన్ని తెలుగు సేతలు ఉండవచ్చు.]

# అనుబంధం. 2

## తమిళ సాహిత్యమునకు సంబంధించిన కొన్ని తెలుగు రచనలు


అణ్ణంగరాచార్య స్వామి, ప్రతివాది భయంకర: పూర్వాచార్య ప్రభావము వైష్ణవాచార్యుల జీవిత వృత్తాంతములు, వచనం, 1947.

నరసింహాచార్యులు, కె.టి. యల్ : ద్వాదశ సూరి చరిత్ర, వచనం, 2 భాగములు, 1973.





పంచాపకేశ అయ్యర్, ఎ. యస్: కోవలన్ - కణ్ణకి. ఇంగ్లీషు నుంచి వరిగొండ సత్యనారాయణమూర్తి చేసిన తెలుగుసేత.





--- మణి మేఖల ; వై. రామయోగి, పి. గోపాలయ్య, పి. నారాయణయ్య ప్రభృతులు ఇంగ్లీషు నుంచి తెలుగు చేసిన, రచన వచనం, 1950.

భుజంగశర్మ, దుగ్గిరాల: ప్రసన్న శారద, కంబ మహాకవి జీవిత చరిత్ర నభి వర్ణించే వచన రచన, 1954.

మునిరత్నం పిళ్ల, పుల్లూర్: శ్రీ జ్యోతి రామలింగస్వాములువారి జీవిత చరిత్ర సంగ్రహము, 1947.





రాధాకృష్ణశర్మ, చల్లా : మణిమంజీరము, సిలప్పదికారము నందలి కథ, వచనము, 1952.

--- తమిళ వేదము, తిరువళ్లువర్ జీవితకథను సంగ్రహంగా తెలియజేసే వచన రచన. చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రి కొన్ని కురళులకు చేసిన తెలుగు సేతలు కూడా ఇందులో చేర్చబడినవి, 1954.

--- తమిళ పంచకావ్య కథలు, సిలప్పదికారం మణిమేకలై, జీవక చింతామణి మొదలైన కావ్య కథలు, వచనం, 1955.

--- సుబ్రహ్మణ్య భారతి, భారతిసాహిత్య సింహావలోకనం ఇందలి ప్రధాన విషయం, 1965.

--- తెలుగు - దాక్షిణాత్య సాహిత్యాలు; తమిళముపై తెలుగు వెలుగు, తెలుగుమీద తమిళ ప్రభావం మొదలైన విషయములు ఇందు చర్చించ బడినవి, 1975.

--- తమిళ సాహిత్యం; 46 పుటల వ్యాసం (దక్షిణ భారత సాహిత్యములు), 1962.

--- తమిళ కవయిత్రులు; "అఖిల భారత కవయిత్రులు"లో వ్యాసం, 1965.

శేషాచార్యులు, గట్టుపల్లి: ఆళ్వారుల చరిత్ర

శేషాచార్యులు, కందాడై: సంప్రదాయ అకారాది లేక ద్రావిడాంధ్ర నిఘంటువు, నాలాయిరం దివ్య ప్రబంధ పదసూచిక యిది. వాటికి తెలుగు అర్థములు ఇవ్వబడినవి; 1993.

# అనుబంధం. 3

## సాహిత్య ఆకాడెమీ బహుమతి పొందిన తమిళ పుస్తకములు

| సంవత్సరం | పుస్తకం పేరు | రచయిత |
|---|---|---|
| 1955 | తమిళ్ ఇన్బం (వ్యాసములు). | ఆర్. పి. సేతుపిళ్లై |
| 1956 | అలై ఓశై (నవల) | కల్కి రా. కృష్ణమూర్తి |
| 1958 | చక్రవర్తి తిరుమగన్ (వచనంలో రామకథ) | సి. రాజగోపాలాచారి |
| 1961 | అగల్ విళక్కు (నవల) | ము. వరదరాజన్ |
| 1962 | అక్కరై చీమైయిల్ (ప్రయాణ గ్రంథం) | మీ. ప. సోమసుందరం |
| 1963 | వేంగైయిన్ మైన్దన్ (నవల) | అఖిలన్ |
| 1965 | శ్రీ రామానుజర్ (జీవిత చరిత్ర) | పి. శ్రీ. ఆచార్య |
| 1966 | వళ్లలార్ కణ్డ ఒరుమైప్పాడు (జీవిత చరిత్ర) | మ. పొ. శివజ్ఞానం |
| 1967 | వీరర్ ఉలగం (వ్యాసములు) | కి. వా. జగన్నాథన్ |
| 1968 | వెళ్లైప్పరవై (కవిత) | అ. శ్రీనివాస రాఘవన్ |
| 1969 | పిసిరాన్దైయార్ (నాటకం) | భారతి దాసన్ |
| 1970 | అన్బళిప్పు (కథానికలు) | జి. అళగిరిసామి |
| 1971 | సముదాయ వీది (నవల) | నా. పార్థసారథి |
| 1972 | సిలనేరంగళిల్ సిల మనిదర్గళ్ (నవల) | డి. జయకాంతన్ |

| | | |
|---|---|---|
| 1973 | వేరుక్కునీర్ (నవల) | రాజం కృష్ణన్ |
| 1974 | తిరుక్కుఱళ్ నీతి ఇలక్కియం (విమర్శ) | కె. డి. తిరునావుక్కరసు |
| 1975 | తఱ్కాల తమిళ్ ఇలక్కియం (విమర్శ) | ఆర్. దండాయుధం |

---

## సంప్రతించిన కొన్ని ముఖ్య రచనలు


తమిళము :

కందయ్య పిళ్లై: తమిళగం

కార్తికేయ ముదలియారు, యం; మొళి నూల్, 1913.

జగన్నాథన్, కి. వా.: తమిళ్ కాప్పియంగళ్

రాఘవ అయ్యంగారు, ము.: ఆరాయ్చ్చిత్తొగుది

రాఘవ అయ్యంగారు, రా: తమిళ్ వరలాఱు, 1941

వరదరాజన్, ము: తమిళ్ ఇలక్కియ వరలాఱు, 1972

ఆంగ్లము :

Meenakshisundaran, T.P. : A History of Tamil Literature, 1965

Purnalingam Pillai, M.S. : Tamil Literature, 1928

Sesha Iyengar, T.R. : Dravidian India.

Vaiyapuri Pillai, S. : History of Tamil Language and Literature, 1956


—o—